కలానిధి గ్రంథమాల—౧.

# చాటుపద్య రత్నాకరము



ఇది

దీపాల పిచ్చయ్య శాస్త్రిచే

సంపాదితము—ప్రకటితమును

ద్వితీయ ముద్రణము



చెన్నపురి:

ఆంధ్రపత్రికా ముద్రాలయమున

ముద్రితము.

1927



వెల 1—4—0.

# రాజపోషకులు

మ. రా. రా. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు బి. ఏ.
బుచ్చిరెడ్డిపాలెము

,, పొణకా గోవిందరెడ్డిగారు, అల్లూరు.

,, పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు, అల్లూరు.

,, ఈపూరు బలరామిరెడ్డిగారు, ఈపూరు.

,, వాకాటి సంజీవిశెట్టిగారు, నెల్లూరు.

,, సి. బి. మైసూరురెడ్డిగారు, చెరువు బెడగల్లు, కర్నూలుజిల్లా.

,, ఆర్. రామారెడ్డి గారు, దైవందిన్నె, బళ్లారిజిల్లా

,, చావలి కృష్ణయ్యపంతులుగారు, బి. యే. బి. యల్. నర్సరావుపేట.

# ఉద్ధారకులు

,, చిల్లకూరు సుబ్బరామిరెడ్డిగారు, కలివెలపాలెము.

,, కాకుటూరు లింగారెడ్డిగారు, మైపాడు.

,, డాక్టరు. యం. సి. సుబ్బారావుగారు, హెచ్. యమ్. బి., నెల్లూరు.

,, అడ్డాడ సిద్ధేశ్వరశర్మగారు, మడమనూరు.

# కలానిధి గ్రంథమాల

ఈకాలమున నెన్నియో గ్రంథమాలలు బయలువెడలి యెన్నోవిధముల భాషాసేవ సేయుచున్నవి. అయినను భాషా సతీవరివస్య యెందఱెన్ని తెఱఁగుల నొనరించినను, అతిమాత్రము కాదన్న నమ్మకమున మేమీయుద్యమమునకుఁ బూనుకొంటిమి.

సాధారణముగా గ్రంథమాలలన్నియు నవలా రచనమునకే తమశక్తిని ధారవోయుచున్న వనుట సత్యమునకు దూరముకానిమాట. కథాకల్పనా చమత్కారకలితమగునవల ఆనందప్రదముకాదని నేననను గాని అందు భాషావధూటి సంధులు వదలి, ధాతువులుచెడి, ధ్వనిసన్నగిల్లి, తోట్రుపాటు లేక చక్కఁగా నొక్కపదమైనఁ బెట్టఁజాలని నీరసస్థితిలోనుండునని మాత్రమనక తప్పదు. ఇఁక నలంకారములమాట అడుగవలయునా? ఇట్లనుటచే భాషాసౌష్ఠవముగల నవలలు లేవని మా యభిప్రాయము కాదు. అవి వ్రేళ్లపై లెక్కపెట్టఁ దగినన్నిగా నుండును. కల్పనాసౌందర్యమునకుఁదోడు భాషాచాతుర్యముం గల నవల సౌందర్యముతోడి సంభాషణ చతురిమగల నవలావలె రసికుల నలరింపఁజాలునుగదా?

ఏమయినను, రుచ్యంతరములేని కేవల మధురపదార్థ భక్షణము మొగము మొత్తుపగిది రచనావిభేదములేని నవలా పఠనమును విసువుపుట్టింపకపోదు. కావుననే మే మీ గ్రంథ మాలయందు సకలజన సుబోధములును సరసకర్ణ రసాయన ములును నగు ఖండకావ్యములు, (ప్రాచీన) ప్రబంధములు, నాటకములు, నవలలు, గద్యప్రబంధములు, ఆంధ్రీకరణములు మున్నగు వివిధ గ్రంథములను నాలుగుమాసముల కొకటి వంతునఁ బ్రకటించి పాఠకులకందింపఁ దలఁచి యున్నారము. మఱియు విద్యార్థులమేలు నర్థించి కాళిదాసాదిమహాకవులకావ్య ములను వచనరూపమున నాంధ్రీకరించి యిందుఁ బ్రకటింపనమ కట్టియున్నాము.

కావున భాషాభిమానులెల్లరును మా యుద్యమము నకుఁ దోడుపడి లోకకల్యాణసంధాయకు లగుదురు గాక.

చాటుపద్యరత్నాకరము ముద్రితపూర్వమైనను ప్రతు లెచ్చటను దొరకమిచేఁ బలువురికోరికపై నిందు ప్రథమకుసు మముగా వెలువరించితిమి.

సంపాదకుఁడు.

# పీ ఠి క

## (మొ ద టి కూ ర్పు)

ఆంధ్రభాషాభిమాని సోదరులారా!

వాగనుశాసన కవిసార్వభౌమాంధ్రకవితాపితామహాది మహామహులచే నెత్తిపెంపఁబడి, రాజాధిరాజులచే లాలింపఁబడి, దేశభాషాలతాంగులకుఁ దలమానికమై చెన్నారిన మన యాంధ్రభాషావధూటి, తన ముద్దులొలుకు పలుకులను కేవల పురాణకావ్య ప్రబంధరూపములనే కాక చాటు పద్యరూపమునఁగూడ వెలయించి వెలలేని ఖ్యాతి నందియున్నది. ఆ చాటుఫణితి యొక్కొక్కపట్టునఁ బ్రబంధసరణిం గూడ నధఃకరించుననుట కవితాతత్త్వజ్ఞులకు విదితము.

చాటువులు కేవల కల్పనాకథాత్మకములును—అత్యంతాతిశయోక్తిమయములును—గాక విషయానుకూల స్వాభావికవర్ణనాలంకృతము లయి, సర్వజనహృదయంగమము లయి రస మొలుకుచుండును. అంతేకాక పూర్వరాజుల గుణగణములను, అప్పటి దేశస్థితులను; నాఁటి యుద్ధములను; జయాప

జయములను; కవులను; పండితులను; వారివారి వివాద సామర్థ్యములను; మఱియు ననేకవిషయములను దెలిపి ప్రకృత దేశచరిత్రకారులకును, కవులకును జేయూఁత నొసఁగఁజాలి యున్నవి.

ఇట్టిచాటువు లాంధ్ర ప్రపంచమున నెన్నియో జన్మించినవి. అందొకకొన్ని తాళపత్ర గ్రంథములఁ జేరి, రామబాణముల వాతఁబడి నశించినవి. ఇంకను నశించుచున్నవి. మఱికొన్ని తాళపత్రముల కెక్కక, కొందఱుముదుసళ్లనోటన నెలకొనియుండి నేఁటికి నామమాత్రావశిష్టము లైనవి. పోయినవి పోయిన నిప్పటికి ననేకపద్యములు నిల్చి యున్నవి. కాని అవి యొకగ్రామమున నొకయింట నొక పొత్తమున లేమిని వానిని సంతరించుట మిగులఁ గష్టము. చాటుపద్య రత్నములఁ గూర్చి శ్రద్ధవహించినవారు లేకపోవుటచేత నవి యట్లు దిక్కుమాలి పడి యుండెను. మొన్న మొన్న బ్ర. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు కొన్నిచాటువులంగూర్చి— యీనవీన మహాకార్యమునకు మార్గదర్శకులయి— "చాటుపద్య మణిమంజరి" యను గ్రంథము నాంధ్రలోకమున కొసంగి వినుతిపాత్రులైరి. సామాన్యముగ లోకములో వాడుకలో నున్న చాటువులే కాక యెన్నియో పురాతనచాటువు లందున్నవి. అయిన నందుఁ

జేరని చాటువు లెన్నియో యింకను మేఘముల మఱుఁగున నున్న తారకలవలె నందందునున్నవి.

ఈవిషయము నెఱింగి బ్ర. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ఈచాటుగ్రంథసంపాదకులలో రెండవవారుగా బయలు వెడలిరి. వీరి ప్రయత్నము సకలాంధ్రజనశ్లాఘ్యము. వీరు వయస్సునఁ బిన్నలయ్యును, తమకుఁ గల భాషా ప్రవేశాభిమానములు చెలులై తోడునడువ, వ్యయప్రయాసముల కోర్చి దేశసంచరణ మొనర్చి—మణిమంజరిలోఁ జేరని చాటువు లించుమించుగ నాఱువందలను గూర్చి యీ 'రత్నాకరము'ను వెలువరించి మన కందఱకు నానందము గలిగించిరి. ఇందులకు మన కృతజ్ఞతను దెల్పుటతోఁ దనివినందక, యిఁక నిటువంటి గ్రంథములను సంపాదింప మనశాస్త్రిగారికిఁ బ్రోత్సాహ మొసంగి వారి యుద్యమమునకుఁ దోడుపడుటయాంధ్రులమగు మన కెల్లరకును గర్తవ్య మని విన్నవించుచున్నాను.

9-7-17,
తోటపల్లిగూడూరు, నెల్లూరు.

ఇట్లు: కవిజనవిధేయుఁడు,
పొణకా పెంచెలు రెడ్డి.

# విషయసూచిక.

## ప్రథమతరంగము

## చతుర్థతరంగము

## పంచమతరంగము

## శ్రీ రస్తు

# చాటుపద్యరత్నాకరము

## ప్రథమతరంగము

శ్రీసీతాహృదయాబ్జభృంగ! సితరాజీవాభ్రమాతంగగం
గాసారంగధరాంగజాహితతురంగ క్షీరనీహారతా
రాసాధారణసాధుకీర్తి రుచిచర్చాభాసురాశాంతభా
మాసందోహశుభాంగ! భద్రగిరిరామా! దీనచింతామణీ!

క. నిడ్గేడ్గుణాహార! జీవన
రాడ్గళగళితాస్త్రప్రుషితరాజత భూభ్రా
ద్ధీడ్గిరిజాధిపనుత! ఖగ
రాడ్గామి! చల్లగరిగ రామస్వామీ!

సీ. అజనిజాగ్రజభుజానుజసుజాంగ జయజా
ర్కజయజాంబుజభజాభజనభాజ
సురవరాధరచరాచరధరాధరచరాం
తరవరాకరవరత్వర విహార
ఘనతసాతనజనావనమనావనమన
స్సునయనాయనధనాధననిధాన
నతహితాశ్రితమతాన్వితశతాయుతకృద
ద్భుతపదాతి..............

నవ్యభవ్య మహోత్తమ దివ్యకావ్య
వీరఘోరభయాపహధారధీర
శోణకోణసముజ్జ్వలద్బాణతూణ
ధామభీమశరాసనస్తోమ, రామ!

సీ. మొదటిభూతము మహోద్భూత మైనపెనుబండి
బండిమోయఁగఁ జాలుబలువుధనువు
ఇరుభూతమునఁ బుట్టువిరిపట్టి సారథి
సారథిజనకుండు సరవి శరము
మూఁడవభూతంబు జోడుబాణము నారి
నారిని నోడించినట్టి పింజ
చతురభూతము తిండిశాయి కన్నులుగాల్లు
గాల్లఁ బుట్టినచోటు కొనుఁ దలయుఁ
జేసి పంచమభూతమ్ముఁజేరి యున్న
త్రిపురసురవైరి వైరి, వైరిమదహరుఁడు,
హరుఁడు, నేత్రాగ్నివిధ్వస్తమరుఁడు, గురుఁడు,
ఎప్పుడు మాపాలఁగల్గ నిం కేమికొదువ?

చ. కమలజకృష్ణశంకరులు, కాంచన నీల పటీరవర్ణు, లా
గమ నగ చంద్రధారు, లఘు కంస పురారులు, హంసతార్క్ష్యగో
గమనులు, జన్మపోష లయకారులు, వాక్కమలాంబికేశ్వరుల్
శమ కరుణా విభూతి ఘనశక్తులఁ బ్రోతురు మమ్ము నెప్పుడున్.

క. కుముదములు మల్లెమొల్లలు
ప్రమదంబునఁ గోసి తెచ్చి ప్రాభవ మలరన్
సముఖమునఁ బూజసేతుము
సుముఖత మాకిమ్ము బుద్ధి శూలికుమారా!

చ. జనకునకు న్విషం బిడినసాగరుతోయము లన్ని నేలపా
లొనరఁగఁ జేతు నంచుఁ గరమూనిన గౌరియుఁ జూచి "వద్దురా

తనయ! సురేంద్రుధాటి కిటు దాఁగినమామను బైట వేతురా?"
యనినఁ గరమ్ముఁ దీసిన గజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

శా. సాటోపారభటీకఠోరతర సంధ్యానృత్తకేళీనిరా
ఘాటప్రౌఢనిరూఢగూఢపవరాడ్గ్రైవేయ భాస్వజ్జటా
జూటాంతర్విలుఠత్తరంగ సుమనస్స్రోతస్వినిన్ నిర్ఝర
వ్యాటీకోత్కటచాటువాక్యఘటితన్ వర్ణించెదన్ శారదన్.

ఉ. శంభుజటాటవీతటవిశంకటవిస్ఫుటదివ్యవాహినీ
శుంభదనర్గళప్రభవశోభితరంగదభంగభంగసం
రంభవిజృంభమాణదరహాసఘుమంఘుమనాదలీలవా
గ్జృంభణ మొప్ప నిన్ను మదిఁ జేర్చి నుతింతు మదంబ, భారతీ!

ఆ. అక్షరంబు తల్లి యఖిలవిద్యల కెన్న
నక్షరంబు లోకరక్షణంబు
అక్షరంబు లేని యబలున కెందును
భిక్ష పుట్టఁ బోదు పృథ్విలోన.

క. కవితాకన్యకగుణములు
కవికన్న రసజ్ఞుఁ డెఱుఁగుఁ గవి యే మెఱుఁగున్?
భువిలోఁ గన్యకగుణములు
ధవుఁ డెఱుఁగును గాక కన్నతండ్రే మెఱుఁగున్!

క. సుకవికవిత్వము తార్కిక
నికరంబులలోన నెట్లు నిల్వఁగ నేర్చున్?
మకరాంకకేళి కోర్చిన
ముకురానన మల్లయుద్ధమున కెట్లోర్చున్

క. మూఢుం డెఱుఁగునె సత్కవి
గూఢోక్తులసార మెల్లఁ గోవిదునివలెన్?
గాఢాలింగనసౌఖ్యము
ప్రౌఢాంగన యెఱుఁగుఁగాక బాలే మెఱుఁగున్!

ఉ. సాగరధీర! సత్కవితఁ జక్కఁగ నేర్చిన సద్బుధావళిన్
బాగని మెచ్చుసత్కవులపాదరజంబుఁ దలం ధరించెదన్
దాఁ గడుహీనుఁడై సభలఁ దప్పులు వట్టెడుదుష్కవీంద్రునిన్
"ఛీ! ధగడీ! గులామ!" యని చెప్పున దంతము లూడఁ దన్నెదన్.

ఉ. గొప్పకవీంద్రుఁడైన వినఁగోరుఁ గవిత్వము; తోఁచినంతలోఁ
జెప్పును దప్పునొప్పు; నిరసింపక దిద్దును; శంకయయ్యెనా
తప్పులఁబట్టు; యుక్తిఁ బెడదారికిఁ దీయు; గరాసు దానిఁదా
ద్రిప్పటఁబెట్టు, వానితలఁదీయ సదాశివ సద్గురుప్రభూ!

క. గుణియెఱుఁగు గుణులగుణములు
గుణహీనుం డేమియెఱుఁగు గుణులగుణంబుల్?
గుణనిధి తుమ్మెద కమలము
గుణమెఱుఁగునుగాక కప్ప గుణ మేమెఱుఁగున్?

మ. తొలిత్రోవన్ విడకుండి లోనితమముం దోడ్పాటుగా మూలమూ
లలఁ జెల్వారుపదార్థముల్ విరసము ల్గావించు చిట్టెల్లచా
యలదోషాచరణైకవృత్తిఁగని సూర్యాలోకభీతిం బ్రవ
ర్తిలుచుం డాఁగు గరాసు కంఠకలితశ్రీ కోటి కాకొండె కా.

మ. తమి నందంబుఁ జరించి కొట్టఁబడి యంతశ్ఛిద్ర మచ్చో లభిం
పమికిం జింతిలి సాధ్వసమ్మతుల పై బాధింప సత్పాత్రజా
లములన్ ఖండనసేయుచుం దనకులీలామార్గముల్ సాగకా
ర్తిమెయిం జిక్కఁగరాసు కంఠకలిత శ్రీ కోటి కాకొండెకా.

ఉ. కూరకు నుల్లిగడ్డలకు గుమ్మడిపిండెకుఁ జల్లనీళ్లకున్
నారకుఁ గట్టెపుల్లలకు నాథలకుం గృతులీయ రోసి యా
భారతిపోయి లక్ష్మికి నుపాయముఁ జెప్పెను 'కైతమాటికిం
జేరకుమమ్మ, నేఁ బడినచిక్కులు పెక్కులు నిక్క మిక్కతల్

ఆ. కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ సూరవరులు

తణముసేయువేళ 'రా' కొట్టి పిలుతురు
పాడి యదియు మిగుల భజన కెక్కు.

ఉ. వీడనిమూర్ఖునొద్ద నెఱవిద్యలు రూఢికి రావ కెట్లనన్
బూడిదహోమమై చవుటఁబూన్చినవిత్తయి వెఱ్ఱిముండతోఁ
గూడినకూటమై విధవకొప్పునఁజుట్టినపుష్పమాలయై
గాడిదపాహమై యడవిఁగాచినవెన్నెలయై వృథాయగున్.

## వేములవాడ భీమకవి

ఈయుద్దండకవి శాపానుగ్రహశక్తి గలవాఁడు; శంభు వరప్రసాదమును బడసిన మహానుభావుఁడు. ఇతని పుట్టుకను గుఱించియు, నీతనిశక్తినిగుఱించియు ననేకచిత్రగాథలు కల ఈకవి తనశక్తి నిట్లు చెప్పుకొనెను.

సీ. గడియలోపలఁ దాడికడఁగి ముత్తునియఁగాఁ
దిట్టిన మేధావిభట్టుకంటె
రెండుగడెల బ్రహ్మదండిముండ్లన్నియు
డుల్లఁ దిట్టినకవిమల్లుకంటె
మూఁడుగడెలకుఁ దా మొనసి యత్తినగండి
పగులఁ దిట్టినకవిభానుకంటె
అఱజాములోపలఁ జెఱువునీళ్లింకంగఁ
దిట్టినబడబాగ్నిభట్టుకంటె
నుగ్రకోపినేను నోపుదు శపియింపఁ
గ్రమ్మరింప శక్తిగలదు నాకు
వట్రమానఁ జిగురుఁ బుట్టింప గిట్టింప
బిరుదు. వేములాడ భీమకవిని.

ఈతనిగూర్చి వేఱొకకవిచేఁ జెప్పఁబడినపద్యము:

చ. మతిఁ బ్రభ నీగిఁ జేర్మి సిరి మానము పెంపున భీమునిన్ బృహ
స్పతి రవిఁ గర్ణు నర్జును గపర్ది సుయోధను బోల్పఁ బూననా
మతకరిఁ దీక్ష్ణు దుష్కులు నమానుషు భిక్షు ఖలాత్ము నెంచ వా
క్పతిపు శశిన్ శిబిన్ గొమరుసామిని మేరువు నబ్ధిఁ బోల్చెదన్.

ఈకవి ఏకారణమువలననో కోపము పెల్లుబ్బేగి కోమటిపైఁ జెప్పిన-పద్యములు:

చ. గొనకొని మర్త్యలోకమునఁ గోమటి పుట్టఁగఁ దోడఁ బుట్టె భొం
కును గపటంబు లాలనయుఁ గుత్సితబుద్ధియు రిక్తభక్తియున్
జనిమిరిమాటలున్ పరధనంబును గ్రక్కున నొక్కఁజూచుటల్
కొనుటయు నమ్మటల్ మిగులగొంటుతనంబును మూర్ఖవాదముల్.

ఉ. కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేద యింటికిన్
నేమ మెఱింగి చిచ్చిడినఁ జెందదు పాపము వానినెప్పుడే
నేమఱుపాటునన్ మఱియు నేమియొనర్చిన లేదు దోస మా
భీమునిలింగమాన; కవిభీమునిపల్కులు నమ్మయుండుఁడీ.

అని యీకవి పద్యమును జెప్పఁగా విని వేఱొకకవి:

ఉ. "లేములవాడ భీమ! భళిరే! కవిసన్నుత! పద్యమందు నీ
వేమని చెప్పినాఁడ వొకయించుక కోమటిపక్షపాతివై
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేదటందురా?
కోమటి కొక్కటీక పదిగొన్నను దోసము లేదు లేశమున్."

అని పద్యమును జెప్పెను. (వేములవాడ భీమకవికి, వేములాడ భీమకవి, లేములవాడ భీమకవి యనుపేర్లుగూడ వాడఁబడి యున్నవి). ఒకానొకవిప్రుఁడు తనప్రియురాలితోఁ దనకు వియోగము ప్రాప్తమైనవెనుక మరల దానిని సాధింపనేరక

మిడుకుచుండ భీమకవి యీ క్రింది పద్యము నొసంగెనఁట. ఆ పద్యముతో నాబ్రాహ్మణుఁడు తన కార్యమును జక్కఁబెట్టుకొనె నఁట.

ఉ. నవ్యవిలాససమ్యనలినం బని బాలముఖాబ్జసౌరభా
భివ్యసనంబునం దిరుగు భృంగకులోత్తమ! తద్వియోగతా
పవ్యథఁ బ్రాణినిల్వదు; కృపాగుణమేర్పడ "బ్రాహ్మణోవ హం
తవ్య" యనంగ నొప్పు వచనస్థితిఁ గుంద కెఱుంగఁ జేయుమా.

భీమకవి యొకతఱి నొకకుగ్రామమునకుఁ బోయి యుండి జన్నమాంబయను నొక విప్రవితంతువును "వంటఁజేసిపెట్టు" మని కోరఁగా నామె "అయ్యా! నేను గండమాలావ్రణముతో నల్లాడుచున్నాను; నాకిప్పుడు వంటఁజేయశక్తి లే"దని విన్న వించెను. అందుపై భీమన "అమ్మా! యీగండమాలఁ బోఁగొ ట్టిన వంటఁజేసి పెట్టెదవా?" యని యడుగ "మహానుభావా! తమకంతటి యనుగ్రహము రావలయునుగాని వంటఁజేయుట కేమియభ్యంతర" మనెను. అప్పుడు భీమకవి

క. ఘనరోగంబులబలమా
కనుఁగొనఁగా జన్నమాంబకర్మఫలమా!
నినుఁ బ్రార్థించెద వినుమా!
మునుకొని యీగండమాల మునగకుఁ జనుమా.

అను పద్యమును జెప్పఁగా నావిశ్వస్తకంఠముననున్న వ్రణము మునగచెట్టునకుఁ జేర నంతట నామె యత్యంతానందభరితయై కవీంద్రునకు షడ్రసోపేత మగు భోజనముం బెట్టి తనకృతజ్ఞతను జూపెను.

తరువాత మఱికొన్ని దినములకు భీమన మరల నాగ్రామమున కే పనియుండి వచ్చి యా విధవనే వంటఁ జేసి పెట్టుమని కోరగా "మాకిదే పని, ఇంకేమి పనియున్నది? ఇప్పుడు మా యింట్లో వీలుగా"దనెనఁట. దానిపై భీమనకుఁ గోపము వచ్చి

గీ. మున్ను జన్నమాంబ మునుకొనియుంటివి
యేను బొమ్మటన్న యీవుజన్న
ముండ యేఱుగడచి ముదిపెండ్లికతఁ సేసె
మునగగండమాల ముండఁ బట్టు.

ఆ. ఏను భీమకవిని ఇదె నిన్నుఁ బ్రార్థింతు
మునుపు నీవువచ్చి ముంచఁబట్టి
మునగకొండ యయ్యె మునుపటిరీతిని
మునగగండమాల ముండఁబట్టు.

అనుపద్యములం జెప్పఁగా జన్నమ్మ కంఠము మున్నున్నరీతినే చెందెనట.

## బమ్మెర పోతరాజు

పోతరాజకృతభాగవతమ్మునఁ బ్రాసమునందు రేఫఱకారములకు సాంకర్యము కలదనియు నందుచే లాక్షణికులు లక్షణగ్రంథముగా భాగవతము నెత్తుకొనలేదనియు నప్పకవి తన గ్రంథమున

ఉ. "బమ్మెరపోతరాజకృతభాగవతమ్ము జగద్ధితమ్ముగా
కిమ్మహి నేమిటంగొదువ యెంతయు సారసిచూడఁగాను రే

ఘమ్ములు తాలుసుంగలసి ప్రాసములైన కతమ్మునం గదా
యిమ్ముల నాది లాక్షణికులెల్లరు మాని రుదాహరింపఁగన్."

అనుపద్యమును వ్రాసెను. ఈపద్యమును జూచి వేఱొక కవి భాగవతమునందుఁ దనకుఁగల గౌరవమును వెల్లడించుచు నీ క్రిందిపద్యమును రచించెను.

ఉ. బమ్మెరపోతరాజకృతభాగవతమ్ము జగద్ధితమ్ముగా
కిమ్మహి నేమిటంగొదువ ఎల్లపుడున్ భవనాశహేతుభూ
తమ్మయి, లోకనాయకకథావినివేశితసర్వసాధుచి
త్తమ్మయి, గోస్తనీరసయుతమ్మయి యున్కినో, పాపి విన్కినో?

## శ్రీనాథ కవి సార్వభౌముఁడు

ఈకవిసార్వభౌముఁడు పదుమూఁడు పదునాలుగుశతాబ్దములలోఁ గొండవీటిసీమ నేలిన రెడ్డిరాజుల యాస్థానకవి. ఆంధ్రప్రపంచమున నీవిద్వత్కవి నెఱుంగనిచదువరి యుండఁడు. మిగుల సమర్థుఁడును, రసికశిఖామణియు నగు నీ పండితకవి శృంగారనైషధాది మహాప్రబంధముల రచించి వినుతిఁ గాంచుటయే కాక నానాదేశసంచరణం బొనర్చి, సుఖదుఃఖంబులననుభవించి, తత్తత్సందర్భసూచకములగు ననేకచాటువుల విరచించి, తులలేనియశస్సుఁ జెంది, తుదకు "దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ" స్వర్గము నలంకరించెను. ఈ మహామహుని చాటువులలో రసవత్తరము లిందుదాహృతములు.

ఇక్కవి పల్నాటిసీమలోఁ బ్రయాణము సేయుతఱి నొకనాఁటి పయనమున, మార్గమధ్యమున, దగఁ జెంది, దప్పిదీర్పు

కొనుటకై చెంతనున్న యొకచెఱువునకుఁబోఁగా, నందు నీరు లేకపోయెను. అప్పుడీకవి ఈక్రిందిపద్యమునాశువుగాఁ జెప్పెను.

క. సిరిగలవానికిఁ జెల్లును
తరుణులఁ బదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
తిరిపమున కిద్దఱాండ్రా ?
పరమేశా! గంగ విడుపు పార్వతి చాలున్.

పల్నాటిసీమలోని మిద్దెలనుగుఱించి చెప్పిన పద్యము:

ఉ. మిద్దెలుమిద్దెలన్న మనమేడలకంటెను సొంపునించి బల్
నిద్దపుసౌధజాలముల లీలవెలుంగునటంచు నెంచి నే
నద్దిర! మోసపోతి సకలాభరణమ్ము లమర్చి కస్తురిన్
దిద్ది కచంబుఁ జెక్కినసతిం బురుడించును మిద్దె లిచ్చటన్.

ఒకానొకసమయమున శ్రీనాథున కేదో జబ్బు సంభవింపఁగా వైద్యు లులిమిరిచెక్కతో నౌషధ మిచ్చి రొట్టె పథ్యము పెట్టి, గాలి తగులనిచోటఁ బరుండవలయు నని చెప్పిరఁట. ఆతఁ డట్లే యొకచీఁకటిగదిలోఁ బాధతోఁబరుండి, యా సమయమునఁ జెప్పుకొనిన పద్యము.

చ. ఉలిమిరిచెక్కయున్ మిగులనుక్కయుఁ జప్పని రొట్టెముక్కయున్
మలినపుగడ్డలున్ నులకమంచపుఁగుక్కియు జీఁకటింటిలోన్
దలఁచిన రోఁతవచ్చు నొకనాఁటిసుఖం బొకయేటి దుఃఖమౌఁ
బలివెలవారకాంతల........బగివేల దండముల్.

శ్రీనాథుఁ డొకమంగలిసుమంగలిని వర్ణించినవర్ణనము:

ఉ. ముంగురు లుంగరాలు, చను మొగ్గలు బంగరుబొంగరాలు, క
న్నుంగవ గండుమీలు, సుమనోవృతమై తగు వేణిబంధమౌ

సింగులువారు చీరె కటిసీమపయి న్నటియింప వచ్చె న
న్నంగిలివారికాంత విటమానసమంతయుఁ జూరఁ బుచ్చుచున్.

## కంసాలస్త్రీపైఁ జెప్పిన పద్యము:.

క. అంసాలంబితకచభర
హంసాలస మందగమన హరిణాంకకళో
త్తంసాలంబిత కుచభర
కంసాలవధూటి యెదుటఁ గానంబడియెన్.

## శ్రీకాకుళము తిరునాళ్లకు వెళ్లినప్పుడు చెప్పినది:

శా. హైమగ్రావనితంబభూరికచభారాభీర లున్మత్తలున్
గామాంధల్ వెలనాటికోడెవిధవల్ కాకుళ్లతిర్నాళ్లలో
మామాంధాతయు, భీమసేనుఁడు, హిడింబానందనుం డోపితే
నేమోకాని తెమల్పఁజాల రితరుల్ హేలారతిక్రీడలన్.

## కురువజాతిస్త్రీపైఁ జెప్పినపద్యము:

* క. కురువది కంబడిఁగట్టుక
కలికున కోర్వంగలేక గజ్జలదనుకన్
బరికీ బరికీ బరికీ
బరికీ మరునిల్లుబట్ట బయలుగఁజేసెన్.

కవిత్వముఁ జెప్పుమని తన నూలికి బాధింపఁగా విసికి, త్రోవను బోవుచున్న యొకగాడిదనుజూచి యీక్రింది పద్యమును జెప్పెనఁట. అందుపై నాపృచ్ఛకులు సిగ్గిలి శ్రీనాథుని జోలికిఁ బోక మిన్నకుండిరఁట.

---

* ఈజాతివాండ్రు గొఱ్ఱెయున్నితో గొంగళ్లు నేయుదురు. వారు గట్టుకొనుట కట్టిబట్టలే యుపయోగింతురఁట.

ఉ. బూడిదబ్రుంగినై యొడలుపోఁడిమిఁదప్ప మొగంబు వెల్లనై
వాడలవాడలన్ దిరుగ వారును వీరును జొచ్చొచో యనన్
గోడలగొందులన్ దిరిగి కూయుచు నుండెదు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివి కావుగదా? యనుమానమయ్యెడున్.

ఒకానొకసభయం దీకవికి "అందఱు నందఱే మఱియు నందఱు నందఱె యందఱందఱే" యను సమస్యను సభ్యులీయఁగా అప్పటి వారి యుద్దేశముల నెఱింగి కవిసార్వభౌముఁ డిట్లు పూరించెను.

ఉ. కొందఱు భైరవాశ్వములు కొందఱు పార్థుని తేరిటెక్కెముల్
కొందఱు ప్రాక్కిటీశ్వరులు కొందఱు కాలునియెక్కిరింతలుం
గొందఱు కృష్ణజన్మమునఁ గూసినవారలు నీసదస్సులో
నందఱు నందఱే మఱియు నందఱు నందఱె యంద అందఱే.

ఈకవి యొకనంబికన్నియపైఁ జెప్పినపద్యము:

క. నడినూకలేని బియ్యము
వడఁబోసిన నెయ్యి బుడమవరుగున్ బెరుఁగున్
గడుఁ బేర్మి మాకు నొసఁగిన
అడిమాచలనంబిచేడె నడిగితి ననుమీ.

## అల్లసాని పెద్దన

ఈయాంధ్రకవితాపితామహునిం గూర్చి యెఱుఁగని వా రుండరుగదా! ఇమ్మహాకవి చాటువుల నేకములు. కృష్ణదేవ రాయలు గండపెండేరము నొసంగి తనను గౌరవించినప్పు డీకవి రాజుగారిని దీవించెను. ఆదీవెన యిది:

శా. క్షీరాంభోనిధియందు యోగసరణిం జిచ్ఛక్తిఁ బ్రాపించి త
ద్ఘోరాజత్కకుబస్థ గోపవిలసద్ఘోరాజగోలోకతా
స్ఫారాలోకన తేజగాత్రచలనస్వాంతాద్రిదంభోళి కృ
త్స్వాతజ్ఞానసనందనాదిమునిబృందాధిక్య సామర్థ్యవాః
పూరాకారత నిద్రఁ జెందుకరుణాంభోరాశి నిన్ బ్రోవుతన్.

ఒకనాఁడు కృష్ణరాయఁడు భద్రగజంబునెక్కి వాహ్యాళి వెడలిపోవుచుండఁగా మార్గమధ్యమునఁ బెద్దన యెదురయ్యెను. అప్పుడా రాజుగారు తనమదకరీంద్రమును నిల్పి, కవీంద్రునిఁదన సరసన కూర్చుండఁబెట్టుకొని "యేమి విశేషము" అని యడుగఁగాఁ బెద్దనగా రిట్లనిరి.

మ. గవనుల్ బ్గిదపయ్యె డిల్లికిని, మక్కాకోట మేటయ్యెఁ,
భువనంబెల్ల నదల్చి పుచ్చెననఁగాఁ బోలేరు సందేరులన్
రవసం బెక్కె, బెడందకోటపురకాంతాగర్భ నిర్భేదన
శ్రవణంబయ్యె భవత్ప్రతాపజయవార్తన్ కృష్ణరాయాధిపా!

ఇక్కవీంద్రుని గుఱించి వేఱొకకవి వ్రాసిన పద్యము:

సీ. కృష్ణరాయలపేరఁ గృతిని నీవొనరించి
తివి తొల్లి విష్ణుచిత్తీయమనఁగ
కాఠిన్యమర్థంబు గ్రాహ్యంబుగాదు సా
ధారణుల కని భూధవుఁడు పలుకఁ
దరువాత మనుచరిత్రము రచియించి తు
త్తమకావ్యము మహాద్భుతముగఁ బిదపఁ
బెక్కుకావ్యంబులు పెంపెక్క రచియించి
మంటివి రాజసమ్మానమునను

భంగ మొందిన యలరామలింగముఖులు
సాటి రాఁగలవారె నీతోటి; ఔర!
ఆంధ్రకవితాపితామహ, యల్లసాని
పెద్దనార్య, విశేషవివేకధుర్య!

ఒకనాఁ డాంధ్రకవితాపితామహుఁడు ఈ క్రిందిపద్య మును వ్రాయ నారంభించి

మ. "మృగమదకల్పంబు వికారలీల దిగి ధమ్మిల్లంబుఁ జేబూని రా
గద వృక్షాలముతోడఁ గౌను నులియంగా మోము మార్వోచుట్టుగా
సెవలం జాటినవీఁ బట్టుకొని యావామాక్షి యట్లేఁగెఁ......"

అని యంతవఱకువ్రాసి పైనెట్లు ముగించుటకుందోఁచక తాటియాకును గంటము నచటఁబెట్టి యెచ్చటికో పోయెనఁట. పెద్దనగారికూఁతు రాయసంపూర్ణపద్యమునుం జదివి యారీతిఁ బూరించెనఁట.

"వ, త్సదన భ్రాజితరత్నదీపకళికా స్తంభంబు క్రీనీడకున్."

పెద్దనగారేదోరీతిని బద్యమును బూర్తిఁజేసి యాయభి ప్రాయమును తాటియాకుపై లిఖింపఁబోవఁ బైరీతినివ్రాయఁబడి యుండెను. తన యభిప్రాయమునకన్న నాయభిప్రాయమే రస వంతముగానున్న కతన దాని నట్లేయుంచి, అట్లు పద్యమును బూరించి నది తనకూఁతురని యెఱింగి యపరిమితానందమును జెందెనఁట.

## తెనాలి రామకృష్ణ కవి

పండితమండనుఁడై, కవులలోఁ బ్రౌఢకవియై, హాస్యరస మునకుఁ బుట్టినిల్లై, రాజులచేతను, కవిరాజులచేతను బూజ లంది, ఆచంద్రతారార్కమైన కీర్తిసంపాదించి, తన పేరుభూమి

డలమున సుస్థిరముగా నెలకొల్పి చనిన యీకవిపుంగవు నెఱుంగనివా రెవరు?

భట్టుమూర్తి వలెనే యీతఁడును కృష్ణదేవరాయల యాస్థానకవియె. ఈ యిరువురకును నిరంతర వైరము.

రామకృష్ణకవి స్నానముఁ జేయఁడనియుఁ, సంధ్యానుష్ఠానముల నెఱుఁగనేయెఱుఁగఁడనియు, ననాచారుఁడనియు, భట్టుకవి యాక్షేపించెనఁట. దానికి వికటకవి, వచింపరాని వాక్యములతో నొకపద్యపాద మల్లి జవాబు నొసంగెనఁట. అందుచే భట్టుమూర్తి యవమానముఁ జెంది యాసంగతినిరాయల వారికి విన్నవించుకొనెనఁట. దానిపై రాయఁలు కోపించి "కృష్ణకవీ! ఇట్టిజవాబేనా యొసంగఁదగిన" దనెను. రామకృష్ణుఁడు "మహాప్రభూ! నాయంతటివాని నీశూద్రుఁ డాక్షేపించుట తగవా! వాని కెట్టిజవాబు నొసంగవలయునో అట్టిజవాబే యొసంగితి"న నెను. రాయఁలు, "నేనే యాక్షేపించితి నేమిజవాబు నొసంగెద"వని యాగ్రహముతో న నెను. వెంటనే రామకృష్ణకవి తానల్లినపద్యపాదములోని పదములనించుక మార్చి పద్యముఁ బూర్తిఁ జేసి యీక్రిందిరీతిని వినిపింపఁగా రాజుగారు మనరామకృష్ణుని సామర్థ్యమున కానందించిరి.

శా. శ్రీనీరేజదళేక్షణాహృదయరాజీవభ్రమచ్చంచరీ
కానూనాస్త్ర ధురంధరుండు హరుఁ డార్యాప్రాణనాథుండు ని
త్యానందుండు శివుండు నాహృదయపద్మాసస్థుఁడై యుండఁగా
స్నానంబా తలకా? జపంబు మడికా? జందెంబు నా తప్పుకా?

భట్టుకవియందు కృష్ణదేవరాయలకు గౌరవము హెచ్చు. అక్కతన రాయలు బట్టుకవికి యర్ధాసనం బొసంగెను. అందు లకుఁ దక్కినకవులందఱు నీర్ష్యాసూయాగ్రస్తు లయ్యును, నే మనుటకు ధైర్యముచాలక యిన్నకుండిరి. అప్పుడు రామ కృష్ణుఁడు లేచి

ఉ. పండితు లైనవారలు సభాస్థలి నుండఁగ నల్పుఁ డొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబున కేమి లోటగున్
గొండొకకోఁతి చెట్టుకొనకొమ్మకు నెక్కినఁ గ్రిందినుత్త వే
దండ మహోగ్రసింహములు తొలిమినందవె రాజచంద్రమా!

అనుపద్యమును జదివెను. బట్టుకవి యేమియు ననఁజాలక శిరమ్ము వంచుకొనెను.

ఉ. గండము తప్పె నాంధ్ర కవిగానికి నిన్నటిరేయి ... ...
... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...

ఈపద్యమును గృష్ణకవి యాంధ్రకవితాపితామహునిఁ గుఱించి చెప్పెనందురు; కాని రామకృష్ణునకుఁ బెద్దనపై నతి గురుత్వము కలదు. ఈవిషయమును రామకృష్ణునిదైన యీ క్రిందిపద్యము దృఢపఱుచుచున్నది.

క. కవి యల్లసాని పెద్దన
కవి తిక్కనసోమయాజి గణుతింపంగాఁ
గవి నేను రామకృష్ణుఁడఁ
గవియను నామంబు నీరుకాకికి లేదే?

అయినను రామకృష్ణుఁడు పరిహాసమునకుఁ జెప్పియే యుండునని యెల్లవారికిని దోఁపకమానదు.

వాకిటికావలియగు తిమ్మనికి రాజుగా రెప్పుడో యొక మంచిసేలువ నిచ్చిరఁట. దాని నతఁడు కప్పుకొని క్రుమ్మరుటఁ జూచి, మన వికటకవి దానిపైఁ గన్ను వేసి, యెట్లైనను దానిని గాఁజేయవలయునని యూహఁజేసి. యుపాయము గుదుర్చుకొని యొకనాఁడుఁ దిమ్మనిఁ బిలిచి మెల్లఁగా నిట్లు బోధించెను. "ఓయీ! కృష్ణదేవరాయలవంటి మహారాజుగారి ద్వారపాలకుఁడవై, యొకపద్యమునైనను గృతినందకుండుట నాకిష్టము లేదు." అనఁగా "అయ్యా! తగినంత బహుమానము నియ్యనిదే కవులు పద్యములు చెప్పరురా" యనెను. రామకృష్ణుడు "తిమ్మా, నే నుపాయముఁ జెప్పెద వినుము; ఒక్కొక్కకవి నొక్కొక్కచరణమువంతున నడిగితివేని సులభముగాఁ బదిపద్యములఁ గృతినందఁగలవు. ఇంతకు వేఱొకయుపాయము లేదని చెప్పఁగా నతఁడు సంతోషించి, మఱునాఁ డుదయమున వాకిట నిలచి మొదట వచ్చిన పెద్దన్నగారికిఁ దనకోర్కెని దెల్పఁగా నక్కవి నవ్వి, యిట్లొకచరణమును జెప్పి లోపలికిఁ బోయెను.

క. "వాకిటికావలితిమ్మా"

తర్వాతవచ్చిన భట్టుకవి నాశ్రయింపఁగా నాతఁడు—

"ప్రాకటమగు సుకవివరుల పాలిటిసొమ్మా"

అనుచరణమును వ్రాసియిచ్చిపోయెను. పిమ్మట వచ్చిన తిమ్మకవి కీసంగతిని విన్నవింపఁగా నతఁడు—

"నీ కిదె పద్యము తిమ్మా"

అని చెప్పి పోయెను. వీరిరాకను గనిపెట్టియుండి నాలు గవ వాఁడుగా వచ్చిన మనరామకృష్ణుఁడు—

"నా కీపచ్చడమె చాలు నయముగ నిమ్మా."

అనిపూర్తిచేయఁగా తిమ్మఁడు మాఱుపలుకనేరక సేలువ నిచ్చివేసెను. ఈకథవిని రాయలుఁనవ్వి తిమ్మనికి వేఱొకసేలువ నొసంగెనఁట.

ఒకనాఁడు కృష్ణదేవరాయలు తనమంత్రులతోడను, పండి తులతోడను, కవులతోడను, మిత్రబృందముతోడను నిండోలగంబుండ నొకపండితుండు విచ్చేసి "రాజచంద్రమా నేఁ జదువఁబోవు పద్యమునకు సంపూర్ణముగా నర్థముఁ జెప్ప భవదాస్థానస్థవిద్వత్కవులు ప్రార్థింపఁబడుచున్నారు." అనెను. అప్పుడు రాజుగారలు తన పండితమండలివంక దృష్టిఁ బఱపిరి. ఇది యేమో యసాధ్యవిషయము వచ్చినదని కవులందఱు నొకరిముఖము నొకరు చూచుకొనుచుండిరి. అంత రామకృష్ణకవి లేచి వచ్చిన పండితునివంకఁ దిరిగి—"పండితమండనా! తమ పద్యమునకు సంపూర్ణార్థమును జెప్ప మేము సిద్ధముగా నున్నాము. మేమడుగు పద్యమున కర్థముం జెప్ప సిద్ధముగా నున్నారాతమరు?" అని యడుగఁగా నతఁడు 'వ్యవహారము పెడదిరిగిన'దని నిశ్చయించుకొని యేరీతిని దప్పించుకొనుటకు వీలులేక యెట్టకేలకు సమ్మతిం జూపెను. తరువాత రామకృష్ణకవి "తమ పద్యమును జదువుఁ"డని కోరఁగా నాపండితుఁడు చదివిన పద్యము.—

సీ. రాజనందనరాజరాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి
తలఁప నల్లయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులుసాటి
తలఁప నల్లయవేమధరణిపతికి

భావభవభోగసత్కళాభావములను
భావభవభోగసత్కళాభావములను
భావభవభోగసత్కళాభావములను
భావభవభోగసత్కళాభావములను.

ఈపద్యమును విని రామకృష్ణుఁడు చిఱునవ్వు నవ్వి "యింక నాపద్యమును వినుఁడు" అని యిట్లు చదివెను.

సీ. మేఁకతోఁకకు తోఁక తోఁకమేఁకకు మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁక మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁకమేఁకకు మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁక మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁకమేఁకకు మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁక మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁకమేఁకకు మేఁక
మేఁకతోఁకకు తోఁక తోఁక మేఁక

మేఁకతోకతోఁక తోకతోఁక తోఁకమేఁక
మేఁకతోకతోఁక తోకతోఁక తోఁకమేఁక
మేఁకతోకతోఁక తోకతోఁక తోఁకమేఁక
మేఁకతోకతోఁక తోకతోఁక తోఁకమేఁక.

రామకృష్ణునిపద్యమును వినఁగానే యా పండితునికి దీర్ఘాలోచన గలిగెను. ఏమనుటకుఁ దోఁపలేదు. అర్థమును వచింపలేనన మన సొప్పదు. ఈపద్యమున కర్థమే లేదన గుండె చాలదు. అతఁడట్లు కొంతవడి యోచించి యోచించి—"పండితులారా! ఈపద్యమున కర్థమును నేటిసాయంతనపుసభలోఁ జెప్పెదను" అనిసెలవుగైకొని బసకేఁగి పద్యార్థమునిశ్చయించు మార్గము తోఁపక తానువచ్చినమార్గమునుబట్టి మెల్లఁగా వెళ్లెనఁట. ఆవిషయము నెఱింగి రాజుగారును, తక్కినపండితులును రామకృష్ణుఁడు పన్నిన పన్నుగడకు మిగుల సంతసించిరి.

మఱియొకరోజున వేఱొకకవి రాయలవారిని దర్శించి సభలో నిలువంబడి "నేను జెప్పు పద్యములను గంట మాపక వ్రాయువారుగాని, వ్రాయసమున నన్నోడించువారుగాని యీ సభామధ్యమునఁ గలరా?" యని ప్రజ్ఞవలుక రామకృష్ణకవిలేచి "నేనుపద్యములను జెప్పెదను. నీవుగంటమాపక వ్రాయఁగలవా?" యని ప్రశ్నించెను. అందుల కాతఁడు "గంట కెన్ని పద్యములఁ జెప్పఁగల"వని రామకృష్ణు నడుగ "గంటకొకపద్యమును జెప్పెద"నని బదులు చెప్పెను. ఆమాటవిని యందఱును నవ్విరి. ఆ క్రొత్తకవి నిర్లక్ష్యాసూయాసూచకముగ మొగముంజిట్లించి—గంటమును దాటియాకును గైకొని "కానిమ్ము నీయోపి నన్ని పద్యముల గుప్పించు"మనెను. రామకృష్ణుఁడు సాధారణరీతిగాఁ బద్యమును బ్రారంభించి మధ్యలో సంతాపార్థక మగు నొక (వ్రాయవీలుగాని) చిత్రోచ్చారణతోఁ బాదమును బూరించి,

తక్కుచరణములను సాధారణరీతినిఁ బూర్తిచేసెను. ఆకవి ఆ యుచ్చారణ నెట్లువ్రాయుటకుఁదోపక—అందుల కొకయుఱ గంట యోచించి తుదకిట్లు వ్రాసెను:

క. వక్కలు చేరెఁడు నేఁగొని
చొక్కాలోఁ బోసికొంటి—చొచ్చొచ్చొచ్చో
యెక్కడి దొంగలు వచ్చిరో!
అక్కఱకును లేకపోయె హరిశ్రీకృష్ణా.

పద్యమును బూర్తిగాఁ జెప్పినపిమ్మట రామకృష్ణ కవి చాలసేపూరకుండవలసె. సభ్యులందఱును జప్పటలు గొట్టిరి. వ్రాయసకాని ప్రజ్ఞ గంగఁగలసె. మొగము వెలవెలఁ బోయె. రామకృష్ణునియుక్తి కందఱును శ్లాఘించిరి.

ఈకవి తనకవిత్వమును గూర్చియు తనపాండురంగవిజయమును గూర్చియుఁ జెప్పినపద్యము:

*సీ. ప్రౌఢదీర్ఘసమాసపదములఁ గూర్చి శ్రీ
నాథుండు కూలార్చె నైషధంబు
దానితల్లిగ నల్లసాని పెద్దనచెప్పె
ముదిమదితప్పి యాముక్తమాల్య
దూహించి తెలియరాకుండ సూరపరాజు
భ్రమఁ గళాపూర్ణోదయము రచించె

* ఈపద్యము శైలినిబట్టియుఁ దెనాలిరామకృష్ణకవితరువాతివాఁడగు సూరనను జేర్కొనుటంబట్టియు, నంత విశ్వసనీయముగఁ దోఁపదు.

నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్పఁ
బస ఘటించెను మూర్తి వసుచరిత్ర
నిట్టికవులకు నేను వాకట్టుకొఱకు
చెప్పినాఁడ మదీయవైచిత్రి మెఱయఁ
బాండురంగవిజయమును బటిమ దనర
విష్ణువరిష్ఠుఁ డగురామకృష్ణ కవిని.

## రామకృష్ణుని మఱికొన్ని చాటువులు

మ. వరబింబాధరముం బయోధరములున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు చూప కవ్వలిమొగం బైనంత నేమాయె? నీ
గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మాకుం జాలవే? గంగ క
ద్దరి మే లిద్దరిఁ గీడునుం గలదె యుద్యద్రాజబింబాననా!

క. విధుకృతకదనము వదనము
మధుకరనికరములఁ గేరు మగువచికురముల్
విధుమధుకరలీలాజయ
మధురోక్తులు పిక్కలౌర మధురాధరకున్.

మ. సతతోత్సర్జనవార్ధునీసముదితస్వర్ణాద్రిరాట్కర్ణికా
భ్రతలేందిందిరడింభగుంఫితయశోభ్రాజచ్ఛితాంభోరుహా
తతవిస్ఫూర్తికరోరుదోరుపధిమత్ప్రాగ్రావజాగ్రన్నిజా
ద్భుత తేజోనవహేళి సంవరణభూభృన్మౌళి యొప్పెన్ భువిన్.

మ. బలవద్దర్పకశస్త్రికానిహతి సైఁపన్ లేక యవ్వేళ న
య్యలినీలాలక యంబరాంతపరిణీతాత్మీయఖిన్నాననో
త్పలినీబాంధవ యాచు నేడ్చెఁ గడు భూపాలైకరాగంబునన్
గలకంఠీకలకంఠకంఠనినదైక్యస్ఫూర్తి శోభిల్లఁగన్.

గీ. పల్లవము పూని సకియ మేనెల్లఁ జేసి
పద్మగర్భుఁడు లాఁ దీసి వాగుడిచ్చి
మూ విసర్జించి యప్పు డప్పూవుఁబోఁడి
డెంద మొనరించె సందేహ మందనేల?

క. తారకములఁ గోరకముల
వారకములకెల్ల నెల్ల వారకము లిడున్
శ్రీరమణీ హారమణీ
భారమణీయత్వదీయపదనఖరంబుల్.

క. జలచరము మిడుత మ్రింగెను
జలచరమును మిడుత మ్రింగ జగతీస్థలిలో
వలరాజు రాజు మ్రింగెను
వలరాజును రాజు మ్రింగవచ్చినఁ బడియెన్.

గీ. చాన నెమ్మోము గెల్చుఁ గంజాతములను
కాంత కంజాతముల గెల్చుఁ గంధరమును
కంధరంబును సముదశంఖంబు గెల్చు
శంఖభావంబు నయ్యర్ధచంద్రు గెల్చు.

చ. ఉవిదమిటారిచన్గవకు నోడి గుళుచ్ఛము లీనమాచు రెం
డవతను పూనియున్ మొదటినై జగుణంబును వెండి వీఁగి మె
త్తనడి రజస్థ్సితిం దొఱఁగి తా విగతాశ్రయమై యుదాత్తతా
ధివసతి యయ్యుఁ దద్వ్యధి గతించినఁ జాలక తుచ్ఛమై చనెన్.

గీ. కచకుచాననగళనేత్రకరయుగముల
కళికుభృచ్చంద్రదరవారిజలత లోడి
పాఱె ధరఁజొచ్చెను గృశించె వారి మునిఁగె
బంకమునఁ జిక్కె నిడుదలై బయలుకుటికె.

క. కమలాకర కమలాకర
కమలాకర కమలకమల కమలాకారా
కమలాకర కమలాకర
కమలాకర మైనకొలను గని రాసుదతుల్.

గీ. నాని నీనాను నేనును నాని నాను
నాన నేనును నిన్నాని నున్న నన్ను
నెన్న నున్నను నిన్నెన్న నున్న నాన
నిన్న నేనన్న నున్న నన్నెన్న నన్ని.

క. కమలాకమలామోదిత
కమలా కమలావతంస కమలాకమలా
కమలా కమలాన్వయవర
కమలాకమలాస్య రాధఁ గానరె యిచటన్.

ఉ. రాధితరాధిరాధిరధిరాధితదీధితిపూర్త్య నీయస
ద్రాధితనాధినాధితరరారితరారితరారిశైరిసు
భ్రాధితనాధనాయతరరారితకూరితవారితాంబుధి
స్ఫూరితసాధులోకనుతపూజితరాజితపూర్వ శేఖరా!

చ. తవతవతాహితాహియహితారకమాలకమాలచంచరీ
జనజవజాలజాలనహిజాలకవాలకలీలచుంబినీ
కవకవకావకావశుకకాహితకాహితలోకసుందరీ
నవనవనావనావ నివనాహితనాహిత పూర్వ శేఖరా!

చ. శరశరకాండకాండహరిచందనచందననాగనాగసుం
దరదరచంద్రచంద్రశ్రితవారదనారదతారతారభూ
ధరధరరాజరాజహయదానవదానవకాశకాశస
త్పురపురమారమారహరభూధరభూధరకాలకాలహా.

క. జలకలకలకులకులకుల
జలవకలక జలజములుక జలములక పయో
ఘలనిలవలలనయలస
త్ఫలదాయక ఘలితలలితపర్వవివేకా!

ఈకవిచే రచింపఁబడిన దశావతారస్తోత్రపద్యములు

శా. సాధీయోముఖపూరితోద్వమితతాసత్యోర్ధ్వగోదన్వద
ర్ణోధారాంతరటత్తిమింగిలగిలప్రోద్ధాననిధ్యానల
బ్ధాధీశప్రభుతాస్వభాగహరణార్థాయాయిహృజ్జాంకధీ
ప్రాధాన్యాతివిలోలవాగ్దృగబట బ్రహ్మన్ స్తుమ స్త్వామనుః.

శా. ద్యూత్తంభద్గిరికల్పితావతరణద్యోవాహినీసంగమో
పాత్తేందూదయనిష్పిత్ర్యాణజలధిప్రారబ్ధపుత్రోత్సవో
దాత్తత్వాత్తగజాశ్వవన్యశనకన్యాగోమణీదానసం
పత్తిప్రీణితదేవధుల్యధిపతి బ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

శా. ఆద్యాలోకనభక్తిసంభ్రమదనేహఃపూరుషత్యక్తస
త్పాద్యాంభస్తులసీభ్రమప్రదఖురప్రక్షాళనామాత్రజా
గ్రద్యోగాంబుధిదంష్ట్రికాగ్రగిరిపృథ్వ్యాత్కోలామిషప్రాయశం
భద్యాదోనిధిసప్తకీస్థలకిరి బ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

శా. డింభద్రోహివధోత్కటోత్కరిమణఘృష్టిక్లిష్టతారోమకూ
పాంభోజప్రభవాండభాండవళనోద్యద్ధ్వానధీకృత్సభా
స్తంభాంతఃస్ఫుటనస్ఫురత్ఫళఫళధ్వాన్తార్తిని శ్చేష్టని
ర్దంభోద్వేగదిశావశాపనృహరి బ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

మ. స్వతలస్వచ్ఛతరారుణత్వరచితస్వస్త్రీట్పరేడ్బింబివా
కృపితికూలత్వదశానుకారిగళగాద్గద్యాత్కుమాంభోజభూ

నతిహాసన్నఖిరోర్ధ్వసారితపదార్ణోరుడ్జగంగాసవా
ప్రతిమాళీశకపర్దమండలవటుబ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

శా. ఆజిప్రౌఢిమదుర్జయార్జునభుజోదగ్రాసృగాస్వాదన
వ్యాజాపోశనభాక్తవస్వపహృతిప్రాణాహృతిప్రోల్లస
ద్రాజాళీనిఘసావసానవిఘసప్రాయేందుఫేలాయిత
భ్రాజద్వ్యక్షకుఠారధారి భృగురాడ్బ్రహ్మన్ స్తుమస్త్వామనుః

శా. చాపచ్ఛాత్రనిషంగభంగకుపితక్ష్మాభృద్ధనుఃపంచవ
క్త్రీపంచాలికదృఙ్నియుక్తహుతభుగ్గ్రీవాద్వయీపంచక
వ్యాపారభ్రమకారిపఙ్క్తిగళగళ్యాఖండనాఖండదో
శ్శైత్యపుణ్యప్రవరాఘ రాఘవపరబ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

మ. కరిపూరుద్ధరణార్థలాంగలవిభగ్నక్ష్మాభరాదక్షుది
క్కరిపాతప్రహతస్ఫటస్ఫటిపభోగవ్యావృతగ్రీవనూ
కరపీఠీకృతపృష్ఠతాహితమహాగాధాధికూర్మాధిరాట్
పరిక్లప్తప్రళయాంబుగాహన హలిబ్రహ్మన్ స్తుమస్త్వామనుః

మ. అతిదోఃపీడనశర్కరీభలితకంతాభత్వదుద్ధర్తృధూ
ర్తతృణావర్తదృఢాంగపాతహతగోత్రాభర్తృకోత్పాదిత
క్రతుభుగ్గాడ్గ్రిహణాగ్రహోన్ముఖశతారధ్వస్తమైనాకని
వృతనభ్రాంతికనందగోపకసుతబ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

మ. గిరియుష్మద్ధనురస్త్రితాప్రభృతిమోఘీకృద్వధూశీలవి
స్ఫురణావర్మభిదాధ్యధార్ఢ్యసఫలీభూతప్రభూతత్రిపూ
ర్వరదైతేయజిఘాంసశంసనపరోగ్రప్రాప్యసారూప్యని
ర్భరరమ్యాంగతధాగతాంగకపరబ్రహ్మన్ స్తుమస్త్వామనుః.

మ. స్వమహాబాహుకృపాణకృత్తగళగుచ్ఛమ్లేచ్ఛవీరచ్ఛటో
త్కరిమణాపాదితపద్మినీరమణమధ్యచ్ఛిద్రఖశ్యామికో

ద్గమక్ల్ప్తాఽసమయోపరాగమతికక్ష్మాస్నానగంగానదీ
భ్రమకృత్కీర్తిక కల్కిమూర్తికపరబ్రహ్మన్ విస్తుమస్త్వామనుక్.

## విద్వజ్జనకోలాహలుఁడు

ఈతఁడు గొప్పసంస్కృతపండితుఁడు. తెలుఁగుకవన మల్లుటయందుఁ బ్రజ్ఞగలవాఁడు. అనర్గళమగు వాచాలత గల వాఁడు. ఈతని పేరన్నఁ గవులకు గుండెదిగులు. ఈపండితునకు గుదియలకామి యను నొకయుంపుడుకత్తె కలదు. తాను దిగ్విజయమునకు బయలువెడలునప్పుడా వెలవెలఁదినిఁగూడఁదోకొని పోయెడివాఁడు. తనకు సంస్కృతాంధ్ర పాండిత్యమునకుసమ్మానము; దానికో గానాభినయపాండిత్యమునకు సమ్మానము.ఇట్లు వారిరువురును సంస్థానములఁ దిరుగుచుఁ దిరుగుచుఁ గృష్ణదేవరాయల సంస్థానమునకు వచ్చిరి. కోలాహలుని రాకవిని యాంధ్రకవితాపితామహుఁడు "వీని జయించుటెట్లు?"అని యోచింపఁ దొడఁగెను. మన తెనాలిరామకృష్ణకవి పెద్దనకు ధైర్యముఁ జెప్పెను. నాఁటిసాయంతనపుసభకు వారిరువురును వచ్చిరి. పండితులందఱుఁ గూర్చుండియుండిరి. పెద్దనగారటునిటుపచారు సేయుచుండిరి. కోలాహలపండితుఁ డాసభాముఖముననిలిచియే

చ. "వదలక మోవియు నాంధ్రకవితామపదంబుననున్న నూపురం
బుదితమరాళకంఠనినదోక్తుల నేమని పల్కఁ బల్కుఁడీ"

అని సమస్యనొసంగఁ దత్‌క్షణమే రామకృష్ణకవి లేచి

"సుదియలకామినున్నని...కోణము పైఁగలభాగ్యరేఖ నీ
నుదుటను లేదటం చమరనూత్నపురంధ్రులతోడఁ బల్కెడుక్."

అని పద్యమును బూర్తిఁజేసెనఁట. అందుపైఁ గోలా హాలుఁ "డింకనిందుండుట మనకు మర్యాదకా"దని గిఱ్ఱునవెను కకుఁ దిరిగి తనదారిం బోయెనఁట.

## కందుకూరు రుద్రకవి

ఇతఁడు నిరంకుశోపాఖ్యానమును రచించినకవి యని యీ క్రిందిపద్యములవలన నూహింపఁదగియున్నది. ఈరుద్రకవి కొకపరి తాతాచార్యు లనునొక వైష్ణవునితో వివాదము ఘటిల్లఁగా నితఁడు వ్రాసినపద్యము:

సీ. పరదానయాచకబ్రాహ్మణులరు మీరు
పరతత్త్వమునఁ బరబ్రహ్మ మేను
భూమిలో సత్పాత్రభూషణాత్ములు మీరు
కనకకుండలపరిష్కారి నేను
తరిఁ బెట్టుకున్నట్టిబిరుదువారలు మీరు
పేషిణీహనుమంతబిరుదువాఁడ
వరశంఖచక్రాంకగురువులు మీరలు
గురిమీఱఁగా జగద్గురుఁడ నేను
నీకు మాకును సాటియే లోకసృష్టి
కర్త నాటయుఁ దెలియదా కలియుగమునఁ
దారతమ్యంబు లేదుగా, తాతయార్య!
రూఢి కెక్కిన కందుకూర్ రుద్రకవిని.

ఈకవి కమసాలి.ఒకానొకప్పుడితఁడొక సంస్థానపతిదర్శిం పనేఁగఁ దదాస్థానముననున్న భద్రయ్యయనునొకనియోగికవి 'రుద్రకవిని రానిచ్చినఁ దనపేరుదక్క'దను తలంపుతో నాతని రాక రాజుగారికిఁ దెలియకుండ గట్టుబాటుఁజేసెను. రుద్రకవి కొంతకాల మట్లేకడిపి సంస్థానముం జొచ్చు నుపాయము తోఁపక తుదకు రాజుగారి మంగలియగు కొండని నాశ్రయించెను. ఒకనాఁడు కొండఁడు వచ్చుట ఆలస్యమయి రాజుగారుకురిచీపైఁ గూరుచుండి యట్లే కూరుకుఁజెందిరి. నిదురఁబోవుచున్న రాజు కదలకుండఁ దనపని ముగించుకొని కొండఁడు ప్రక్కన నిలిచి యుండెను. ఒకటి రెండు నిముషములకు రాజుగారు మేలుకని, యెదుటనున్న మంగలిఁగని"యేమిరా, నేఁడింతయాలస్య" మన వాఁడు 'మహాప్రభూ! నేను వచ్చుచుండఁగాఁ ద్రోవలో నొకకవి తటస్థమయి "నేనిట నెలదినములనుండి రాజదర్శనము నకై వేచియున్నాను. భద్రకవి యేకారణముననో నా రాకను రాజుగారికిఁ దెలియనీయకుండఁ జేయుచున్నాఁ"డనియేమేమో తన సంగతులను జెప్పకొన సాగెను. "అయ్యా! నేను త్వరగాఁ బోవలయునని చెప్పివచ్చితి" నని మనవి చేసెను. అందుపై ప్రభువు "భద్రకవి యింత యసూయాపరుఁడా? చూచెదముగాక,"అనుచు "ఓరీకొండా!నీపనిఁగాని"మ్మనియెను. వాఁడు "మహారాజా! అఱగంట క్రిందనే అయిన"దని మనవి చేయుచు నద్దమునెదుట నిల్పెను. కొండనికౌశల్యమునకు రాజు

సంతసించి "ఓరీ! నీవేమికోరెద"వన నా మంగలి "అయ్యా! తమ యనుగ్రహమున నాకేమియుఁ గొదువలేదు. కాన రుద్ర కవినిఁ జక్కఁగా సమ్మానించి పంపుఁడనిమాత్రము మిమ్ముఁ గోరుచున్నా"ననెను. వానిసుగుణసంపదకా సంస్థానాధిపతి మెచ్చి వాని కేదో కొంతబహుమాన మొసంగి పంపివేసెను.

తరువాత రుద్రకవి రాజు దర్శించి, భద్రకవిపై వచ్చిన కోపముం బట్టఁజాలక, మంగలికొండని భూషించుచు నీ పద్యముం జదివెను.

క. ఎంగిలిముచ్చుగులాములు
సంగతిగాఁ గులముఁ జెరుపఁ జనుదెంచిరయా
ఇంగిత మెఱిఁగినఘనుఁడీ
మంగలి కొండోజిమేలు మంత్రుల కన్నన్.

ఈపద్యమును విని భద్రకవి మండిపడి

చ. జబగడదష్షు లణ్ణు శషసర్రు కపయ్యుర్ఝుభక్షటంచు వా
జబజబలెల్లఁ జూపి యగసాలెల, జేలల, బోయపాలెపుం
బబువుల గెల్చి చేతఁ గలపైకము దోచుటగాదు, రుద్ర నీ
డబడబ భద్రమంత్రియెదుటం గొనసాగదు హొమ్మహొమ్మికన్.

అనుపద్యమ్ముఁ జదువఁగా రుద్రకవి

క. భద్రా! శ్వానము మొఱఁగిన
రుద్రాంకితజంగమయ్య రూఢికిఁ గొదవా?

చిమ్మా ప్రుఁ డితఁడు కేవల
రుద్రుఁడయా కందుకూరు రుద్రుఁడు ధాత్రిన్.

అనెను. అందుమీఁద నాస్థానపతి యిరువురికయ్యామాపి రుద్రకవిని సమ్మానించి పంపెను. భద్రకవి కిట్టి యసూయతగ దని బుద్ధిచెప్పెను.

## నక్కలపాటి సంజీవరాయకవి

మల్లెవేంకటరామరాజుగారికిని వేమల వేంకటరాజుగారికిని నిరంతరవైరము. అట్టి సందర్భములోనే నక్కలపాటిసంజీవరాయకవి యొక్క కందముతోనే యిరువురివలనను బహుమానము లందెనఁట. ఆకందపద్య మిది—

క. స్వామి విను మల్లె వేంక
ట్రామక్ష్మాజాని నీదురణజయభేరీ
ధామధ్వని విని జరగఁడె?
వేమలచిన బసవరాయ వేంకటనృపతీ.

ఇతడు ఎవరిని దర్శింపఁబోయినప్పుడువారిని సంబోధించి సమన్వయించి తనయుక్తిసామర్థ్యములం జూపి వారి మన్ననల నందియుండు. ఇంచుకదోషమున్నను నీతనియుక్తిమాత్రము కొనియాడఁదగియున్నది.

మల్లెయనంతభూపాలుని చెఱకుఁదోఁటను నక్కలుపాడు చేయ నాఘోరమణుం డీకవిరాయనిం బిలిచి నక్కలు పోవు

నుపాయమును జెప్పుమనెనఁట. అంతట నీకవి పద్యమొకటి తాటియాకుపై లిఖించి యిచ్చి యాయాకుఁదోఁటవాకిటఁ గట్టించుమని చెప్ప నాతఁడట్లొనరింపఁగా నక్కలరాక తగ్గెనఁట. ఆ పద్య మిది:

క. ఆశీవిషసమ మగు నా
యాశుకవిత్వంబుచేత నటువంచకముల్
నాశము గావలెఁ జూడుమ
హేశాంభవి! చౌడమాంబ! హేశర్వాణీ.

అట్లు నక్కలకు వాకట్టుకట్టుటవలననే రాజుగారు తన కాయింటిపే రొసఁగినట్లు పద్యమునఁ జెప్పికొన్నాఁడు.

ఉ. ఎంచఁగలం డనంతవసుధీశునియిక్షువనంబునోళ్లఖం
డించిన నక్కలన్ విషపటిష్ఠపుఁ బద్యముఁ జెప్పి వానిని
ర్జించిన నింటి పేరు దయచేసిరి నక్కలపాటివా రటం
చు... ... ... ...

## పిండిప్రోలు లక్ష్మణకవి

ఈకవి పదునెనిమిదవ శతాబ్దిలో నున్నవాఁడు. ప్రౌఢకవి. ఇతఁడు రావణదమ్మీయమనుద్వ్యర్థి కావ్యమును రచించెను. ఈతనిసమకాలికులగు శిష్టు కృష్ణమూర్తి, మొక్కపాటి పేరిశాస్త్రి మొదలగుకవులతో నీకవికి వివాదము విశేషముగా జరిగెను. కృష్ణకవి కోటరామచంద్రపురముపరగణాజమీన్దారుఁడగు కాకర్లపూఁడి రామచంద్రరాజుగారిపై సర్వకామదాపరి

ణయమను నొక ప్రబంధమును రచించెను. ఆగ్రంథమును వినుపించునాటికిఁ బలువురు పండితులు, కవులు కృష్ణకవిచేతను, రాజుగారిచేతను నాహ్వానింపఁబడిరి. రాజుగారు మనలక్ష్మణకవికిఁగూడ నాహ్వానపత్రిక నంపవలసినదని చెప్పినను కృష్ణకవి యట్లొనర్ప లేదు సరేకదా, పైగా "పెండ్లిపందిళ్ల సంభావనకుఁ బోఁదగిన లక్ష్మణకవి యీపండితసభకు రాఁదగునా" యని అధిక్షేపించెను. అందునకు జమీాందారుగారు మిన్నకుండిరి.

తరువాత, కృష్ణకవి తనవిషయమై రాజుసన్నిధి జరిపిన వృత్తాంతమంతయు నెఱింగి కవికి లోఁగి రాజు తన్నుఁబిలువక పోయినను దప్పక యాసభకుఁ బోయి కృష్ణకవిగర్వ మడంపవలయునని లక్ష్మణకవి సభజరుగునాఁటికి రామచంద్రపురమునకు వచ్చెను. ఆసంగతి నెఱింగి రాజుగారు లక్ష్మణకవి నిప్పుడైన నాహ్వానింపవలె ననఁగా, "తనయూరునుండి యింతదూరము వచ్చినవాఁడిఁక సభకు రాలేకపోవునా? ఇఁక మనము పిలువనేల?" అని కృష్ణకవి వారించెను. ఆసంగతి నెఱింగి లక్ష్మణకవి తనంతఁదానే సభకు వచ్చెను. రాజుగారు మిగుల మర్యాదఁజేసి యున్నతాసన మొసంగి "అయ్యా! మీారును సమయమునకు వచ్చినారు. నాకు మిగుల సంతసమైనది. ప్రస్తుతగ్రంథమును విని గుణదోషములఁ బరిశీలించి మాకుఁ గృతియిప్పింపుఁ" డని వినయముగా నడిగెను. అదివిని లక్ష్మణకవి వైముఖ్యమును సూచించుచు "మహాపండితులగు కృష్ణకవిగారు రచించిన గ్రంథమును బరిశీలింపఁగలవాఁడనా? నలువురితోఁ బాటు వినుచుం గూర్చుండెద" నని మాఱుపలికెను.

అదివిని రాజుగారు "పండితవర్యా! తమ రట్లు సెలవీయ నగునా? తమవంటిపండితులచేఁ బరిశీలింపఁ బడనిమెడల నీగ్రంథమునకు ఘనత యెట్లువచ్చును" అని యెన్నోవిధములఁ బ్రార్థించెను. "పరిశీలింపుఁడని మీరు నన్నుఁగోరిన గ్రంథకర్త యంగీకరింపవలయుఁ గదా?" యని లక్ష్మణకవి పలికెను.

ఆపలుకులు విని కృష్ణకవి యాగ్రహించి, "మహారాజా! యీస్థానములో లక్ష్మణకవినిఁ బండితుఁడనుట హాస్యాస్పదము. అదియుఁగాక యీపండితసభలో "నేనొకపండితుఁడ" నని యాతఁడొప్పుకొనుట మిగుల నవ్వులచేటు" అనుచు "నాగ్రంథమునఁ దప్పుఁబట్టఁగలవాఁడే యుండిన, నతఁడు లక్ష్మణకవికన్యుఁడు గాని, లచ్చనగాఁ డని తిరస్కరించెను. లక్ష్మణకవి కృష్ణుని పలుకులు వినివిని కృష్ణకవి నింకను నుడికించినంగాని కార్యము కాదని చిఱునవ్వునవ్వుచు రాజువంకఁదిరిగి యటనుండు నొక కుక్కంజూచి

"ఈశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్"

అని యూరకుండెను. ఆమాటవిని కృష్ణకవి మండిపడి

క. "దాశరథీశబ్దంబును
దాశరథిపరమ్ముఁ జేయుదైవ్యయర్థికి దు
ర్థీశక్తిబిడాలమునకు
నీశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్.

అని పద్యమును బూరించి లక్ష్మణకవి యొకచోఁ బ్రయోగించినదాశరథీ శబ్దప్రయోగము నాక్షేపించెను. యుక్తిశాలియగు

లక్ష్మణకవి తనప్రయోగమును సమర్థించి యిట్లుపన్యసింపఁ దొడఁగెను.

"పండితులారా! ఈశు = శివునియొక్క, నకము=బాణము, కృష్ణమూర్తి యని నేను నుతింపఁగా 'నంతటి స్తోత్రము నకు నేను దగ'నని మసకవివతంసుఁడు శునకసామ్యమున కంగీకరించుచున్నాఁడు. ఇట్టి పండితునిముందు మఱియొకఁడు పండితుఁ డనరాదఁట" అని హేళన చేసెను. లక్ష్మణకవి యుక్తికిఁ బండితులందఱును సంతోషించిరి. కృష్ణకవి వెలవెలఁబోయెను.

పేరిశాస్త్రిగారికిని లక్ష్మణకవికిని వివాదము తటస్థింపఁగా, లక్ష్మణకవికిఁ గవిత్వమేకాని శాస్త్రము తెలియదని శాస్త్రి యాక్షేపించెనఁట! అది విని లక్ష్మణకవి యీక్రిందిపద్యమును రచించి పంపెను.

గీ. ఉక్కుఁ జెన తిన్న దళెదెక్కు లొక్కలైనఁ
జుక్కలిలఁ బడ్డఁ గులగిరుల్ వ్రక్కలైన
మొక్కపాటింట నోటను ముక్కలేదు
పేరిశాస్త్రికిఁ గలిగెరా పెదవిపాటు.

ఇటులనే కూరపాటి వేంకటశాస్త్రి యను నొకకవి లక్ష్మణకవిని దిరస్కరింపఁగా నితఁడు వ్రాసినపద్యము.

ఆ. కూరపాటివెంక! కుక్కలు దినుకంక!
లేనిపోనిశంక మాను మింక
ముఖముఁ జూడఁ గుంకముండ వనెడుశంక
నాకుఁ దోఁచెఁ జంక నాకు మింక.

ఈలక్ష్మణకవికి మంగన్నయను నొకమేనల్లుఁ డుండెను. అతనికి దాయాదులతో వ్యాజ్యము సంభవింపఁగా శంకరమంచి అనంతపంతులను న్యాయాధికారి లంచము గైకొని మంగన్న నన్యాయముఁ జేసెను. లక్ష్మణకవి పద్యరూపముగా నీసంగతి నంతను వెల్లడిచేసెను. ఆపద్యము లివి :—

సీ. మహనీయశంకరమంచిగోత్రమునఁ బ్ర
పాతకుం డన ధరిత్రీతలమునఁ
బండితుండనవలెఁ గన్పడుదు స్థాణుత్వ మే
ర్పడ నొకసాధులపలుకు వినవు
పుక్కిటవిష మెయెప్పుడు నీకు నుండును
మది వీడ వెపుడుఁ దామసగుణంబు
భీముఁడుగ్రుఁడు నను పేరు గాంచి నశింతు
వంబికాపతివి బ్రహ్మఘ్నుఁడవు న
నంతనాముండ వరయంగ నష్టమూర్తి
వగుచుఁ బిత్రువనమందు భస్మాంగుఁడవయి
భూతములును బిశాచముల్ బ్రోదిగూడు
కొనఁగ నుండుదు వంద్రునిఁ జనము లెల్ల.

మ. సరవిన్ శంకరమంచిపండితుఁడనన్ జానొప్పువాఁ డర్థసౌ
ఖ్యరుచిన్ జెందియుఁజింతలూరియలమంగామాత్యసాధ్వాత్మమం
దిరసుక్షేత్రములన్ హరించి కపటాన్వీతుండు నావాది క
ల్లరికాఁ డంచును దీర్పు చేసి జనముల్ నవ్వం బడున్ దుర్గతిన్.

ఉ. దక్షిణదిక్కునుండియు యముదంతముదెచ్చినధర్మరాజు ప్ర
త్యక్షమనంతపాతకునకిచ్చెదుమార్గమువోవునట్టుగా

దీక్ష వహింపవే ధవళదేహుఁడ! శంకరశం నికూళ్ళపైఁ
బత్క మదేల దుష్టజనభంజన! సజ్జనభావరంజనా!

సీ. పరశురాముఁడు తండ్రిపంపున రేణుకన్
దనతల్లి యనకయ నఱికివైచె
జనకజాపతి తండ్రిపనుపున రాజ్యంబు
వాసి మహారణ్యవాసి యయ్యెఁ
గుండినముని జనకునియాజ్ఞచే సంశ
యింపక గోవుల హింసఁ జేసె
భీష్ముఁడు తండ్రియభీష్టంబుఁ దీర్ప రా
జ్యశ్రీసుఖాదికార్యములు విడచె
తండ్రిపంపునఁ దనకన్నతండ్రి పేరుఁ
జెప్పుకతన నదత్తుఁడే చింతలూరి
మంగరాజిట్లు శంకరమంచిపండి
తుండు దీర్చుట జీవన్మృతుండుఁ గాఁడె.

సీ. వసుదేవసుతుఁడన్న వాక్యంబుననె పద్మ
నాభుండు నందనందనుఁడు గాఁడె
మాద్రీతనయులన్నమాత్రంబుననె కవల్
కౌంతేయు లన్నవిఖ్యాతిఁ గనరె
పార్వతీసుతుఁ డని పల్కినంతనె కుమా
రుఁడును డాఁ గార్తికేయుఁడును గాఁడె
బాపిరాడ్సుతుఁ డన్న భావనె మంగన్న
ధృతిజగ్గరాడ్దత్తసుతుఁడు గాఁడె
వేదశాస్త్రపురాణముల్ వినియుఁ గనియు
నెఱిఁగి యెఱుఁగనివాఁడునై యిట్లు విత్త
వాంఛ నన్యాయముగఁ దీర్చు పండితుండు
ఘోరనరకంబులందునఁ గూలకున్నె.

తరువాత లక్ష్మణకవి తనయల్లునిచే నప్పీలుచేయించు టకుఁ దగినయత్నముఁ జేసి యప్పుడు జడ్జిగా నుండిన బ్రౌను దొరను దర్శించి యీ క్రిందిసీసపద్యము నొసంగెను.

సీ స మా లి క.

మధువైరికిన్ వనమాలికిఁ గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికాప్రియునకు రావణసోదరునకు
జగదీశునకు దయాసాగరునకు
శ్రీనాథునకును రక్షితదేవసమితికిఁ
బ్రాథభావునకు నారాయణునకు
సురగేంద్రతల్పున కరిశంఖధరునకుఁ
దొగలరాయని గేరుమొగముదొరకు
రణనిహతదుష్టరాక్షసరమణునకును
గానమోహితవల్లవీకాంతునకును
రిపువిదారికి హరికి శ్రీకృష్ణునకును
కిల్బిషారికి నే నమస్కృతి యొనర్తు.

తెలుఁగునఁ బండితుఁడగు బ్రౌనుదొర లక్ష్మణకవి రచించిన సీసమాలికనుగని చాలసంతసించి మీరాక కేమికారణమని యడుగఁగాఁ గవి తనయల్లునింజూపి యతనికొఱకై వచ్చియుంటి నని తెల్పెను. అతఁ డేమిపనికై వచ్చెనని దొరయడుగఁగా, నీవు వచ్చినపనిని నీవే విన్నవింపుమని మామ చెప్పఁగా మంగన్న యీ క్రిందిపద్యములతో విన్నవించెను:

సీ. చింతలూరికి మిరాసీదారుఁడగు జగ్గ
రాజుకుఁ బుత్త్రు లౌరసులు లేమిఁ
దనకును బిన్నయాతండ్రిపేరందనునకు
బాపిరాట్సుతు దత్తభావుఁ జేసి
కొనుటచే నిడివఱకును తద్గృహక్షేత్ర
కర్తనై యుండుట కలకటరు క
చేరీలలెక్కలఁ జిత్తగించినఁ జాలు
నేదినే నెఱుఁగని యిట్టిపనికి
బాపిరాట్సుతుఁ డని నేను బల్కినట్లు
వాది పన్నినకపటభావమె నిజ మని
పట్టి దత్తుఁడు గాఁడంచుఁ బండితుండు
చేసెఁ దీరు పుభయభ్రష్టుఁ జేసె నన్ను.

ఉ. అత్తినధర్మశాస్త్రవిధి కడ్డని చూడక కల్కటర్లసం
సత్తుల లెక్కలారయు విచారము సేయక రాజ్యమేలు భూ
భృత్తుసభాస్థపత్రలిపిరీతిఁ దలంపక విత్తవాంఛచే
దత్తు నదత్తుఁ డంచను నధార్మికపండితుఁ డంట యొప్పునే?

మంగన్న మనవిని విని దొరవారు మరల నొకసారి దర్శనమును జేసికొండని సెలవీయఁగా కవులిరువురు నింటికి వెళ్లిరి. పిమ్మట దాయాదులు మంగన్నతో రాజీపడి సగభాగ మొసంగిరఁట.

## మాగాపు శరభకవి

ఈకవి వత్సవాయిరామభూపతిని దర్శించినప్పు డాశువుగాఁ జెప్పిన పద్యము.

మ. ఇతఁడా రంగదభంగసంగరచమూహేతిచ్ఛటాపావకో
ద్యతకీలాశలభాయమానరిపురాడ్దారాశ్రుధారానవీ
నతరంగిణ్యబలాసమాగమసుఖానందప్రయోధిస్తుతా
యతశౌర్యోజ్జ్వలకీర్తి వత్సవయరాయక్ష్మాతలాధీశ్వరుం; డితఁడా?

ఈరీతిని "ఇతఁడా" యనుప్రారంభముతో నూఱుపద్యములను రచించె ననువాడుక కలదు; కాని తక్కినపద్యము లెచ్చటను లభ్యములు కావయ్యె.

## ఏనుఁగు లక్ష్మణకవి

ఈలక్ష్మణకవిపైఁ గూచిమంచి తిమ్మకవి వ్రాసినపద్యము.

గీ. భారతీవదనాంబుజభ్రాజమాన
కలితకర్పూరతాంబూలకబళగంధ
బంధురంబులు నీమంజుభాషణములు
లలితగుణధుర్య! యేనుఁగులక్ష్మణార్య!

## శిష్టు కృష్ణమూర్తికవి

ఈకృష్ణకవి పదునెనిమిదవశతాబ్దిలో నున్నవాఁడు. ఇతఁడు సంగీతసాహిత్యములు రెంటియందును మిగులఁ బ్రసిద్ధి వడసినవాఁడు. ఈతఁడు రచించిన చాటువు లనేకములు. అందు కాకర్లపూఁడివారిపైఁ జెప్పినది.

ఉ. వీరు తెలుంగుసాము లరబీతరబీయతునొప్పుగొప్ప స
ర్కారువలే జమీలు దరఖాస్తుగ నేలినరాజమాన్యహుం
వీరులు ఢక్కణీలు తజివీజుకులాహికు లున్నమేటిమం
జూరు జొహారు యాఖిదుమషూరు ఖరారు మదారు బారు బ

ర్దారు మీాత్కగ్గురాలపఠదాగులశారు కడాని తేరులం
బారుమితారునౌబతు సుమారు పుకారును బారుకుత్తినీ
డారుగుడారు పైకము బిడారు బజారు కొటారులందు నే
దారు పఠాణిబారు దళదారు సవారు షికారులందు బి
ల్కారు సతాసవారు పిలగోలతుపాకుల ఫైరు లందు లే
ఖ్యారుగఁ జెక్కుమారులు తయారుగ పీకిహజారులందు వె
ద్యారులు పెద్దపేరుల జొహారులు చూచి హమీారు లెంచి ద
ర్బారు పసందు మీాఱ వహవా యని మెచ్చునవాబుఖాను షేం
షేరు బహాదదుల్ పెఱవజీరుల నూఱులమాఱు కెన్నఁ దా
ర్మాలుగ మోది గీములు తమాము వవల్చి మఖాము లెల్ల ఫీ
ర్ఫా రొనరించి మిక్కిలి మరాతబు లందిరి చేరుమాలు త
ల్వారులఁ జేరుదారు డళవాయుల చాయలమీఱు చారుకై
జారు కరారు బాకు నెరజారు తళుక్కున బందుబస్తుగాఁ
బోరు భుజోరుకాకరలపూాషి వజీరులదే యమ న్మహో
దారులు పూర్ణనిర్మలసుధాకరకాంతికలాపకీర్తివి
స్తారులు భూరిభూసురవితానమహాహుతిగంధగౌతమీ
తీరనిసర్గదుర్గపురదీపితహార్మ్యతలాగ్రభాగసం
చారులు దేవవారవనజాతముఖీసమవారకామినీ
వారకరాబ్జకీలితసువర్ణమణిద్యుతిదండచామర
ప్రేరితవాతధూతనవఫేనసమానవితానమంగళా
కారసువర్ణపీఠపరికల్పితరాజ్యరమామహామహా
ధారులు సేతుశీతవసుధాధరమధ్యతలస్ఫురల్లస
ద్వీర వి శేషసంజనితతీవ్రదవానలబాడబాగ్నిత
త్వారినృపాలజాలమకుటార్పితపాదపయోజపీఠ సం

సాక్కారులు రామచంద్రపురసాలనివాసులు రామచంద్రవం
డాతులు రామచంద్రవసుధావరపౌత్త్రులు రామచంద్రధా
త్రీశపుత్త్రాభిధానులు వరిష్ఠవసిష్ఠసగోత్రపావనుల్
కారణజన్ము లబ్ధిశశికల్పక మేఘసమానదానదీ
క్షారతు లిందిరాసుతజయంతవసంతసమానసుందరా
కారులు బ్రహ్మకల్పము సుఖంబుగ వర్ధిలువార లీధరన్.

## కాళహస్తిరాజుపైఁ జెప్పినది.

ఉ. డామెరవేంకటక్షితిప! తావకపాండురకీర్తిదీధితి
స్తోమము లిందుభాస్వతులతో నెదిరించి తృణీకరించె నా
గాములకేమి యోజనలు కాని యశంబులు మేయుశంబరం
బేమర కుబ్బి మీఱ వసియించునె డాసి తదంతరంబునన్.

## దంతులూరి వేంకటకృష్ణరాజుపైఁ జెప్పినది.

ఉ. పండితపాళి శిష్టకులవార్నిధిసోముఁడు కృష్ణమూర్తి కా
ఖండలతుల్యవైభవు లఖండితదానవినోదు లార భూ
ఖండ మొసంగి రిప్పు డది కాపుర ముండమిఁ బోవ దగ్గఁగా
నుండనిముక్కు తుమ్మిన మఱుండునె? కృష్ణనృపాలకాగ్రణీ!

చ. సలలితలీల నెత్తఱిని సత్యపదస్థితి తప్ప కెల్ల సూ
రులకుఁ బ్రమోదసంతతినిరూఢి తగన్ సమకూర్చి జీవనం
బు తిడెడుమర్త్యమూర్తి మఱుఁబోవఁడె కృష్ణమహేంద్రచక్రవ
ర్తి లసదనంతకీర్తి యవధీరితమామకహృద్గతార్తియై.

ఉ. పైపయిరంగులం గదిసి పన్నుగబోగపుటన్నువన్నె పెం
పై పనుపడ్డ కబ్బముల కబ్బురమా? వెరమాను మేలు వాత్
చూపులప్రాపులన్ వలపుఁజూపుద నీటుగుమాటతేట బల్
దీపులు పుట్టి నెట్టనఁ బదింబదిగా నెదఁ జిక్కి చొక్కపుం

బూపచమంగవం గలిపి పోడిమి వేఁడి మిటారిపుంగటా
రీపసమీాజియారు చిగిరించెడి మిం చదరం గడంగి మే
లీపని యంచు నెంచు మది హెచ్చగ మెచ్చగ నిచ్చవచ్చిన
ట్లోపినయంతవట్టు బిగియాఁతగ వాతెఱ మార్పు నేర్పులన్
దాపగుముద్దుగు మ్మకసి తద్దయు గద్దరి పైడిప్రోదిమేల్
గోపు లెఱుంగఁజేయు నలకోయిలకూఁకలచాయ నింపు తీ
రై పొసఁగన్ వలెన్ జవుల నందిన దంటతనాన విచ్చి క
న్నోమపిన పేరుటామనిఁ గనుంగొననై కనునీటు తేటలన్
దూ పెడలించి పెంచఁ దగుతోపగుగొజ్జెగపూలబాఱుతీ
రై పొసఁగన్ వలెన్ జవుల నందిననమ్మరు తేరుదారు లో
ప్పాపవళింపుమేడగదిపందిరి నొప్పెడుపట్టెమంచముం
దాపని ముందు నూడిగపుటంచము చింపఁగ నందగత్తెచేఁ
జాపి యొసంగువీడెముపసన్ వలపున్ మొలపింపఁగావలెన్
దేపకు దేప కిప్పగిదిఁ దెన్గొనరించెడుపట్లు; సంస్కృతా
టోపముఁ జూపుచో నలికుటుంబకఝూంకరణాంకకల్పవ
ల్లీపరివేల్లనొల్ల సదలీవనలీనసదానపాయసూ
నోపలసత్ప్రభూతపురుహూతవనీభవనిర్ఝరావనీ
జోపరిపుష్పనిష్పతదనూనమరందఝరీపరీతసం
తాపహరాంబుపూరపరితస్సరణోత్థఘులంఘులధ్వని
వ్యాపిసురాపగాంతరసమగ్రతనుగ్రహనాయికాన్యపే
క్షాపరిహీనచారుతరసౌరభసౌరభరాతిభాసురా
ష్టాపదకంజపుంజనినసత్కనకచ్ఛదహంససంసదా
లాపకలాపసమ్మిళితలాస్యకలావలమానకాంచికా
నూపురకింకిణీగణవినూత్నతరద్యుతిరత్నకంకణ

ప్రాపితఘుణంఘుణక్వణనరంజితమంజులరూపరేఖపై
కీపరిగీతతారతరగీతవినూతనజాతమాధురీ
రూపనిరూపణీయమయి రాధికి నెక్కువలెం గవిత్వవి
ద్యాపటిమం బటించు నను నంతటివానిగ నెంచి నాదుప్ర
జ్ఞోపచయంబునం బిలిచి యుర్వర సర్వరసజ్ఞు లెన్నఁ జూ
పోపనివారు చిన్నతన మూనఁగ సన్నిధియందు నిల్పి పృ
థ్వీపవవిష్ణుమూర్తి యవధీరితకర్ణవితీర్ణనైపుణా
శాపరిపూర్ణకీర్తి విలసద్గుణసంతతివంతులూరువం
శోపధిసింధుబాంధవసముజ్జ్వలపూర్ణసుధాంశుమూర్తి యు
ర్వీపతిచక్రవర్తి యనఁ బేరగువేంకటకృష్ణమూర్తి యా
శాపరిపూర్తి సేయఁగ విచారము, నీమ్ప్రచార మేలగున్?

## పిఠాపురసంస్థానికునిపై జెప్పినపద్యములు

ఉ. శ్రీరమణీమణీరమణ సింధుసదృక్షకటాక్షవీక్షణాం
కూరసమృద్ధిసంతతినిగూఢనిగాఢసమస్తభాగ్యపా
ళీరమణీయదేవనగరీవరమాచిరమాపిఠాపురీ
భూరిమణీగణాకలితభూరినిరంతరకాంతకాంతివి
స్తారనిరస్తచిత్రకరసౌధసుధాకరకాంతవేదికా
చారుచిరత్నరత్నరుచిసాంద్రనగేంద్రమృగేంద్రపీఠి దు
ర్వారగతిన్ బయోజలధిపన్నగనాథశిరోధివీథికా
సారరుహాక్షు దీక్షసువిచక్షణతోఁ గొలువుండి మీరసా
ధారణవాక్సుధామధురధారల మీరలఘుప్రచారవా
చారుచిచాతురిం గలహసాధనరాజవిరాజితారి రా
డ్ఢారువిదారణక్రకచదారుణపండితమండలాగ్రభృ

ద్వారులఁ బిల్చి కృత్యము సవిస్తరతం దగ నెంచి మంచి యిం
పారెడుహృద్యవాద్యకలనాఖిలగీతకళాకలాపని
స్తారకులం గవిప్రకరతార్కికశాబ్దికవేదపాదులన్
గౌరవమొప్ప గొప్పగ నగణ్యధనాదిసనాథులన్ ధృతిన్
గోరిక మీఱఁ జేయుచు నకుంఠనటత్పదకంజమంజుమం
జీరసురత్నపుంజమృదుశింజితముల్గలరాజహంసికా
సారససారసధ్వనులసందడులన్ దుడుకందఁ జేయువా
ణీరభసంబు డంబొదవ నిస్తులభూభృదపాత్తజీవికా
చారరమాసమాన లసమానుల జాణలు మీఱ నాట్యవి
స్తారపదక్రమాభినయతానవితానవిభాగరాగగో
ష్ఠీరుతిధీరతన్ బుధులచిత్తము నత్తగఁ జిత్తగించుచోఁ
గోరికఁ దెల్పువేళ యని కొంకణతెంకణలాటఖోట సౌ
వీరశకాదిదేశపృథివీవరు లందఱు ముందుముందుజో
హారులు చేసి నిల్వ సెలవాయెను మీకిటఁ జేర నంచుఁ జో
బ్దారులు దెల్ప జో హుకుము వాదరబాఱుపసందుమీఱు స
ర్కారు ఖొదా బరాబరుఖరారుమదారులమీఱు తీరుద
ర్బారని యెన్ని పన్నొసఁగి పన్నగ సన్నుతు లెన్నొ సేయుచో
మీఱిననేర్పుతోడఁ బుడమిం గడుఁ బ్రోచుము నిత్యసత్యవా
ణీరతిభారతీరమణునిం బరమూర్తిని మాధవున్ శివా
చారత నీశు సద్గతిని జంద్రు సదాసుమనఃప్రయుక్తిచే
సౌరధరావరుం గని యజస్రముఁ గేరుచు మీఱుచుందుగా
వీరవరేణ్య, రావుకులవేంకటరామమహీపతీ, కృతీ!
మారసమాకృతీ, సదసమానయశశ్శరదాననిందిత
క్షీరపయోధిసారమణిశీతకరామరభూమిరుద్ద్యుతీ!
భూరమణాగ్రగణ్య, మిము బ్రోవుత దేవత లెల్లకాలమున్.

ఈకవి యొకవేశ్యపైఁ జెప్పిన పద్యము.

సీ. దురుసానిపై నున్న బురుసాపనిరుమాలు
కరసారసమున నొక్కపరి విసరి
కురుదాపడనిలీల పరదా వెడలి వచ్చు
సరదా తెలియఁ బైట జాఱ విడిచి
అఱజార్లకురులు క్రమ్మఁగ జాఱిపడి ఫ్రాలు
విరజాజిపువ్వుల విసరి విసరి
వెఱబాఱుగాలి నా షారబాటు విడ మారు
దరబారుపావడఁ దార్చి తార్చి
పకడుగలకమ్మవిలుకానిహుకుమతీపు
తలబుజాహిరుగావక్తు తలఁపుఁజేయు
దీనిఫక్తుతమాషాఖుషీనిషాల
ఖిలవతురభీకు నయినను దెలియ వశమె?

చెళ్లపిళ్ల నరసకవి

ఈ ప్రౌఢకవి నివాసగ్రామము గోదావరీమండలములోని కడియము. ఈయన పదునెనిమిదవ శతాబ్దిలో నున్నవాఁడు. ఈకవిరచితములగు గ్రంథములు 1. యామినీపూర్ణతిలకావిలాసము, 2. వేంకటేశ్వరవిలాసము, 3. ఏకప్రాసకంద గోపాలశతకము, 4. అహల్యాసంక్రందనవిలాసము, 5. ఏకాంతసేవాకలాపము. ఈకవిచంద్రుఁ డాశుకవితారచనయందు మిగులఁ బ్రజ్ఞఁ గలవాఁడు. ఈయన కాదొండకాయలపైఁ బ్రీతి మెండు. ఒకానొకప్పుడు పొలములో నాదొండకాయలు గోయుచుండ, వెంట

నున్నవా "రయ్యా! తమకు దీనియందుఁ బ్రీతివిస్తారము గదా! ఇప్పు డొకపద్యమును దీనిపైఁ జెప్పుఁ"డని కోరఁగా నీకవి యాశువుగా రచించినపద్యము:

మ. కనకాంతు న్నతి దైవతప్రమదతార్థ్యశ్రీన్మహీనీరంధ్ర
చ్ఛ్రవమానా పృతశీకరాభనవబీజప్రాంతరోపవ్యస
ద్భవనాజాండకు షడ్రసప్లుతసముద్యత్స్వాదుమస్తుండకున్
అవితుంగోద్భవకాండకున్ సరసమోహాకాండ కాదొండకున్.

ఈయనదే వేఱొకపద్యము.

ఉ. రామశరప్రయోగము; సురప్రభువజ్రము: చక్రిచక్రమున్;
ధామనిధిప్రియాత్మజుని దండము; కామరిపుత్రిశూలమున్;
భూమినొకప్పు రిత్తయయి పోయినఁ బోవునుగాక, యీకవి
స్వాగ్నులవాక్ప్రయోగముల బ్రహ్మకునైనఁ దరంబె త్రిప్పఁగన్.

## అడిదము సూరకవి

ఈకవి పూసపాటి విజయరామరాజుగారి యాస్థానకవి. విజయరామరాజుగారు విజయనగర ప్రభువులు. విజయనగరము విశాఖపట్టణపుమండలములోనిది. ఇక్కవి నివాసగ్రామము రేగ (రేవ) యను గ్రామము. ఆగ్రామమునఁ జెఱువుక్రింద నతనికి మాన్యము కలదు. ఒకసంవత్సరమున దంతులూరి యన్నమరాజనునాతఁడు గ్రామము నంతయు గుత్తకుఁ దీసికొని, చెఱువుఁ బిగఁ గట్టించి, మాన్యమునకు నీ రీయకపోఁగా సూరకవి, పద్యములతో, రాజుగారికి మనవి వ్రాసికొనెను. ఆపద్యము లివి.

సీ. అనఘాగు దేవ! మహాప్రభూ! విన్నపం
బాశ్రితోత్తముఁడ శుద్ధాంధ్రకవిని
పేరు సూరన యింటిపే రడిదము వారు
మాజాగ భూపాలరాజరేగ
నల్లకృష్ణక్షమానాయకాగ్రేసరుం
డెఱ్ఱికృష్ణక్ష్మాతలేంద్రు లచటఁ
గరిణీకధర్మంబుఁ గల్పించి మాన్యంబు
దయచేసి రది యాస్పదంబు మాకు
అదియును నీయేఁడు దంతులూరన్న నృపతి
సత్తముఁడు గ్రామ మంతయు గుత్తఁ జేసి
చెఱువు బిగఁ గట్టె జనులు జేజేపడంగ
ముంచఁ గట్టించె మాపుట్టి ముంచఁ దలఁచి.

సీ. విన్నవించెద నాదువృత్తాంత మది కొంత
చిత్తగించు పరాకు సేయఁబోక
పొలములో నొకఁ డూడుపూడ్చంగఁ జాలఁడు
గంగాభవాని ఘాకాకు నెఱచి
దుక్కిటెడ్లను గొని దున్నెద మన్నచో
బదు లీయఁ డొక్కండుఁ బాతనేబు
నేఁజోలికినిఁ బోక యింట నుండుద మన్న
సాలుకు వచ్చు గంటాలపన్ను
తెరువు తలగాదు పొన్నూరు తెన్ను గాదు
పంటపస లేదు గంటాలపన్ను పోదు
మీకు దయరాదు మునుపటి మిసిమి లేదు
అతులగుణదీప, విజయరామావనీప!

వేఱొకప్పు డాయన్నమరాజు సూరకవిమాన్యమునుండి చెఱువుముణుగునీరుఁ బోనీక, యడ్డుఁగట్టించి చిక్కులు కలుగఁ

జేసెనఁట. అందులకు సూరన, యారాజును బ్రార్థింపక, తన మాన్యమున నిలిచిన మోకాలిబంటిముఱుగునీటిలో నిలుచుండి గంగాభవానినిగుఱించి నాలుగుపద్యములను జెప్పఁగా, నారాజు కట్టించిన యడ్డుకట్టతెగి, ముఱుగునీ రంతయుఁ గ్రింది పల్లము నకుఁ బోయెనఁట. ఆపద్యము లీక్రిందివే:—

సీ. బ్రహ్మాండభాండసంపత్తిఁ గుక్షినిఁ గల్గు
పద్మనాభునిపదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థాన మై యుప్పొంగు
నంబుధీశునిచరణంబుఁ ద్రొక్కి
పరమతత్త్వజ్ఞుఁడై పరఁగుశంతనుమహీ
రమణువామాంకభాగమునఁ జేరి
అఖిలలోకాధ్యక్షుఁడై మించి విహరించు
శివుజటాజూటాగ్రసీమ నిలిచి
తనరునీవంటిధన్య కుత్తమము గాదు
పూసపాటిమహాస్థానభూమియందుఁ
గాలు ద్రొక్కంగ నోడుఁ జండాలుఁ డైనఁ
గదలు మిట మాని దివిజగంగాభవాని.

సీ. ఆదిభిక్షుం డీతఁ డని రోసి విడియాకుఁ
గొని వచ్చి యిట నిల్వఁ గోరి తొక్కొ
జగడాలచీలిపై సవతితోఁ బోరాడి
వీఁగి వచ్చి యిచట డాఁగితొక్కొ
నిర్జరాంగన లెల్ల నీఱంకు వెలిఁబుచ్చ
దూఁబవై యిచ్చోట దూరితొక్కొ

బీదబాపలఁ గష్టపెట్టుటకై మిన్నుఁ
దొలఁగి యిచ్చోటను నిలిచి తోఁకొ్క-
వలదు ద్విజభూమిఁ గాల్నిల్వ వరుసగాదు
అవ్వ నీకేల తగ దంబురాశి కరుగు
నాతి యతఁడె కాఁడఁటె పిన్ననాఁటిమగఁడు
కదలు మిట మాని దివిజగంగాభవాని.

సీ. భావింప నీలు వెల్ల భంగంబులే కాని
భంగము ల్దొలఁగు టెప్పటికి లేదు
తిరుగుచోఁ వంకరతిరుగు డింతియ కాని
తిన్నగాఁ దిరుగుట యెన్నఁ డెఱుఁగ
మొనసి రేయిపవళ్లు మొరయుచుండు టె కాని
మొరయ కూరక యుంట యెఱుఁగ వెపుడుఁ
బరులకల్మిని రోసి పల్చనగు టె కాని
పలుచనిగతి మాని మెలఁగు టెఱుఁగ
మనుచు నీలోన నీవైన యవగుణంబు
లరసి లజ్జించి డివి సుండ కరుగుదెంచి
నిలువు నీరైన నీ విందు నిలిచి తోఁకొ్క-
కదలు మిట మాని దివిజగంగాభవాని!

సీ. కృతకాద్రు లాయెనా కీలోగ్రఫణిఫణా
నేక ఘూత్కారవల్మీక చయము?
విరిదోఁట లాయెనా కఱుకకంటకకంట
కాంకురవిస్ఫురితాగచయము?
పువుఁబాన్పు లాయెనా నవమంజులశ్వేత
లవణాలవాలఁ మా చవుటినేల?

బొమ్మరిం డ్లాయెనా భూరిభేకాండజా
ధారనై తనరు కేదారచయము?
నీకు విహరింప వసతులై నివ్వటిలెనె
చిన్నపొలములు? బ్రాహ్మణక్షేత్రమునకు
ఘాతుకత్వంబుఁ జేయుముష్కరులుఁ గలరె?
కదలు మిటు మాని దివిజగంగాభవాని!

ఈసూరకవికిఁ గల్లూరి సోమనాథుఁడనునొకవైదికకవితో వివాదము సంభవింపఁగా నీతఁడాకవినిట్లుతిరస్కరించెను.

క. ఏమేమో శాస్త్రంబులు
తా మిక్కిలి చదివె నంట తద్దయుఁ గవితా
సామర్థ్య మెఱుఁగ నేరని
సోమునిజృంభణము కలదె! సూరనియెదుటన్.

దానికి సోమనాథుఁ డొసఁగిన జవాబు.

గీ. సోమశబ్దార్థ మెఱుఁగనిశుంఠ వగుటఁ
పదరితివి గాక సూర్యునిరచనములకు
భంగకరుఁ డగుసోముజృంభణములీలఁ
దెలియవయ్యెయొ నీగుట్టు తెలిసెఁ గుకవి!

మరల సూరన చెప్పిన పద్యము.

క. చెన్నగు నియోగికవనము
మిన్నగ వైదికున కబ్బి మిగులునె చెప్పుఁడీ
జున్నురుచి వెన్న కబ్బునె?
తన్నుక చచ్చినను గాని ధరలో నరయన్.

ఈపద్యముపై సోముఁడు వ్రాసిన పద్యములు.

ఉ. త్యాగము విక్రమంబు సుకృతంబు నిగర్వము నీతిబంధుసం
యోగము పెత్తనంబు వినియోగ మెఱింగి నటింప నేర్చని
య్యోగులు రాజయోగులు కుయుక్తుల మాయల విఱ్ఱవీఁగు ని
య్యోగు లనాథయోగు లవయోగులు నోగులు జోగు లెన్నఁగన్.

క. ఇలలో వైదికవిద్వ
త్తిలకంబుల కేమి దిక్కుఁ దెలిపితి వమ్మా
జిలిబిలిపలుకులవెలఁదీ!
పలుగాకినకారసుళ్లు పాలైతిగదే.

(సూరకవిధాటికాఁగలేక సోముఁ డీపద్యముల వ్రాసినట్లు తోఁచుచున్నది.)

ఆ. దేవునాన మున్ను దేశాని కొకకవి
యిప్పుడూర నూర నింటనింట
నేగు రార్గు రేడ్గు రెనమండ్రు తొమ్మండ్రు
పదుగు రేసి కవులు పద్మనాభ!

ఈపద్యమును సూరనయే రచియించె నందురు.

కుత్సితాక్షేపకులంగూర్చి యీకవి రచించిన సీసమాలిక.

సీ. తట్టెఁడంతవిభూతిఁ బెట్టి తాతలనాఁటి
కుండలాల్వీనులఁ గునిసియాడ
మైలఁ గ్రక్కెడు నేలుమడతలు నరసిన
బోడిబుఱ్ఱలమీఁదఁ బొసఁగఁజుట్టి

ప్రాఁతనీరుంగావిపంచెలు ముష్కము
ల్గనుపింపఁ గా డొల్లుకచ్చఁగట్టి
యంగవస్త్రంబుల నతికి కుట్టినయట్టి
దుప్పట్లు పైఁగప్పి తుదలు చినిఁగి
నట్టిపుస్తకముల కట్టలు చంకలోఁ
బెట్టి విషంబులు విదులుకొనుచుఁ
బలుగాకిముండబిడ్డలు శిష్యులని కొంద
ఱుపచారములు సేయుచుండఁగా స్వ
యంపాకనిష్ఠుల మని వంట సాగించి
పదిదినంబుల కొక్కపట్టుఁబట్టి
సంగీతసాహిత్యసరసవిద్యలవారి
పాలిటిభూతాలపగిదిఁ దనరి
యెంత చక్కనిశ్లోక మేని పద్యంబేని
రస మెఱుంగక ముష్కరత వహించి
ఇతఁడు పండితుఁడు గాఁ డితఁడు తార్కికుఁడు గాఁ
డితఁడు శాబ్దికుఁడు గాఁ డితఁడు సత్కవి
యారసజ్ఞుండు గాఁ డని చుల్క నాడుచు
ఘనవిత్తహరణదుష్కర్ము లగుచుఁ
బరఁగుదుష్పండిత బ్రహ్మరాక్షసులచేఁ
గవితారసజ్ఞత కట్టువడియెఁ
గాన నేరీతిఁజూచెదో కరుణ మాదృ
శులకవిత్వ మేరీతిని సూటిఁ జేసి
రక్షఁ జేసెదో నీవె సూ! రక్షకుఁడవు
జానకీరామ! దేవతాసార్వభౌమ!

## ప్రౌఢకవి మల్లన

ఈమల్లన బమ్మెరపోతనామాత్యుని కుమారుఁడగుప్రౌఢకవిమల్లనయే. శ్రీనాథుఁడు తాను తెలిఁగించిన నైషధగ్రంథమును తన బావమఱఁదియగు పోతనకు వినిపించి, తన శక్తిని వెల్లడించి యాతనిచే మెప్పువడయు తలఁపుతో నొకనాఁడు బావమఱఁదియింటికిఁ బోయెనఁట. ఆ సమయమునఁ బోతన గ్రామాంతరమున నుండెనఁట. ఇంటిలో మల్లనమాత్రముండెను. మల్లనకుఁ జిన్నతనము. శ్రీనాథుఁ డింటిలోనికిఁ బోయి తాను మోసుకొని వచ్చిన తాళపత్రగ్రంథమును శ్రద్ధతోఁ బదిలముగా నొకచోటఁ బెట్టుకొని కూర్చుండి, యల్లుని వంకఁజూచి 'వరే, మీ నాయన యెక్కడికి వెళ్లినాఁడురా' యనియడుగఁగాఁ బ్రస్తుతముగ్రామములో లేఁడనియు, మధ్యాహ్నమున కింటికి వచ్చుననియు మల్లన ప్రత్యుత్తరముఁ జెప్పి మామగారిని కుశలప్రశ్న లడిగెను. శ్రీనాథుఁ డల్లునకుఁ జవాబులు చెప్పుచు గ్రంథమును విప్పి పారఁజూచుకొనుచుండెను. మల్లన దగ్గరకుఁబోయి 'మామా, అదియేమి గ్రంథ' మని యడిగెను. మామ నైషధమని బదులు చెప్పెను. అల్లుఁడు 'శ్రీహర్ష కృతమగుసంస్కృతకావ్యమేనా' యనఁగా, శ్రీనాథుఁడు 'కాదు, కాదు. దానినే నేను తెలుఁగుఁ జేసితి, దీనిపేరు శృంగార నైషధము లే' యని గంభీరముగాఁ బల్కెను. మామగారి నాటలు పట్టింపవలయునని యెంచి, మల్లన, 'ఓహో, మామా, దీనిని నీవుకూడ తెలిఁగించితివా' యనెను. ఆతఁడట్లనఁగనే శ్రీనా

ఘుఁడు కళవళపడి, చేతనున్న తాటియాకులపుస్తకము నట్లు విడిచి బొమలు ముడివెట్టి, అల్లునివంకఁ జూచి 'దీని నిదివఱ కెవ్వరు తెలిఁగించిరికా' యని యాతురతతో నడిగెను. మల్లన చిఱునవ్వునవ్వి "మానాయనగారు చాలకాలము క్రిందటనే తెలిఁగించియున్నారే" యనెను. ఆమాట చెవినిఁబడఁగానే మఱింత కళవళముఁ జెంది, 'యేమిది? దీని నిదివఱ కెవ్వరును తెలిఁగించియుండలే దను నమ్మకముతో, నా బుద్ధిబలమునంతయు ధారవోసి దీనిఁ దెలిఁగించితిని. పోతనయే తెలిఁగించెనా. తెలిగించెనే యనుకొందము. మాటమాత్రమైన, నాతో ననక రహస్యముగా నుంచునా' యని యేమేమో యోజించి యోజించి, మల్లనమాటలు గల్లలుగాఁ దలపోసి, దీనితో సర్వముఁ దేలఁగలదని నిశ్చయించుకొని, 'మీతండ్రిగారి నైషధములోని పద్యమొకటి చదువు'మని మల్లననడుగఁగా, నాతఁడు వెలవెలఁబోక, 'యేపట్టునఁ జదువుమనియెద' రనెను. శ్రీనాథుఁడు గొంకుచు, 'దమయంతి విరహాగ్ని నెట్లు వర్ణించెనో, ఆపట్టునఁ జదువు' మనెను. అప్పుడు మల్లన యీక్రిందిపద్యము నల్లనఁ జదివెను.

గీ. కాంత కలఁచినచందనకర్దమంబు
ఉగ్రవిరహాగ్నిఁ దుకతుక నుడికి చెదరి
చెంత నున్నట్టిదమయంతిచెలిమికత్తె
మెఱుఁగుఁ జాలిండ్లపైఁ బడి మిట్టిపడియె.

శ్రీనాథుఁ డీపద్యమునువిని పోతననైషధముఁ దెలిగించి నాఁడని నమ్మి, యేమియుఁ దోఁపక మిన్నకుండెను. ఇంతలోఁ

బోతరా జింటికి వచ్చెను; బావమఱఁదిని క్షేమసమాచారము లడిగెను. కాని శ్రీనాథుఁడు, చెప్పిచెప్పనట్లు చెప్పెను. ఈతఁ డెప్పుడును బోతరాజు నెగతాళిఁ జేయుచుండెడువాఁడు. నాఁ డట్టి ప్రసంగ మేమియు రాలేదు. నిష్కళంక హృదయుఁ డగు పోతనామాత్యుఁ డాతనియొద్దనున్న గ్రంథముం జూచి "యదియేమి పుస్తక"మని యడిగెను. ఆతఁడు, "బావా, నీవు తెలిఁగించినసంగతి తెలియక నైషధమును నేనుగూడ తెలిఁగించితిని. ఈగ్రంథ మదియే." పోతన: "బావగారూ! తమరు నైషధమును దెలిగించుట నీరీతిగా వెల్లడించుచున్నారా? లేక నన్ను బరిహాసము చేయుచున్నారా?' శ్రీనాథుఁడు: 'సరే, ఇఁక నెన్నినాళ్లు దాఁచెదవు? నీవబద్ధ మాడవనుకొంటిని. నే డంతయు బయలుపడెను'. పోతన రిచ్చవడి, 'ఏమిది? నేను నిశ్చయముగా నాగ్రంథమును దెలిగించియుఁ దనకుఁ జెప్పక దాఁచిపెట్టితినని నొక్కి పలుకుచున్నాఁడు. నిక్క మెఱుంగవలయు'నని తలఁచి 'శ్రీనాథకవీ! యీసంగతి నీకెవరైనఁ జెప్పిరా? లేక నీవేకలగంటివా' యనెను. అంతట తన కీసంగతినంతయు మల్లన చెప్పెననియు పద్యమునుగూడ వినిపించెననియుఁ జెప్పి పైపద్యమును జదివెను. మల్లననవ్వుకొనుచు నటనుండి లేచిపోయెను. పరమభాగవతశిఖామణి యగు పోతనామాత్యుఁడు నిజముఁ గుర్తెఱిఁగి చిఱునవ్వు నవ్వి 'కవిసార్వభౌమా! యీపద్యమును నేను వ్రాసితినని, నీయల్లుఁడు చెప్పుటయందుకంటె, నీవునమ్ముటయందుమిగుల సారస్యము కలదు. ఇట్టి రసభంగకవిత్వమును నాకెందు కంటఁ గట్టెదవు. అది మామలల్లుండ్ర గు మీ యిరువుర కే తగుఁగాక'

యు నెనఁట. శ్రీనాథుఁడు తన తెలివితక్కువ బయటఁబడుటకు విచారపడి యల్లుఁడు చేసిన మోసము నెఱుఁగఁజాలమికి సిగ్గిలి బావగారివలనఁ గలిగిన యవమానముచే వ్రగ్గెను. అప్పుడే యింటికి పోవలయునని యత్నించియు నట్లు వెళ్లిపోవుట మిగుల యవివేకమగునని యెంచి, యాపూట నిలిచి సాయంతనమున వెళ్లిపోయెనఁట.

## కూచిమంచి తిమ్మకవి

ఈతఁడు రసికజనమనోభిరామమును రచించిన రసిక వతంసుఁడు. ఒక వేశ్య యితనిరసికతకు మిగులసంతసించి, తిమ్మకవితో నెప్పుడు సంభాషింపఁ దటస్థించునా యని చింతించుచుండెనఁట. ఆ వేశ్య కవితారచనయందును గడుజాణయఁట. కాకున్న నిట్టితలఁపుకలుగఁబోవునా? తిమ్మకవి యొకానొకనాఁడు వీథినిఁ బోవుచుండెను. (ఆతనిసౌందర్య మంత ప్రశంసనీయము కాదనివాడుక.) ఆసమయమున నావేశ్యహఠాత్తుగా నామార్గమునఁ దిమ్మకవిఁ జూచి, యింతకన్నను మంచిసమయము తటస్థింపదని తలంచి మించినసంతోషమున నాతనిఁ గౌఁగిలించుకొనెనఁట. తిమ్మకవి నివ్వెఱపడి, పెడమోముఁ బెట్టెనఁట. అప్పుడవేశ్య

చ. 'చతురులలోన నీవు కడుజాణ వటంచును నేనుకౌఁగిలిం
చితి నిటుమోముమో మిడఁగఁ జెలునె?'

అనెనఁట, దానికి సమయానుకూలముగాఁ దిమ్మకవి

... ... ... ... ఓరసికాగ్రగణ్య! యు
ద్ధృతమగునట్టిబంగరపుఁ జొంగరపుంగవఁబోలు నీ కుచ
ద్వితయము ఆొమ్మునాటి యలవీఁపునఁ దోఁచె నటంచుఁ జూచితిన్.

అని జవాబుఁ జెప్పెనఁట. తిమ్మకవి చూపిన రసికత కావె ల్లాటకర్త మోదమంది, యేమో బహుమాన మర్పించెనఁట.

## ప్రూరె నరసకవి.

ఈకవి తన నెవరో తిరస్కరించి పలుకఁగా నీక్రింది పద్యముఁ జెప్పెనఁట.

చ. అటు నిసుమంత తిట్టవలె నంచు మదిం దలపోసి చూచిన
న్జటులనటన్నటాత్తునటజాగ్రదుదగ్రసమగ్రదృక్ఛటా
త్కటులుతదబ్జజాండతటఘట్టనఘట్టనచిట్చిటార్భటో
ద్భటకృపదభ్రశుభ్రచరభాగ్ఘనతుంగతరంగభంగకృ
త్పటుతరఘూమఘూమయుతభంగశతాంగపతంగలోపకృ
త్కుటిలశిఖానికాయభృతకుంతితతీక్ష్ణకృశానుభావమై
లొటలొటలై చనంగవలె; రోషముతోడను దిట్టఁజూచినన్
దటఁదటదంతకుంతకపరస్పరఘట్టన సెట్నెటల్ నెటల్
పటపటనిర్దళస్థలనభస్థలభూస్థలకాండకాండ ది
క్తటతటగంధదంతిఘనకాండకరండతదంతభోభువ
స్తటపటఘగ్ఘగద్ఘగితధగ్గగధగ్ఘగభగ్భగల్ భగల్
రటదనలోత్థహేతిజ్వాలలత్వరసత్వరవిస్ఫులింగికా

పటులత్రుటద్ధిరణ్యకశిపాంగనృసింహకఠోరరంహమై
యటమట లై చనంగవలె; నాదరణాప్తి నొకింతఁజూచినన్
పటుకన సారదంతిలసదశ్వశతాంగసువర్ణపేటికా
పటహాభణాంభణాంభణనభాంకరమత్తమరాళగామినీ
భటుపటుహారహీరచయబంభమబంభమబంభమారవో
త్కటకటఘూర్ణ రాయితపకాసనవంతనిరంతరంబులై
కటువులు నిండఁగావలయు; గట్టిగ దీవనఁ జేసి చూచినన్
బటుదురుతల్పమత్స్యగశివంకరశంకరవిశ్వసృట్ఛచీ
విటవరుణాగ్నిమారుతకుబేరయమేందుదినేంద్రదేవతా
ఘటభవనారదాత్రిశుకగౌతమముఖ్యతపస్విరాడ్వరో
త్కటకసమస్తధేనుమణికల్పమహీరుహపాళు లెల్ల ముం
గిటశర ణంచు నిల్వనలెఁ గీర్తినిఁ గోరినమానవోత్తముల్
కటువులు పల్కఁగా వలదొకానొకవేళ నొకించుకేనియు
న్నటమట లౌదు రూ రెఱుఁగ సాఱెన సాటితి జాగ్ర తింక వేం
కటగిరివాస తప్తమృదుకాంచనవాస రమేశభక్తుఁడన్.

## తిరుమల బుక్కపట్టణం తాతాచార్యులు

ఈ శ్రీవైష్ణవకవి నివాసగ్రామము గుంటూరుమండలము లోని చితాపురమను నగ్రహారము. ఆయగ్రహారములో నీయన కును భాగముకలదు. తాతాచార్యులు మంచి యాశుకవియు ప్రబంధకవియునై యశస్సుఁ గాంచిన ఘనుఁడు. తగుపాటి దూరములోనిలుచుండి గోడకుఁ దగులునట్లు రాయివేసి యారాయి క్రిందఁబడులోపలఁ గంధపద్యమును జెప్ప ప్రజ్ఞగలవాఁడని

వాఁడుక కలదు. అదియుం గాక యీకవి యుదారస్వభావ మును గలవాఁడు.

చిత్రాపురాగ్రహారములోనే బొగ్గవరపు పెదపాపరా జనునొకకవి కలఁడు. ఈకవు లిరువురు స్నేహితులు. ఒకకాల మునకు లేమిసంఘటింపఁ గుటుంబరక్షణము సేయనోపక పాప రాజకవి నైజాముకు వెళ్లి, తన స్నేహితుఁడగు తాతాచార్య కవి కీక్రిందిరీతిగా జాబు వ్రాసెను.

ఉ. తిరుమలబుక్కపట్టణసుధీవర! యోచిన తాతయార్య! నే
నరుదుగ జ్యేష్ఠశుద్ధవిదియారవివాసరమందు లేచి మీ
కరుణ హు సేనుసాగరము గాంచితి తన్నిహితత్రయోదశీ
నిరతముఁ జిన్నవాండ్రయెడ నీవయ యుంచవయా దయామయా!.

తన కీరీతిఁబద్యము వ్రాసినంతమాత్రముననే తాతాచా ర్యులుమనస్సుకఱిగి పాపరాజు తిరిగివచ్చుదాఁక నాతనికుటుంబ మును దానే పోషించెను.

ఈవిద్వత్కవి విశ్వగుణాదర్శమును దెలిగించి, వల్లమ ల్నాటి వెంకటచలంపంతులు (డిప్యూటికలెక్టరు) గారికిఁ గృతి యిచ్చెను. వారిదర్శనమునకు వెళ్లినప్పుడు కవి రచించిన పద్యము.

సీ. వరవల్లమల్నాటివంశాబ్ధి జన్మించి
రాకాసుధాకరు రహి వహించి

ప్రవిమలకీర్తిచే బలికర్ణులను మించి
సుతరాజవిభవంపుసొంపుఁ గాంచి
సకలవిద్యలయందు సుకవులఁ బ్రేమించి
నిఖిలరాజక్రియల్ నిర్వహించి
ధరణీసురోత్తమదారిద్ర్య మెడలించి
వనతటాకమ్ముల వసుధ నించి
కృతుల నియమించి సత్కవివితతిఁ గాంచి
ధరణిఁ బాలించి మించినధర్మమూర్తి
భూనుతశ్రేష్ఠ సత్కర్మభూరినిష్ఠ
చారుమణిహార ! వేంకటాచలవిహార !

ఈకవి వలపర్లజమీన్దార్లవద్ద కేఁగినప్పుడు, చెప్పిన
పద్యము.

ఉ. రోసముచే రణస్థలి విరోధులపెం పడగించువారిలన్
వేసరి కర్థికోటులకు వేఁడిన కోర్కుల నిచ్చువారిలన్
మీసము లంచు నెన్నఁ దగు మిక్కిలి తాదృశసద్గుణాదులన్
మీసము లైనవారలవి మీసములంచును నెన్నరాఁ బరీ
హాసము సేయువారలకు హాస్యకరంబుగ వాసివన్నెలన్
బాసి కవీంద్రులీవులకు; వైరులు పోరుకు వచ్చిన న్దృణ
గ్రాసపుదుష్టబుద్ధులను గైకొనుచుం డెడిపీడలోభిభూ
మీశులమూతులందుఁ గలమీసముల న్నమ మంమఁ బల్కవా?
త్రాసము లేక విక్రమధురంధరకుంభియుగోత్థమాంసమే
గ్రాసముగాఁ జరించుమృగరాజులమూతులయందు భాసి తే
మీసముల న్బిడాలముల మీసముల న్నమమంచుఁ బల్కనా?
హాసవిలాసభాసురమహామృగయాదులకన్న మించు మీ

మీసమొకింతమీటినను మీరిపుకోట్లకు సర్వదావనీ
వాసభయాపహవాసవివిధాన్న రసాదనపావధావనా
భ్యాసము లబ్బఁ జేయుఁ ... సే
బాసనఁ దాతయార్యకవివర్యుఁడ మీసభ కేఁగుదెంచితిన్.

తాడువాయి నరసింహమను నియోగిపైఁ జెప్పినపద్యములు.

ఉ. హాటకగర్భులీలఁ జతురాననత స్గడు వీటిఁబుచ్చి మో
మాటము లేక వాణినొకమాటనె నవ్వుచు నోటబుచ్చి యు
చ్చాటనఁజేసి గాటముగఁ జాటునుమాటనకొప్పు నీదు వా
చాటత నెన్నఁగాఁ దరమె సద్గుణరత్నఖనీ! సుధీ! నిరా
ఘాటపుతాడువాయికులకంధిమణీ! నరసింహధీమణీ!

సీ. అంభోధిసమహిమకుంభినీధరనిభ
గాంభీర్యధైర్యవిజృంభణంబు
బంభరీకృతనభశ్శుంభదారంభసం
రంభాబ్జకీర్తివిజృంభణంబు
అంభోధికన్యకాదంభకటాక్షలా
భోంచితసంపద్విజృంభణంబు
కుంభినీధూర్వహకుంభీనసీనాథ
సంభావితోక్తివిజృంభణంబు
కుంభికుంభసదృక్కుచకుంభయువతి
హృద్యసాకారమారవిజృంభణంబు
ధరణిలో నీకె తగునౌర తాడువాయి
వేంకటనృసింహా! సజ్జనవినుతరంహా!

సీ. వివిధవిద్వచ్ఛాత్రనిత్యవితరణనిస్తంద్ర!
దానమేఘమునకశాదానవేంద్ర!
అసదృశతాడువాయాన్వయాంబుధిచంద్ర!
పటుతరపాండిత్యపన్నగేంద్ర!
కమనీయభోగభాగ్యక్రమదివిజేంద్ర!
సంతతపోషితసత్కవీంద్ర!
శరణాగతాపన్నజనరక్షణోపేంద్ర!
హితధైర్యనిర్జితహిమగిరీంద్ర!
కీర్తనీయమనోహరకీర్తిసాంద్ర!
మాన్యగుణభూషితాశేషమానవేంద్ర!
సత్యభాషాహరిశ్చంద్ర! సాధ్వవాంగ
నిరసితరతీంద్ర! వేంకటనరసయేంద్ర!

సీ. నిరతసంరక్షితనిఖిలార్థిసంతాన!
సంతానసన్నిభసాధుదాన!
దానాంఘనిరసనత్రాణగుణాహీన!
హీనమానవలూనహృత్ప్రిధాన
ధానుష్కవర్ణితోద్యమధర్మసంధాన!
ఆనతవైరిజనాభిమాన!
మానసంరక్షణామ్లానధీవిజ్ఞాన!
విజ్ఞానవత్సుధీవినుతమాన!
మానినీమానహృత్పంచబాణ! బాణ
వైణికాహీనగానశుభప్రవీణ!
ధీనిదాన! బుధాధీన! గౌణ! త్యాడు
వాయివేంకటనరసింహ! వర్ణితాంహ!

సీ. నీదుభార్యామణి నీరజాక్షునిరాణి
నవలీల నవలీల నవఘళించు
నీరమ్య మసపాణి నిర్జరాగ్రశేణి
నీవిచే శీవిచే నీసడించు
నీకరస్థకృపాణి నీ మనోజ్ఞకృపాణి
వలె ధార్మికోద్ధారపటిమ నెసఁగు
నీచారుతరవాణి నీచారుతరవాణి
గావాణి వాణీశుఁ గడు హసించు
ననఁగ సామాన్యులకు నీదుగుణగణముల
గణన సేయంగఁ దర మె? యగణ్యపుణ్య
వర్ణ్య శ్రీతాడువాయిసవ్వంశచంద్ర!
వేంకటనృసింహమంత్రీంద్ర! వినుతసాంద్ర!

## బాగ్గవరపు పెదపాపరాజు

ఈకవి నిజాముగాజ్యమునకు వెళ్లినప్పుడొకగ్రామములో నీకుభోజనసామగ్రి యేమేమి కావలయుఁ జెప్పుము పంపించెద మని అక్కడివారనఁగా నీతఁ డీపద్యమును జెప్పెనఁట.

క. చుప్పావు శేరు బియ్యము
పప్పులసోలెండు నెయ్యిపావెఁడు పూబం
డొప్పారిపావు శేరుగ
నిప్పింపుడి యుప్పుగాయ లింతే చాలున్.

ఈకవికిఁ బోట్లూరనుగ్రామములో మాన్యము కలదు. దాని కిద్దఱు ముగ్గురు భాగస్థులు కలరు. ఆభాగస్థులు యీపాప

రాజుభాగమును బంచి యియ్యక తామే యపహరించుచుండ వారికి నీవైనను బుద్ధిం దెల్పుమని బొగ్గవరపు వేంకటరాయుం డను నాగ్రామకరణమునకుం గవి యీక్రిందిపద్యమును వ్రాసి పంపెను.

ఉ. మాన్యపుంబొలిధాన్యము సమర్థులమంచు హరించువారలక్
హైన్యముచెందుంగాని, 'భళి' యందురె? భూజను లోయనన్యసా
మాన్యవివేక! నీవయిన మంచిగుణం బుపదేశమిమ్ము ప్రా
వీణ్యముతోడ బొగ్గవరవేంకటరాయ! ప్రధానిశేఖరా!

ఈకవి బెజగము నరసయ్యయనునతనిపైం జెప్పినపద్యము

సీ. నీచిఱునవ్వు వెన్నెలబెదరింప నా
మోము చందురు గేరు టేమి చెప్ప?
నీకన్ను లంభోజనివహంబు నగ బొమ
లాకొమువిండ్లను గేరు టేమిచెప్ప?
నీ వర్థిజనకల్పవృక్షంబు నాం జేతు
లామానికొమ్మలం చేమిచెప్ప?
నీనడ ల్మదకరికానంజేయగంనూరు
లిభహస్తనిభములం చేమిచెప్ప?
చక్కందనముల కుప్పగా సరవి నిన్ను
ధాత జనియింపగాం జేసె ధరణిలోన
సకలశ్రీభూసురాశీర్వచనవివర్థి
తాన్వయనిధాన! కృతిగర్భితాభిధాన!

ఈపద్యమునం దాతనిపేరిముద్రపంబడియున్నది.

## కొమ్మలపాటి యోబనకవి

ఈ యోబనకవికి మంచళ్ల కృష్ణయ్యయనునొకకవి సవ్యాఖ్యానవసుచరిత్రము నొసంగెదనని చెప్పి, మూలము మాత్రమే పంపించెనఁట. తరువాత యోబనకవి కృష్ణకవి కిట్లువ్రాసెనఁట.

సీ. షడ్రసోపేతభోజన మిడి యతిథికి
    నాపోశనము నీక యలఁచుకరణి
అతిపిపాసార్తున కమృతకూపముఁ జూపి
    'చేదలే' దనుచు వచించుమాడ్కిఁ
దనరఁ గన్యాదాన మొనరించి తరిని గ
    ర్భాధాన మొనరఁ జేయని పగిదిని
దర్పణాంతరమున ధనరాశిఁ జూపించి
    కొను మెంతవలసిన ననువిధమునఁ
దెలియ నమలక రుచులను దిగక లోతుఁ
దెలియు నీవేల సవ్యాఖ్యఁ దెచ్చి యీక
మూల మంపితి రేటికి? మూలధనము
మూలధన మన్నయట్లు; సమూల మొసఁగు
పొల్లుపుచ్చకు తృష్ణ? మంచళ్ల కృష్ణ.

## గాళ్లబండి పట్టాభిరామరాజు

ఈబట్టుకవి నివాసగ్రామము గుంటూరుమండలములోని కుంకెళ్లకుంట (కుంకలకుంట) యనుగ్రామము. ఈతఁడు కొంత కాలము నర్సారావుపేట మల్రాజువారియాస్థానకవిగానుండెను. మైదోలురామనమంత్రిపై నితఁడు చెప్పినపద్యము.

సీ. రాజీవహితవంశరాముఁ డాతండు స
 ద్రాజీవరిపుకాంతిరాముఁ డితఁడు
సలలితశత్రునాశనరాముఁ డాతండు
 సలలితశత్రుభీషణుఁ డితండు
సకలవిద్యలమూలసంగ్రహుం డాతండు
 సకలవిద్యలఁ గన్నసరసుఁ డితఁడు
బహుతారకబ్రహ్మపద మిచ్చు నాతండు
 బహుతారకపుమంత్రపఠనుఁ డితఁడు
బుద్ధుఁ డాతండు లలితసుబుద్ధుఁ డితఁడు
శౌరి యాతండు నరకీర్తిశాలి యితఁడు
కలికి యాతండు నార్వేలకునుఁ డితండు
రాముఁడాతండు మైదోలురాముఁ డితఁడు.

ఈబట్టుకవి యొకనాఁడు సరికొండపాలెమనునొకయగ్రహారమునకుఁ బోయెను. ఆయగ్రహారికులలోఁ బెద్దపేరుఁ జెందినవాఁడు భాస్కరుని బలరామన్నగారు. నెఱదాత. కాని యీబట్టు యాచనకుఁ బోవునాటికి బలరామన్నగారు మిగులఁ బీదస్థితిలో నుండిరి. బట్టుమొగముఁ జూడఁగనే యేమియు దోఁచక "యీకవి కిప్పుడేమిబహుమానమిచ్చి పంపఁగలనా?" యని యోచించుకొనుచుఁ గూర్చుండెను. ఆయన యోజనలతో బట్టునకుఁ బనియేమి? ఈ రీతిగాఁ బద్యమును జదువ మొదలిడెను.

మ. కరుణా? గౌరవమా? విలాసగుణమా? గాంభీర్యమా? ధైర్యమా?
 సరసశ్రీనయమార్గమా? వినయమా? సత్యవ్రతాచారమా?

వరవిద్వత్కవు లెన్న నీకె తగురా? వర్ణింతురా? నిన్ను...

అనునంతకు బలరామన్నగారు, దిగ్గున లేచి, తన శిరోవేష్టనమును దీసి బట్టుచేతులలోఁ బెట్టెను. వివేకియగు పట్టాభిరామరాజు దాతయొక్క మదిని గ్రహించి సంతసించి

... ... ... ... ...బ

ల్లరభీమాహవభీమ! భాస్కరునిబల్లామా! వదాన్యప్రభూ!

అని పూరించెను.

## కుడుములరామన యనునాతనిపై జెప్పినపద్యము

క. నాటికి రాయనిబాచఁడు
నేటికి వినుకొండసీమనియోగ్యులలో
మేటివదాన్యుఁడ వీవే
కోటిమనోజాభిరామ! కుడుములరామా!

## కుడుముల వాసయ్య యనునతనిపైఁ జెప్పినపద్యము

సీ. శ్రేయోభివృద్ధిరస్తు భూయోఽస్తు తే సర్వ
విద్వజ్జనశ్లాఘ్యవివిధచరిత!
సౌభాగ్య మస్తు తే సర్వసర్వంసహా
భరణధురంధరబాహుశౌర్య!
విభవాదిరస్తు తే విశ్వవిశ్రుతమహా
వితరణసాహసవిహితసుగుణ!
శ్రీరమాపాంగవిశేషలాభోఽస్తు తే
కీర్తనీయానంతకీర్తిభరిత!

ఆయురారోగ్య మస్తు తే హర్షితాఖి
లావనీపతి! సప్తమహాంతతరంగ
పంకరుహాపుంజ భాస్వత్ప్రభాతిసాంద్ర!
వైభవసురేంద్ర! కుసుములవాసయేంద్ర!

కోటకోటీశమను నతనిపైఁ జెప్పినది.

సీ. ప్రజలచేఁ గాసుకావళినిఁ గాంచునతండు
హెచ్చుగా దీనుల కిచ్చు నితఁడు
విషమదృష్టినిఁ గొంత వీక్షించు నాతండు
సొంపుగా సమదృష్టిఁ జూచు నితఁడు
ఇల్లిల్లు తప్పక యేలమిసేఁగు నతండు
వస్నమిారెడు భాగ్యవంతుఁ డితఁడు
కట్టుపుట్టము లేక కట్టుఁజర్మ మతండు
కనకాంబరావళుల్ గట్టు నితఁడు
శూలియాతఁడు సద్గుణశాలి యితఁడు
జ్ఞాని యాతఁడు పరమసుజ్ఞాని యితఁడు
భర్గుఁ డాతఁడు నుతగుణవర్గుఁ డితఁడు
యీశుఁ డాతండు కోటకోటీశుఁ డితఁడు.

తురగా వెంకంరాజు

ప్రౌఢకవితాధురీణుఁడయిన యీకవియొకనాఁడు తాళ్లూ
నసుగ్రామమునకుఁ బోయె నఁట. ఆరోజుననే యొకకమ్మయిం
టిలో వివాహము జరుగుచుండెనఁట. ఈకవి ననుబహుమానిం

పకపోదురా యను ధైర్యముతో నాయింటి కేఁగి. తనరాక నాయింటియజమానునకుఁ దెల్పఁగాఁ బనితొందరలతో విసిగి యున్న యాతఁడు త్వరపడి, "యిప్పుడీకవుల యేడుపే నాకుఁ బట్టినది. చాలు చాలు వెళ్లు వెళ్లు" మనియె నఁట. అందుపై నీకవికిఁ గోపము వచ్చి, యీ క్రిందిపద్యమునుఁ జెప్పెనఁట.

సీ. పెండ్లి పేరంటాండ్రు పెను రంకులకు నేడ్వ
        బాజాభజంత్రీలు పప్పు కేడ్వ
రాజబంధువులంత రంకుముండల కేడ్వ
        బాజారువెలఁదులు పసుపు కేడ్వ
వచ్చిపోయెడువారు వక్కలాకుల కేడ్వ
        గుగ్గిళ్లకై పెండ్లిగుజ్జు లేడ్వఁ
బల్లకిబోయీలు భత్యాలకై యేడ్వ
        బలుపురోహితుఁడు నేబులకు నేడ్వ
హారతిరూకల కాఁడుబిడ్డలు నేడ్వ
        కుజ్జవాండ్రందఱుఁ గూటి కేడ్వ
అల్లుఁడనాథయం చత్తమామలు నేడ్వ
        కట్నంబుకై గ్రామకరణ మేడ్వ
పెద్దమగం డని పెండ్లికూఁతురు నేడ్వ
        పిల్ల చిన్న దటంచుఁ బెనిమి టేడ్వ
చాల్పగా నిన్ని యేడ్పుల సాగెఁ బెండ్లి
సరస తాళ్లూరులోపల విరసముగను
నజ్జు పేరయ్యచేసె యీనాటి కహహ
కమ్మకులమున జన్మించి ఘనులు నవ్వ?

## పుల్లకవి

సీ. ఎనుబోతు బలిసి మత్తేభంబువలెనున్న
భ్రమరంబునకు మదప్రాప్తి లేదు
బూరుగుమ్రా నెంత పొడవుగాఁ బెరిగినఁ
జిలుకకు ఫలవృత్తి సేయలేదు
మసిబొగ్గు కస్తూరిమహిమదీపించినఁ
బరిమళానందసౌభాగ్య మీదు
చవుటియుప్పును కండచక్కెరవలె నున్న
ననుభవహర్షమ్ము నంద నీదు
ఒక్కధనలోభి దొరవలెనున్నఁ గాని
యర్థివరులకు నందేమి యాస లేదు
మేలు మే లిట్టిమహిమ నిర్మించినాఁడు
పుల్లకవి నేలు గోపికావల్లభుండు.

సీ. కోతి తా సభయందుఁ గూర్చుండ నేర్చునే
కవిసి యొక్కొక్కనిఁ గఱచుఁగాని?
శ్వానంబు దేవరభోనంబు నెఱుఁగునే!
చెటిచివేగంబె భక్షించుఁ గాని
గాడిద యింతేని జ్ఞానంబు నెఱుఁగునే?
మొగమెత్తి యూరక మొఱుఁగుఁగాని?
సింబోతిపి తులసి చెట్టని యెఱుఁగునే
చెలరేగి మోడు గాఁ జేయుఁగాని?
యెంత యెవరికి ప్రాప్తంబొ యంతె కాని
యెక్కువైనగుణంబు ల వెట్లు గల్గు?
మేలు మేలిట్టిమహిమ నిర్మించినాఁడు
పుల్లకవి నేలు గోపికావల్లభుండు.

## మోచర్ల వెంకన్న

వెంకన్న దత్తప్ప వీరిరువురు నన్నదమ్ములు. తెలుఁగు కవులు. నియోగిబ్రాహ్మణులు. వీరి నివాసగ్రామము నెల్లూరు మండలములోని "తెట్టు" అనుగ్రామము.

ఒకనాఁ డొక వైయాకరణుఁడు వెలుగోటివిద్వత్కుమార కృష్ణయాచభూపతిం దర్శింపఁగా నారాజు—"మీరు తెలుఁగు కవనమల్లఁగలరా?"యని యాపండితుని ప్రశ్నించెనఁట. అందులకు వ్యాకరణపండితుఁ "డయ్యా నేను శబ్దశాస్త్రమునఁ బ్రవీణతగలవాఁడను. సంస్కృతమున నించుకకవనధాటియుఁగలదు గాని యాంధ్రమున నాకుఁబరిచయము లే"దనెనఁట. ఆరాజున కాంధ్రమున నించుకప్రజ్ఞయు నధికాభిమానమును గలదఁట. అందుచే నాపండితుని పాండిత్యమును గణింపక యాచభూపతి "తెలుఁగెఱుఁగఁడు సంస్కృతంపు తెన్నెఱుఁగుఁ" అనినట్లు తెనుఁగు తెలియని నీసంస్కృత మెందుకుపో"మ్మని నిరాదరించె నఁట! పాప మాపండితుఁ డేమిచేయుటకుఁదోఁపక అప్పు డీవెంకనకవిని దర్శించి తనకుఁగలిగిన యవమానమునుదెలుప నా యవమానము తనకు జరిగినట్లు భావించి వెంటనే రాజసముఖమునకు బయలుదేఱుచు ఆరాజుచేతనే మీకు నూటపదాఱ్లిప్పించెద రండీయని ప్రతిజ్ఞఁ జేసెనఁట. వ్యాకరణపండితుని వెంటఁబెట్టుకొని వెంకన యాచభూపతిసంస్థానమునకుఁ బోయి "తెలుఁగుకవులువచ్చినా"రని తెలియఁజేసెను. "దయచేయవల

సిన" దని యాహ్వానము వచ్చెను. రాజు వెంకనఁజూచి మీదే గ్రామ మన నాతఁడు మాది 'తెట్టు' అని చెప్పెను. అప్పుడు రాజు తెట్టేనా? యని యించుక నిర్లక్ష్యభావమును సూచింపఁగా నీకవి, మహారాజా! తెట్టన నంతచులకనఁగా జూడకుఁడు.

ఉ. తెట్టు కుమారకృష్ణజగతీవరనందన! రాజ్యలక్ష్మికిన్
బట్టు; ధరాంగనామణికిఁ బాపటబొట్టు; రిపూరగాళిన్
కట్టు; సముజ్జ్వలద్ధృతికి గట్టు; బుధాళికి వేల్పుఁజెట్టు; వా
గ్దిట్టల కునికిపట్టును మదీయనివాసము యాచభూపతీ!

అని యాశువుగా పద్యముం జదువ రాజు సంతసించి అయ్యా! తమపే రేమన,

క. నా పేరు వేంకనందురు
భూపాలకమకుటనీలపుంజమిళింద్రో
ద్దీపితపాదాంబుజకరు
ణాపర! వెలుగోటియాచనరనాథేంద్రా!

అని మరలనాశువుగా జవాబు నొసంగ నారా జచ్చెరు వంది, అయ్యా! తమ రాశువుగా గంట కెన్నిపద్యములు చెప్పఁ గలరని యడుగఁగా గంటకు నూఱుసమస్యల నాశువుగాఁబూరింపఁగలనని కవి ప్రజ్ఞఁబలికె నఁట. ఆసమయమున ఆస్థానకవులచే నియ్యఁబడి యీకవిచేఁ బూరింపఁబడిన సమస్యలు చాల కలవు. ఇందు రసోత్తరములుమాత్ర ముదాహరింపఁబడును. ఈ సమస్యలను ప్రభువే యొసంగెననువాఁడుకయుఁ గలదు.

స:—దృఢసత్త్వంబునఁజీమతుమ్మెఁగదరాదిగ్దంతులల్లాడఁగన్.

మ. సఘలీశోర్వి చలింప నిర్జరవరుల్ శంకింప భేరీనికా
యఘమత్కారత నిద్ర లేచి దశకంఠామర్త్యవిద్వత్పరి
వృథసోదర్యుఁడు లేచి రా వ్యథ యొనర్చె న్నాసికాంతస్థమై
దృఢసత్త్వంబునఁ జీమ తుమ్మెఁ గదరా దిగ్దంతు లల్లాడఁగన్.

సమస్య:—గుఱ్ఱానికి నైదుకాళ్లు కోడికివలెనే.

క. ముఱ్ఱాకుఁబాన్పుఁగాఁ గొని
జొఱ్ఱను బ్రహ్మాండపఙ్క్తిఁ బూనినముద్దుం
గుఱ్ఱడ! విను, వన్నెలు గుహలు
గుఱ్ఱానికి నైదు;కాళ్లు కోడికి వలెనే.

సమస్య:—కన్నులలోఁ జన్ను లమరెఁ గాంతామణికిన్.

క. చిన్నవి ఝుమకంబులు గొని
చెన్నలరఁగ బెత్తవారిచిన్నది రాఁగాఁ
బన్నుగ ఱొమ్మునఁ గల వల
కన్నులలోఁ జన్ను లమరెఁ గాంతామణికిన్.

సమస్య:—భార్య లిద్దఱు శ్రీరామభద్రునకును.

గీ. రావణుని సంహరించియు రాజ్యమునకు
నంగననుగూడి యభిషిక్తుఁడై వెలుంగ
హార తిచ్చిరి ప్రేమతో హరునిముద్దు
భార్యలిద్దఱు శ్రీరామభద్రునకును.

స:—తలలో క్కేఁపది నాల్గుకానఁబడియెన్ దద్గోరివక్షంబునన్.

మ. లలితాకారుఁగుమారు షణ్ముఖునిఁ దాలాలించి చన్నిచ్చుచో
గళలగ్నగ్రహరత్నదీప్తకళికాగాంభీర్యహేమాంచితో
జ్జ్వలరత్నప్రతిబింబితాననములన్ శంభుండు వీక్షింపఁగాఁ
దలలో క్కేఁబదినాల్గుకానఁబడియెన్ దద్గోరివక్షంబునన్.

సమస్య:—గుత్తఁపుతాపుతారవికకుట్టుపటుక్కునవీడెనింతికిన్

ఉ. అత్తఱిఁజిత్తజుండు విరహాంగనల న్దనలింప నిక్షువి
ల్లెత్తి ధనుర్గుణంబు మెఱయించి నిశాతవినూతనప్రసూ
నోత్తమబాణపఙ్క్తిఁగుచయుగ్మముదాటునఁ దాఁకనేసినన్
గుత్తఁపుతాపుతారవికకుట్టుపటుక్కున వీడె నింతికిన్.

ప్రభువుగారు మరల నాసమస్యనే యింకొకరీతిగాఁబూరింపు మనఁగా,

ఉ. ఇత్తఱి రమ్మురమ్మనుచు నింపుగఁ గొల్లలు తన్నుఁ బిల్వఁగాఁ
దత్తరపాటున న్గదిసి తాండవకృష్ణుఁడు సుందరాంగిఁదా
మెత్తనిపూలపాన్పునను మెచ్చికవుంగిటఁ జేర్చినంత నే
గుత్తఁపుతాపుతారవిక కుట్టుపటుక్కున వీడెనింతికిన్.

స:—ఇనశశిబింబయుగ్మముదయించెదినాంతమునందుఁ దద్దిశన్.

చ. ఇనసమతేజ! మీరు సెలవిచ్చినపీఠము హేమరత్నసం
జననము మేరుప్రస్తరము జక్కఁగఁదీర్చితిఁ బక్షమర్యో నే
ర్పునసురకోటుల న్దిశలఁ జొప్పుగ వ్రాయుచు రాఁగనేఁటికా
యిన శశిబింబ యుగ్మముదయించెఁ దినాంతమునందుఁ దద్దిశన్.

సమస్య:—మార్తాండుండపరాద్రిఁ గ్రుంకె నదిగో మధ్యాహ్న కాలంబునన్.

శా. కీర్తింపందగు రామసాయకమహాగ్ని జ్వాల శుంభన్నిశా
వర్తిన్ రావణుఁ గాంచి నారదుఁడు దేవాధ్యక్షుతోఁ బల్కె న
ట్లార్తిన్ జెంద మిమున్ జయించుఁగద! మున్నత్యుగ్రుఁడై దైత్యరా
ణ్మార్తాండుం డపరాద్రిఁ గ్రుంకె నదిగో మధ్యాహ్నకాలంబునన్.

సమస్య:—"చూతుమెలవుఁడా! యటంచు సుందరి పలికెన్.

క. ఖ్యాతిగలరామచంద్రుఁడు
చేతోమోదంబుతోడఁ జెలఁగుచు నెంతో
ప్రీతిగ నిటుఁజనుదెంచును
చూతుమె! లవుఁడా యటంచు సుందరిపలికెన్.

సమస్య:—అక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్.

క. రక్కసివలె నేప్రొద్దును
మెక్కుచుఁ దిరిగెదవు కాలిమెట్టున నినున్
గుక్కక మానను దసినీ
యక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్.

సమస్య:—కప్పురు సంపంగినూనె కావలె వింటే.

క. ఇప్పురమేలెడు పార్థివుఁ
డిప్పుడు నీతావు కనిచె నిదిగో యార్యా
తెప్పున నంగడితలుపులు
కప్పకు సంపంగినూనె కావలెవింటే.

సమస్య:—రారా తమ్ముఁడ రార యన్న యనె నారాజాస్య ప్రాణేశ్వరుఁ.

శా. గారాబల్లుఁడు నర్జునుండు శ్వశురాగారంబునం దుండఁగా
నీరేజాస్య సుభద్ర వచ్చి యతని న్వీక్షించి పెన్నిగ్గున
న్వారిఁ జొచ్చిన సత్య పట్టుకొని యింపారంగ నయ్యర్జునుఁ
రారా తమ్ముఁడ! రార యన్న"యనె నారాజాస్య ప్రాణేశ్వరుఁ.

సమస్య:—రామాయణార్థము వచ్చునట్లు;
తోఁచునడంగు వెండియునుదోఁచునడంగు మెఱుంగుచాడ్పునఁ.

ఉ. తోఁచకపట్టి తె మ్మనుచుఁ దొయ్యలి వేఁడిన వెంట నంటి చేఁ
జాచుచు మెల్లమెల్లఁగను జాడల జాడల నాశ లాశలఁ
నాచుకవచ్చు రామరఘునాయకుముందర మాయలేడి తాఁ
దోఁచునడంగువెండియును దోఁచునడంగు మెరుంగుచాడ్పునఁ

వెండియు నాసమస్యనే రామాయణార్థము వచ్చునట్లే పూరించుమనఁగాఁ గవి యిట్లు పూరించెను.

ఉ. పేఁచమడంచి రాఘవకపిప్రవరాదులు వాల్మగంటి మ
న్నేఁచఁగ మిన్నుమన్ను దిశలెచ్చటి వచ్చుటఁ గాలఁగారవిఁ
గ్రాచు శరాగ్నికీలల జగంబులు ఘూర్ణిల నింద్రజిత్తు తాఁ
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునఁ.

మరల దానినే భాగవతార్థమువచ్చునట్లు చెప్పుమనఁగాఁ జెప్పినది.

ఉ. పూఁచినమాటపట్లఁ దలపోయఁగలేక మనోభవుండు ప్రే
రేచ గణాలునాలుఁ దనురెప్పలనార్పక చూడఁగా మనం

బాపఁగలేనియట్టిత్రిపురారిపురస్థలి శౌరి నారియై
తోఁచు పడంగు వెండియును దోఁచునడంగు మెఱుంగుచాడ్పునన్.

సమస్య:—భామాకుచమండలంబు భస్మంబాయెన్.

క. కామాతురుఁడై జంగము
ప్రేమంబున బూతిఁబూసి ప్రియమలరంగాఁ
కామినిఁ గౌఁగిటఁ జేర్చిన
భామాకుచమండలంబు భస్మంబాయెన్.

సమస్య:—కుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెన్.

క. నిటలమున నీవు దాల్చిన
పటుతరకస్తూరిరేఖ బహుగతిరతిచే
నటునిటు జారినచెమటకుఁ
గుటిలాలక ! యెడమకన్ను కుడికన్నాయెన్.

సమస్య:—కామినికుచమధ్యమందు గరుడుం డాడెన్.

క. చేమంతిచెట్టుపొంతను
భామామణి నిదుర వోఁబయ్యెదజారన్
రోమావళి పామోయని
కామిని కుచమధ్యమందు గరుడుం డాడెన్

సమస్య:—పాతరలో సూర్యుఁ డుదయపర్వత మెక్కెన్.

క. ఈతటిఁ గాపులఁ బిలువుఁడి
రాతిరిప్రొద్దెల్ల జాత రాఁగెను ధాన్యం
బాతురముగఁ బోయింతము
పాతరలో సూర్యుఁ డుదయపర్వత మెక్కెన్.

సమస్య:—బడబానలపఙ్క్తిమీఁదఁ బచ్చిక మొలిచెన్.

క. పడఁతిరో! నవమేఘంబులు
విడిఁబడి జడిముసురుఁబట్టి విలయపువానల్
కడుఁగొట్టి కురియఁ గోడలు
బడబానలపఙ్క్తిమీఁదఁ బచ్చిక మొలిచెన్.

సమస్య:—ధారములేనిహారము నితంబిని! నీకెవఁడిచ్చెఁ జెప్పవే.

ఉ. భూరివివేకశాలివిటులఁ బూబొదరింప్లనుగూడి వారిచేఁ
గోరినభూషలెన్నొకొని కోమలి ధారిణిపైతి నందులో
హారము లుల్లసిల్లఁగ మహీప్రవరుల్ వినుతింపఁ బచ్చలా
ధారములేనిహారము నితంబిని! నీకెవఁ డిచ్చెఁ జెప్పవే.

సమస్య:—నూఱు న్నుప్పదియాఱు కన్ను లమరెన్ రుద్రాణి
వక్షంబునన్.

శా. రారమ్మంచుఁ గుమారు నంకముపయిన్ రంజిల్లఁగా నుంచి వి
స్తారోద్యద్ఘనవక్త్రపంచకముతో శంభుండుఁ దత్కాంతయున్
ఆరూఢిన్ఘనపంచరత్నపతకం బాలోకనజ్జేయఁగా
నూఱు న్నుప్పదియాఱుకన్ను లమరెన్ రుద్రాణివక్షంబునన్.

సమస్య:—ఇంకం గస్తురిబొట్టుఁ బెట్టకుము తన్వీ! ఫాలభాగం
బునన్.

శా. పంకేజానన నేఁటిరేయి వినుమీ పంతంబుతో రాహు వే
శంకాతంకము లేక షోడశకళాసంపూర్ణ నేణాంకునిం
బొంకం బార్చెద నంచుఁ బల్కెను తగం బోంచుండి నే వింటి నీ
వింకం గస్తురిబొట్టుఁ బెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్.

సమస్య:—వర్షాకాలమువచ్చె గ్రీష్మమువలె వైశాఖమాసంబునన్.

శా. హర్షం బెట్లగు? కృష్ణదేవుఁ డిటకై యబ్జాక్షి! రాఁడాయె సా
మర్షాహంకృతిఁ జంద్రుఁ డేచుతరి భీమద్వేషసామోగ్రదు
ర్ధర్షక్రూరనిశాతఘాతనవచూతవ్రాతబాణావళీ
వర్షాకాలము వచ్చె గ్రీష్మమువలెన్ వైశాఖమాసంబునన్.

సమస్య:—వక్త్రింబుల్పది కన్నులైదు కరముల్వర్ణింపఁగా వేయగున్.

శా. ఈక్త్రిప్రాసము కష్టమాననుచు మీ రింతేసివారాడఁగా
వాక్త్రిసంబది సత్యవీశ్వరులతో్రివల్గామినేఁ జెప్పెదన్
దిక్త్రిరాతికిఁ బార్వతీశ్వరులకున్ దిగ్మప్రభారాశికిన్
వక్త్రింబుల్పది కన్నులైదు కరముల్వర్ణింపఁగా వేయగున్.

సమస్య:—మరుఁడు దోనఁజూపె యముఁడు కింకరులఁజూపె.

గీ. భరతకులవీరుఁ డైనట్టి పాండురాజు
మాద్రిపై దృష్టిఁబఱపిన మగువ యంత
వలదు వలదని వారింప వాంఛఁగదియ
మరుఁడు దోనఁజూపె యముఁడు కింకరులఁ జూపె.

సమస్య:—చందురులో సిప్పి నేల చంగలిమేసెన్.

క. కందర్పహరుఁడు నరుఁడును
పందికినై పోరిపోరి పరిపరిగతులన్
గ్రిందైవహరుని శీర్షపుఁ
జందురులో నిప్పి నేలచంగలిమేసెన్.

సమస్య:—ఉత్తరమున భానుబింబ ముదయం బాయెన్.

క. అత్తగఁ మారుపుఁబడమరఁ
జిత్తరువు లిఖించి నిదురఁ జెందితి నారా
చిత్తరువు వ్రాయఁబోవలె
నుత్తరమున భానుబింబ ముదయం బాయెన్.

సమస్య:—కప్పను జూడంగఁ బాము గడగడ వడఁకెన్.

క. కప్పలకావలి కేగఁగఁ
జెప్పులు కట్టియునుఁ బూని శీఘ్రముగాఁగన్
జప్పుడుఁ జేయుచు జనువెం
కప్పను జూడంగఁ బాము గడగడవడఁకెన్.

సమస్య:—రామాయణార్థము వచ్చునట్లు

నినునినునిన్ను నిన్ను మఱినిన్ననునిన్ననునిన్ను నిన్ననున్.

ఉ. అనిలజ! జాంబవంత! కమలాప్త తనూభవ! వాయుపుత్త్ర! యో
పనస! సుషేణ! నీల! నల! భానుసులుండగు రాఘవేంద్రుఁ డ
ద్దనుజపురంబు వేగెలువ దైత్యులఁజంపఁగ వేగరమ్మనెన్
నిను నిను నిన్ను నిన్ను మఱినిన్నను నిన్నను నిన్ను నిన్ననున్.

అదే సమస్య:—భారతార్థము వచ్చునట్లు;

ఉ. అనఘసురాపగాతనయ! యర్కతనూజ! విచిత్రవీర్యనం
దన! గురుపుత్త్ర! ద్రోణ! కృప! నాగపురీశ్వర! దుస్ససేన! త
మ్మనుమనె రాజసూయము యమాత్మజుఁ డిప్పుడుచేయఁబూని తా
నిను నిను నిన్ను నిన్ను మఱినిన్నను నిన్నను నిన్ను నిన్ననున్

సమస్యనే:—భాగవతార్థము వచ్చునట్లు పూరించినవిధము;

చ. అనఘసురేశ! వాయుసఖ! అర్యమనందన! రాక్షసేంద్ర! జీ
వననిధినాథ! గంధవహ! వైశ్రవణా! నిటలాక్ష! తాము ర
మ్మనుమని చెప్పె మాధవుఁడు మారుని పెండ్లికి మిమ్మునందఱిన్
నిను నిను నిన్ను నిన్ను మఱినిన్నును నిన్నును నిన్ను నిన్ననున్

సమస్య:—పసిఁడిన శాకుతీఁగెకును బర్వతముల్వికసించినవ్వఁగన్

చ. విసువక పల్లవాళిఁదిని వేడ్కఁ బికంబులు మ్రోయఁగా వసం
తసమయ హేమకారకుఁడు తద్దయు వేడుక భూషణంబులన్
బస వనలక్ష్మిఁ గూర్చుకొని భాసిలు సంపగిపువ్వు పేరి మే
ల్పసిఁడిన శాకుతీఁగెకును బర్వతము ల్వికసించి నవ్వఁగన్.

సమస్య:—ఎలుకలు తమకలుగులోని కేనుఁగు నీడ్చెన్.

క. ఇలలో నిద్దఱురాజులు
మలయుచుఁ జదరంగమాడి మాపటివేళన్
బలమెత్తి కట్ట మఱచిన
నెలుకలు తమకలుఁగులోని కేనుఁగు నీడ్చెన్.

సమస్య:—మీనాక్షికిఁ గుచములారు మీనశరీరా!

క. మీనశరుఁడు నారసమునఁ
బూనిక సుమకందుకములఁ బొనఁగించె నవం
గాను విలసిల్లె నెంతయు
మీనాక్షికిఁ గుచము లారు మీనశరీరా.

సమస్య:—రండాగమనంబుఁ జేయ రమ్యంబ యగున్.

క. కుండినపురమున రుక్మిణి
పండితకరం బూజనలుపుసమయంబున కా
యండజవాహనుఁ డోడ్కొని
రం డాగమనంబుఁ జేయ రమ్యంబ యగున్.

సమస్య:—కమ్మలు మోకాళ్లు తాఁకి ఘలుఘలు మనియెన్

క. కొమ్మను మసనుం డపుడు జ
నమ్మన నీలోత్పలముల వడి నేయంగా
సొమ్మసిలి మోము వంచినఁ
గమ్మలు మోకాళ్లు తాఁకి ఘలుఘలు మనియెన్

సమస్య:—నిప్పున నొకచేరెఁ డంత నెత్తురు గాఱెన్.

క. కుప్పించి వెలుఁగు మాఁకిన
గొప్పవులిదె నాకె నిపుడు కోమలి వేగన్
ఉప్పుఁ గొనిరమ్ము కాత్రము
నిప్పున నొకచేరెఁ డంత నెత్తురు గాఱెన్.

సమస్య:—సుగ్రీవుని యెడమకాలు శునకము కఱచెన్.

క. అగ్రారిపునడివీథిని
నిగ్రహముగ బొమ్మలాట నేర్పుగఁ నాడన్
విగ్రహము చిత్తమఱచిన
సుగ్రీవునియెడమకాలు శునకము కఱచెన్.

సమస్య:—గాడిద యేడిచెఁ గదన్న ఘనసంపన్నా!

క. ఆడినమాటను దప్పిన
గాడిదకొడు కంచుఁ దిట్టఁగా విని యయ్యో
వీఁడా నాకొకకొడు కని
గాడిద యేడిచెఁ గదన్న ఘనసంపన్నా!

సమస్య:—దుగ్ధపయోధిమధ్యమున దుమ్ములు రేగ నదేమి చోద్యమో!

ఉ. స్నిగ్ధపువర్ణుఁ డీశ్వరుఁడు చిచ్చుఱకంటను బంచబాణునిం
దగ్ధము జేసె నంచు విని తామరసేక్షణు మ్రోల నున్న యా
ముగ్ధపు లచ్చి మోదుకొనఁగా మోహనగంధము పిండిపిండియై
దుగ్ధపయోధిమధ్యమున దుమ్ములు రేగ నదేమి చోద్యమో?

సమస్య:—దోగ్ధ్రీధేనువు గర్భమందు పులికందుల్పుట్టె నుగ్రాకృతిన్.

శా. దోగ్ధ్రీవాంతతపోదయా! గుణనిధీ? తేజస్వి! పాపాటవీ
దగ్ధాత్రిక్ష్మానలుఁ డైనకశ్యపున కుద్యద్గర్వుఁడై యాగభు
గ్గర్ధ్రిశుల్ సుతు లుద్భవించిరి బిడౌజావల్లి వీక్షించ తే
దోగ్ధ్రీధేనువు గర్భమందుఁ బులికందుల్ పుట్టె నుగ్రాకృతిన్.

సమస్య:—మతిలేని నరుండు మిగుల మన్నన నొందున్.

క. హిత మాచరించువారికి
హిత మొనరించుచును సుజనహితుఁ డగుచును దు

మర్త్యులెవ్వరుఁ జేయరు స
త్కృతి చేసి వరుండు మిగుల మన్నన నొందున్.

సమస్య:—అస్ఖలిత బ్రహ్మచారి కార్గురుపుత్రుల్.

క. ఈస్ఖా ప్రాసము దుష్కర
మస్ఖలనతఁ నీయఁదగునె యది సుకవులకున్?
సస్ఖలితలయి కుహూం గని
రస్ఖలిత బ్రహ్మచారి కార్గురుపుత్రుల్.

ఈరీతి సమస్యల నిచ్చియిచ్చి తుదకేమియుఁ దోఁపక— ఇఱుకరాదు; కొఱుకరాదు; నఱుకరాదు; పెఱుకరాదు; అను నాల్గుపదములతోఁ బద్యముఁ జెప్పుమని కోరఁగా కవి.

గీ. ఇఱుకరాదు చేత నిసుమంత నిప్పైనఁ
గొఱుకరాదు యినుము కొంచెమైన
నఱుకరాదు నీరు నడిమికి రెండుగాఁ
బెఱుకరాదు బావి పెల్లగిలఁగ.

అని పూరించెను. సమస్యలు పూర్తియైన పిమ్మట— “షా” యను నక్షరముతోఁ బ్రారంభించి, “షా” యను నక్షరముతో ముగించుచు నొక కొన్ని కందపద్యములు శ్రీరామస్తవముగా రచింపుఁడని రాజు గోర తత్క్షణమే వేంకనకవి యారీతి నొక శతకమే రచించెనఁట. కాని ప్రస్తుత మొక నాలుగుమాత్రమే ప్రచురింప నోచితిమి.

## షాదిక్షాంతకందములు

క. షాత్కృతిపాదగఁ జెప్పెద
నీక్షణమునఁ గందపద్యనివహము వరుసన్
వీక్షింపరె దయతో నిటు
రాక్షసహర! రామ! మోక్షరామాధ్యక్షా.

క. షడ్రాజిన్యాంబరయుత
రాద్రితవర్గస్తుతామరస్వరసీజా
క్షేద్రుద్యాగారపరి
ద్రాఢీవర! రామ! మోక్షరామాధ్యక్షా.

క. షణ్మిత్రఘనాంభస్సంభవ
రాజ్మౌనిశనూత్నరత్నరాజన్మకుటో
ద్యన్మండితాంతరిక్ష వి
రాణ్మూర్తీ! రామ! మోక్షరామాధ్యక్షా.

క. షట్పదలసితోద్యస్మిన్
త్రిట్పదలాంగప్రకాశధీరాజితగ్రా
జట్పదజటిపటనానా
రాట్పూజిత! రామ! మోక్షరామాధ్యక్షా.

రాజు వెంకనకవికిఁ గల పాండిత్యమును, ఆశుధారా పాటవమును, సమయస్ఫూర్తి చాతుర్యమును గ్రహించి నూట పదార్లు బహుమాన మొసంగి, విలువగల వలువలు కట్టఁ బెట్టెను. ఆసభలోనున్న పండితు లందఱును వేంకనకవి 'కభిన వాంధ్రకవితాపితామహ' యను బిరుద మొసంగి పద్యంబుల

స్తోత్రములు చేసిరి. అప్పుడు వేంకన తనయొద్దనున్న నూటపది యాఱు రూప్యముల నాసభలోని పండితుల కొసఁగి పిమ్మట తన కొసంగిన జరీపుట్టములను పేలికలుగాఁ జించి యొక్కొక్క పండితున కొక్కొక పేలిక నిచ్చెను. అప్పు డందఱును నివ్వెర పడి చూచుచుండిరి. మంత్రిగా "రయ్యా! ఇదేమి యన్యాయము? అంత విలువగల పుట్టములను గోచులుగాఁ జించినా" రని యడుగఁగా నాకవిచంద్రుఁడు కోపోద్దీపితుఁడై—

క. మానవనాయుని త్యాగము
గోచులకే కాక కట్టుకోకలకౌనా?
కేవర్లగోత్రముందున
నీనుం డుదయించి కులము నీఱుగఁ జేసెన్.

అను పద్యముం జెప్పెనఁట! అప్పుడు రాజుగారు, "కవీంద్రా! తమ రింత రౌద్రమూర్తు లగుటకుఁ గారణమేమిం సెలవిం" డని కోరఁగా మఱింత కోపము రేగి

ఉ. తిట్టుదునా భుజంగవిషదిగ్ధదవానల ఫాగధైగచి
ట్టిట్టిచిటార్భటీప్రకటశిఖిమహోగ్రతదుష్టశిక్షణో
ఘట్టనవిస్ఫులింగలయకారణదారుణలబ్ధలుబ్ధరా
ట్పట్టణగోపురధ్వజనిపాతమహాతాహుతి గాఁగ నుద్ధతిన్.

అని పద్యముం జెప్పెనట! తరువాత పండితు లందఱి ప్రార్థనలపై వెంకన శాంతిం జెంది తనకోపకారణమును వచించె

నఁట. తత్‌క్షణమే యాచమనాయఁడు తనయపరాధమును క్షమింపుఁడని ప్రార్థించుచు మఱల నాకవికిని ఆ వ్యాకరణపండితునకును దగిన బహుమాన మొనరించి కృతార్థుఁడయ్యెనఁట.

పిమ్మట నొకనాఁడీ వేంకనకవి వినుకొండపురమున కేఁగి శ్రీరాజామలరాజు వేంకటనరసింహారాయప్రభువుం దర్శింపఁగా నాప్రభువు—ఇతఁడేనా వెంకన?—అనె నఁట! అపుడుకవి—అయ్యా వెంకన యితఁడే కాని

మ. ఇతఁడేనా? వినుకొండనామకమనోభీష్టార్థకృత్కృట్టఁ
స్థితసామ్రాజ్యరమాదయామృతరసస్ఫురీచంచత్కటాక్షేక్షణా
ప్లుతసర్వాంగసమస్తశోభనకళాపుంఖీభవత్ స్తుత్యసం
గతమలాంగజవరాన్వయప్రభవవేంకట్నరసధాత్రీశ్వరుం;
డితఁడేనా?—ఇతఁడేనా?—

అనెనట! ప్రభువుగారు వేంకనకవీంద్రుని యసాధారణాశుధారాపాండిత్యములకును ధైర్యమునకును సంతోషించి బహూకరించి పంపిరఁట.

## బుచ్చయ్యశాస్త్రి

పంచచామరము. అమీరునంతవానికైన నర్థిజంకఁబోవునా?
షమాముబెట్టుకైనఁగుండటంకి హెచ్చిమోగునా?
కమానుఁబట్టలేనిగ్రద్దకయ్యమెర్గఁబోవునా?
షమానవాచలేంద్ర! తాడిగొట్లచెన్నకేశవా?

శ్రీరస్తు

# చాటుపద్యరత్నాకరము

## ద్వితీయతరంగము

### రాయనభాస్కరుఁడు

ఈరాయనభాస్కరుఁడు మహాదాత. రాయనభాస్కరులనేకులు కలరు. ఈభాస్కరుఁడు ముప్పదియిద్దఱు మంత్రులలోనివాఁడు. ఈమహాదాతనుగూర్చి యనేకచాటుపద్యములు రచింపఁబడియున్నవి.

ఉ. సన్నుతలీలఁ బాడ నలసంతతిఁ గర్ణుఁడు దాత గాక వా
రన్నలఁ దమ్ములందు నొక రైన వదాన్యులు గారు; కీర్తిసం
పన్నుని రాయనిప్రభుని భాస్కరుసంతతి నెంచి చూడ వా
రన్నలు దమ్ము లింటఁ గలయందఱు దాతలు భూతలంబునన్.

సీ. నిత్యసత్యత్యాగనీతిలోఁ శిబిఁ జెప్పి
మిముఁ జెప్పి మఱియును మిమ్ముఁ జెప్పి
బహుపరాక్రమమునఁ బరశురామునిఁ జెప్పి
మిముఁ జెప్పి మఱియును మిమ్ముఁ జెప్పి
రఘుకులోత్తముఁ డైన రామచంద్రునిఁ జెప్పి
మిముఁ జెప్పి మఱియును మిమ్ముఁ జెప్పి
సుకుమారతను సరి సురరాజసుతుఁ జెప్పి
మిముఁ జెప్పి మఱియును మిమ్ముఁ జెప్పి

చెప్పఁ బగుగాక యితరులఁ జెప్పఁదగునె?
కలియుగంబున నీవంటిఘనుఁడు కలఁడె?
అమితగుణసాంద్ర? మానినీకుసుమచంద్ర!
భాగ్యదేవేంద్ర! రాయనిభాస్కరేంద్ర!

సీ. ఏవేళఁ జూచిన నిందిరానందమై
యందమై చెలఁగు నీమందిరంబు
ఏజాము చూచిన నిష్టాన్నభోజనా
నందమై చెలఁగు నీమందిరంబు
ఏపొలఁ జూచిన గోపాలసత్కథా
లిందమై చెలఁగు నీమందిరంబు
ఏప్రక్కఁ జూచిన సుప్రజానాయకా
లిందమై చెలఁగు నీమందిరంబు
గాక తక్కినమంత్రివర్గములయిండ్లు
మేకమెడచండ్లు గిజిగాండ్లమెఱుఁగుగూండ్లు
పూవుఁబోఁడులు నిర్మించుబొమ్మరిండ్లు
భవ్యవిభవేంద్ర! రాయనిభాస్కరేంద్ర!

సీ. బట్టు దీవించుచు బాసికమ్మును జూప
వెలయఁ బెండిలి చేసి వేడ్కఁ బంపెఁ
బొప్పకట్టులమీఁద సోలి యుండఁగఁ జూచి
పట్టెమంచెము పాన్పు బట్టు కిచ్చె
వలెత్రాడుఁ జూపినఁ జెలఁగి యెద్దు నొసంగెఁ
బలుపుఁ జూచినఁ బాడిపశువు నిచ్చె
గళ్లెంబుఁ జూపిన ఘనతగుఱ్ఱము నిచ్చెఁ
జుట్టఁ జూపిన దాసి సుదతి నిచ్చె

స్నాన మాడంగఁ గడియంబు జారఁ గడమ
కడియమును వేయ శాంభవి కరముఁ జాఁచె
వెలయ రాయల సంగ్రహమ్ము వేసి చూపె
సర్వమాన్యంబు వినుకొండశాసనంబు
భవ్యభరతుండు రాయనభాస్కరుండు.

సీ. శ్రీగిరిప్రాగ్దిశశ్రీల కానాలపై
విలసిల్లువిరిపంట విన్నకొండ
విబుధాధిరాణ్మౌళివిశ్వంభరవ్రజ
విజయఘాటికి జెండ విన్నకొండ
వేదవేదాంతాదివిద్యావిచక్షణ
విద్వజ్జనులకండ విన్నకొండ
రాయనభాస్కర ప్రాంచత్ప్రధానుండు
విత్తము లిడుకొండ విన్నకొండ
కొండవీడాది పెనుగొండ గోలకొండ
కొండపలిసీమ మేలైనకొండవీను
దుర్గముల కెల్ల బలుదొడ్డదొడ్డకొండ
భాస్కరునికొండ వినుకొండఁ బ్రబలుచుండ.

క. ఏకొండయును వినుకొండకు
రాఁగోరదు సాటి పోటి రా నేరదుగా
చేకొని రాయనిభాస్కరు
డేకొన్న తవృద్ధి మీఱ నేలుట చేతన్.

క. ఆవినుకొండకు చెందిన
దేవేంద్రుఁడు భాస్కరుండు దీపించె ధాత్రిన్
ఏవేళ నర్థికోటికిఁ
గావించుచుఁ గనకవృష్టి కడుఁ జోద్యముగన్.

సీ. దాతతో నర్థులతారతమ్యముఁ జెప్పి
యిప్పింప నేర్చుఁ దా నీయ నేర్చు
నవరసాలంకారనయకవిత్వప్రౌఢిఁ
దెలియ నేర్చును మాధుఁ దెలుప నేర్చు
భట్టసంఘట్టఘుట్టవాగ్దిటలసై
చదువఁగా విన నేర్చుఁ జదువ నేర్చు
మానవాధిపులైన మానవాధీశుల
మెప్పింప నేర్చుఁ దా మెచ్చ నేర్చు
దాత కవి భట్టు మంత్రియుఁ దానె యగుచు
నంతు కెక్కెను ధారుణీమండలమున
సరసహృదయుండు వినుకొండశాసనుండు
భానుతేజుండు రాయనభాస్కరుండు.

సీ. నీసేవదేవుండు నిజభక్తరక్షాప
రాయణుం డాదినారాయణుండు
నీతాత జగదేకదాత రాయనమంత్రి
భాస్కరాన్వయుఁడైన భాస్కరుండు
నీతండ్రి వితరణఖ్యాతినిఁ గలియుగ
కర్ణుండు రామలింగప్రధాని
నీతల్లి పతిహితనీతి నరుంధతీ
దేవితోఁ బ్రతివచ్చు తిరుమలాంబ
తనర వెలసితి వత్యంతవినయవిభవ
గురుతరైశ్వర్యమహనీయగుణగణాఢ్య
సరసహృదయుండ! వినుకొండశాసనుండ;
భవ్యభరతుండ! రాయనభాస్కరుండ!

క. వగ గన్న యర్థికీయని
మొగముండల కేల మొలిచె మాతిని మీసల్
తెగఁగొరుగఁ డాయె మంగలి
రగ డొందఁగఁ గీర్తికాంత రాయనిబాచా!

క. మీఁగాలుబంటినీటికి
నీగుదు "తమక్క" యనుచు నిలలో వనితల్
నేగమె దాటెఁ బయోధుల
జాగ భవత్కీర్తికాంత రాయనిబాచా!

సీ. వంగత్కృపాదృష్టి గంగాభవానికి
మణికంకణంబు లేమంత్రియొసఁగె
క్షేత్రార్థమీయఁగా నక్షయంబగునట్లు
మార్తాండుఁ డర్థ మేమంత్రి కొసఁగె
వగ వేఁడినంతలో జగతిపై నర్థికి
మానంబు ప్రాణ మేమంత్రి యొసఁగెఁ
మీసంబు తాకట్టు వేసి పదార్థంబు
మహిమచే నర్థి కేమంత్రి యొసఁగె
అతఁడు నందవరీకవరాన్వయుండు
మఘుటుండు వసిష్ఠగోత్రోద్భవుండు
శత్రుమథనుండు వినుకొండశాసనుండు
భవ్యభరతుండు రాయనిభాస్కరుండు.

## రామలింగభాస్కరుఁడు

రామలింగభాస్కరుఁడు రాయనిభాస్కరునకు మనుమఁడు. ఈవిషయము ఈక్రిందిపద్యమువలనఁ దేలుచున్నది.

సీ. దాతతో నర్థులతారతమ్యముఁ దెల్పి
యిప్పింప నేర్చుఁ దా నీయ నేర్చు
నవరసాలంకారనయకవిత్వప్రౌఢిఁ
దెలియ నేర్చును మాఘుఁ దెలుప నేర్చు
భట్టసంఘట్టఘట్టితవాగ్ధాటలై
చదువఁగా విన నేర్చుఁ జదువ నేర్చు
మానుషాధిపులైన మానవాధీశుల
మెప్పింప నేర్చుఁ దా మెచ్చ నేర్చు
దాత కవి భట్టు మంత్రియుఁ దానె యగుచు
నంతు కెక్కెను ధారుణీమండలమున
సరసహృదయుండు వినుకొండశాసనుండు
భానుతేజుండు రాయన భాస్కరుండు.

సీ. నీదేవదేవుండు నిజభక్తరక్షాప
రాయణుం డాదినారాయణుండు
నీతాత జగదేకదాత రాయనమంత్రి
భాస్కరాన్వయుఁడైన భాస్కరుండు
నీతండ్రి వితరణఖ్యాతిని గలియుగ
కర్ణుండు రామలింగప్రధాని
నీతల్లి పతిహితనీతి నరుంధతీ
దేవితోఁ బ్రతివచ్చు తిరుమలాంబ
తనర వెలసితి వత్యంతవినయవిభవ
గురుతరైశ్వర్యమహనీయగుణగణాఢ్య
సరసహృదయుండ! వినుకొండశాసనుండ;
భవ్యభరతుండ! రాయనభాస్కరుండ!

క. వగ గన్గి యర్థికీయని
మొగముండల క్రేల మొత్తిచె నూతిని మీసల్
తెగగోరుగఁ డాయె మంగలి
రగ డొందగఁ గీర్తికాంత రాయనిబాచా!

క. మీఁగాలుబంటినీటికి
నీగుదు "రమక్క" యనుచు నిలలో వనితల్
నేగమె దాటెఁ బయోధుల
జాగ భవత్కీర్తికాంత రాయనిబాచా!

సీ. రంగత్కృపాదృష్టి గంగాభవానికి
మణికంకణంబు లేమంత్రియొసఁగె
భిక్షార్థి మాయఁగా నక్షయంబగునట్లు
మార్తాండుఁ డర్ఘ మేమంత్రి కొసఁగె
వగ వేఁడినంతలో జగతిపై నర్థికి
మానంబు ప్రాణ మేమంత్రి యొసఁగెఁ
మీసంబు తాకట్టు వేసి పదార్థంబు
మహిమచే నర్థి కేమంత్రి యొసఁగె
అతఁడు నందవరీకవరాన్వయుండు
దుర్ఘటుండు వసిష్ఠగోత్రోద్భవుండు
శత్రుమథనుండు వినుకొండశాసనుండు
భవ్యభరతుండు రాయనిభాస్కరుండు.

## రామలింగభాస్కరుఁడు

రామలింగభాస్కరుఁడు రాయనిభాస్కరునకు మనుమఁడు. ఈవిషయము ఈ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

రామలింగభాస్కరుఁడు పిన్నవయసున, విద్యాభ్యాసముఁ జేయుచుండఁగా, నొకబట్టు వచ్చి, రామలింగభాస్కరుఁడు విను నట్లుగా—

క. "రాయనిభాస్కరుతో నే
పోయెఁ జామీ కీరికాంత......

అనెనఁట! వెంటనే రామలింగభాస్కరుఁడు తనకరమున నున్న మణికంకణమును దీసిబట్టుకొసంగి—"పోదె"—అనెనట! అది విని యచ్చట మఱియొకఁడు "మఱేదీ"—అనెనఁట! అప్పుడాబట్టుకవి పద్యము నిట్లు పూర్తిచేసె నఁట.

ఆయనమనమఁడు చతురో
పాయుండగు రామలింగభాస్కరుఁ జేరఁగ.

సీ. ఏమంత్రిసత్కీర్తి హిమసేతుపర్యంత
మవనిమండలము ముత్యాలశాల
ఏమంత్రిమొగసాల యేప్రొద్దుచూచిన
సంగీతసాహిత్యసరసగోష్ఠి
ఏమంత్రియిలువేలు పిందురేఖావాళి
చాడేశ్వరీమహాశంభుశక్తి
ఏమంత్రిసౌందర్య మిందీవరాక్షుల
వాలారుఁజూపుల వలపుముద్దు
అతఁడు హరిదాసవంశాబ్ధి కబ్ధిభవుఁడు
అర్థిదారిద్ర్యగాఢతమోర్కుఁ డతఁడు
దానధర్మపరోపకారానుకూలి
[illegible]రామలింగన్న భాస్కరుండు.

సీ. ఏలినపతికార్య మీడేర్ప నేరని
పట్టుగుడుపుకుఁ బారుపత్తె మేల?
పరమర్మభేదనోపాయ మెఱుంగని
పందగోవుకుఁ బారుపత్తె మేల?
తను నమ్మియుండిన దాక్షిణ్య మెఱుఁగని
పాపాత్మునకుఁ బారుపత్తె మేల?
భటుల నిర్యాచకబంధుల కీయని
పరమలోభికిఁ బారుపత్తె మేల?
అట్టివానిఁ గృపాదృష్టి నరయఁ గానె
మిండఁడౌ నార! భువియందు దండిగాను
బాలికాజననుత పంచబాణరూప!
భాస్కరునిరామలింగన్న భాస్కరేంద్ర!

సీ. అతిథికోటికి నింట నమృతాన్నసత్రంబు
ఉంబటిసత్రంబు లర్థులకును
కర్మకాలములఁ బానాకాలసత్రంబులు
చల్లసత్రము ధాత్రి కెల్ల వేళ
నంత్యగృహమున రామానుజసత్రంబు
మానెసత్రము శిరస్నానములకుఁ
శౌరబాలురకు నేర్పన పాలసత్రంబు
కామసత్రము విటగ్రామణులకు
గట్టడులు చేసె వినుకొండపట్టణమున
దానసింహాసనాసీనుఁడై నిరూఢి
వర్థి దారిద్ర్యరూపగాఢాంధకార
భాస్కరుఁడు రామలింగయ్యభాస్కరుండు.

## కోటసింగరాజు

సీ. "పట్టిసపురవీరభద్రుని ప్రేమచేఁ
జెన్నొందె శ్రీకోటసింగరాజు..."

అని ముప్పదియిద్దఱుమంత్రులను దెల్పు సీసమాలి కలోఁ బేర్కొనఁబడిన సింగరా జీతఁడే. ఈతనిఁ గుఱించిన చాటువులు.

క. నరజన్మంబునఁ బుట్టినఁ
గరిణీకవె యుత్తమంబు కరణం బైనం
బురుషార్థపరుఁడు గావలె
శిర సెత్తిన ఫలము కోటసింగమవర్యా!

చ. గడుసరిలోభియర్థ మది కన్నపుదొంగలబందిపోట్లకుం
బుడమిని వారకాంతలకు భూపతికిం జను, కోటసింగ! నీ
పడసినయర్థ మార్తులకు బాంధవకోటికి యాచకాళికిన్
గుడులకు సత్రశాలలకుఁ గూపతటాకవన ప్రతిష్ఠకున్.

## సాహిణిమారుఁడు

సీ. "కానిరొ భాస్కరునిచే దెనుఁగురామాయణం
బారూఢి సాహిణి మారమంత్రి..."

అను ద్వాత్రింశన్మంత్రిసీసమాలికాచరణ మీతని నియోగిగా నియోగించినది; కాని యీతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు.

క. ఇంతులమనముల సరిసా
మంతులమనములను బుద్ధిమంతుల మదిలోఁ
జింతింపనిబ్రదు కేటికి?
సంతతసత్కీర్తిహార! సాహిణిమారా!

## కొట్టరువెజ్జుమంత్రి

ఈతనింగురించి మంత్రుల సీసమాలిక యిట్లు చెప్పుచున్నది

సీ. "తనగుఱిూసముదీసి తాకట్టుగానుంచి,
కొట్టరువెజ్జుం డర్థి కోర్కెఁదీర్చె..."

## ఈతనిగుఱించిన వేఱొక చాటువు

ఉ. వీనులు సంతసిల్లు నిను విన్నఁ గనుంగవ వాడిదేరు నీ
మానితమూర్తిఁ గన్న నిను మంత్రిశిఖామణి యన్న నాలుకం
దేనియ లొల్కు నీవొసఁగు దివ్యవిభూషణ చందనాదులన్
మేనును నాసికేంద్రియము మెచ్చును కొట్టరు వెజ్జధీనిధీ!

## పెమ్మసింగరాజు

ఈతడును ముప్పదియిద్దఱు మంత్రులలోనివాఁడే. ఇందు కీక్రింది సీసచరణమే సాక్ష్యము

సీ. "పగతుఁ జుట్టమటంచుఁ బల్కఁగాధనమిచ్చి
చేపట్టెఁ బెమ్మయసింగరాజు..."

ఈమంత్రినిగుఱించిన చాటుపద్యములునీతిబోధకములు. అవిశతకముగా రచియింపఁబడెనేమో కాని, కొన్ని మాత్రమే దొరకినవి.

ఉ. పెట్టకకీర్తిరాదు వలపింపక యింతికి నింపురాదు తాఁ
దిట్టకవాదు రాదిక నెదిర్చిన వైరుల సంగరమ్మునన్
గొట్టక పేరురాదు కొడుకొక్కఁడు లేక ఫలంబు లేదయా
పట్టపురాజుకైన నిది పద్ధతి పెమ్మయసింగధీమణీ!

ఉ. సత్యము లేనిచోటఁ దనుసమ్మతిఁ జెందనిచోట సాధుసాం
గత్యము లేనిచోట ధనకాంక్ష మునింగినచోట శత్రురా
హిత్యము లేనిచోట ఋణమీయనిచోటను గాపురంబుఁ ద
న్నిత్యముఁ జేయరాదు సుమి నిక్కము పెమ్మయసింగధీమణీ.

ఉ. బూరుగుమ్రానియున్నతియుఁ బూవులుఁ బిందెలుఁ జూచియాసతోఁ
గీరము లారునెల్లు తమకించుచునుండి ఫలాభిలాషితన్
జేరి రసంబుఁ గ్రోలుటకుఁ జించినదూదియు రేఁగునట్టు లా
కూరిమిలేని రాజులను గొల్చుట పెమ్మయసింగధీమణీ!

చ. మనవికి నొక్కఁ డేడు ననుమానపుమాటకు నాలు నెల్లు నే
డని పెదనన్న ఖాసమవు నన్పెదపొమ్మనఁ బక్షమాను తత్
క్షణమిదె యంపితెన్న మఱిసంతయు వచ్చును మోక్షమింక నా
మనవికి యెన్నఁడో? సుజనమాన్యుఁడ! పెమ్మయసింగధీమణీ.

ఉ. మాడలమీఁద నాసగలమానిసి కెక్కఁడికీర్తి? కీర్తిపై
వేడుకఁ గల్గునాతనికి విత్తముమీఁద మఱెక్కఁడాస? యీ
రేడుజగంబులందు వెలహెచ్చిన కీర్తి ధనంబుఁ గాంచి స
త్ప్రౌఢయశంబుఁ జేకొనియెఁ బమ్మయసింగఁడు దానకర్ణుఁడై.

ఉ. పద్దెము లోభికేల? మఱిపందికి జాఫరుగంధమేల? దు
క్కెద్దుకు పంచదారటుకు లేల? నపుంసకుఁడైనవానికిన్
ముద్దులగుమ్మ యేల? నెఱముక్కర యేల వితంతురాలికిన్
గద్దకు స్నానమేమిటికిఁ గావలెఁ బెమ్మయసింగధీమణీ!

## గోపయరామయ

ఇతఁడు ప్రథమశాఖా బ్రాహ్మణుఁడు. ఇంటిపేరు హానుమకొండవారు

సీ. వీఁడె గా శత్రుమంత్రి వీరధైర్యకఠోర
భూధరంబునకు దంభోళిహాం
వీఁడెగా సౌందర్యవిభ్రమావభ్రప
ర్యాపకమునయక్షరాజసుతుఁడు
వీఁడెగా కవిరాజవికటదారిద్ర్యాంధ
కారభారస్ఫుటకమలహితుఁడు
వీఁడెగా చతురబ్ధివేష్టితోర్వీచక్ర
యాచకావళికిఁ గర్ణాంశదాత
మంత్రిమార్తాండదుర్మంత్రిమదవిరోధి
అఘవిదూరుండు హానుమకొండాన్వయుండు
గణికనిర్వాహుఁ డగ్రశాఖాప్రభుండు
రమ్యగుణపాళి గోపయరామమౌళి

## గుంటుపల్లి సాంబనమంత్రి

మ. హరిపూజోత్క[illegible]ంటుపల్లిసచివేంద్రా! సాంబయామాత్య! నీ
స్థిరకీర్తిప్రతతిప్రతాపములతో దీటంచుఁ జంద్రార్కులన్
గరిమన్ పద్మభవుండు వ్రాసు నిడి వేగం బైపయి నొవ్వఁగన్
సరి రారంచును గుండలించెఁ బరివేషవ్యాజ రేఖాకృతిన్.

చ. అఱువదినాల్గువిద్య లరయంగను నాలుగసాధ్య మందులోఁ
దురఘనదానశీలతయుఁ దోరపుఁబాటకవిత్వశౌర్యముల్

తఱచుగ నుండ వేరికిని తప్పక నీయెడ నాల్గువిద్యలుం
బురిగొను గుంటుపల్లికులభూషణ! సాంబనమశ్శివాయా శేఖరా!

## పసుమర్తి హుళిక్కిమంత్రి

చ. ధరణిసదాన్యు నొక్కని విధాత సృజింపక పోయె నంచు ద
త్తరపడఁబోకుమోయికవి! దైవగతిన్ వినుకొండసీమలో
మురికిపుడీపురంబునఁ బ్రమోదమున న్వసియించు చీవులన్
మఱవదుపుణ్యమూర్తి పసుమర్తి హుళిక్కిని జూడుఁడయ్య మే
ల్తురఁగము లంబరావళులు తోడనె యిచ్చుఁ గవీంద్రకోటికిన్

ఉ. మారసమానమూర్తి పసుమర్తికులీనుఁ డుళిక్కి దాతయాఁ
జేరహుళిక్కి గాని పృథివీస్థలిఁ ద్యాగ హుళిక్కి గాదు త్వ
త్సారకవిత్వసంపద లోసంగక దూరము జారఁ జూచెఁ దౌ
రౌర! కవీ! యొసంగును వరాలు గుఱ్ఱాలు సరాలు నేలువల్.

## దమ్మవళం పుల్లప్రధాని.

ఈతఁడు మంచిదాత. నివాసస్థలము గుంటూరు మండలములోని కుంకెల్లకుంట (కుంకలగుంట)యనుగ్రామము. ఆగ్రామమున నీపురుషుఁడు ప్రతిష్ఠించినవనము లిప్పటికిని గలవు

మ. ఎలమి న్గర్ణుఁ డొసంగుదానములసాం పెల్లన్ బగల్ రెండుజా
ములపర్యంతమె కాని నీవలె సదామోదస్థితి న్గోర్కు ల
ర్థుల కేవేళల నీగఁ గల్గెనే భళా దుర్వారగర్వద్విషో
జ్జ్వలకాంతారకుఠార! దమ్మళిపుళుంభద్వంశపాథోధిస
ల్లలితాజ్ఞాహిత! సుప్రబోధ్యమతి! పుల్లప్రధానాగ్రణీ!

ఉ. భూరివదాన్యవమ్మళపుల్లపమంత్రిగుణాఢ్యవత్పదాం
భోరుహయుగ్మముం గడిగి పుణ్యజలంబులు లోభిమంత్రిపైఁ
జేరెఁడు నెత్తిఁ జల్లి యరచేరెఁడు లోపలికిచ్చినన్ మహో
దారమనస్కుఁడై యతఁడు ధారుణిఁ గీర్తి వహింపకుండునే?

ఈయమాత్యుఁడు మల్రాజువారితరఫున నేజంటుగా నుండెను. అప్పుడు తాను వసూలు చేయుచుండినశిస్తుపయికము నెప్పటి దప్పుడే బ్రాహ్మణ సంతర్పణలకును గవీశ్వరబహుమానములకును వెచ్చ పెట్టుచుండెను. ఒకసమయమునఁ బయికము నంతయును దివాణమునకుఁ బంపవలసిన దని జమీన్దారు లుత్తరువులుపంపిరి. ఏజంటుగారిచేతిలో నొకదమ్మిడియు లేదు. అప్పుడు పుల్లప్ప యేమియుఁ దోఁపక, పల్నాడుతాలూకాలోని గుత్తికొండయను గ్రామమునకు కాపురము లేచిపోయెను ఆకాలమున నాగుత్తికొండ రామరాజువారిపాలనము క్రింద నుండెను. అప్పుడు మల్రాజువారియాస్థానకవియు, ఆ కుంకలగుంటగ్రామనివాసియు నగు బట్టుకవి ప్రభువుగారితో నిట్లు మనవిచేసెనట !

ఉ. రాముఁడు లే నయోధ్యవలె రాజిలెఁ గుంకలగుంట పుల్లప
గ్రామణి గుత్తికొండనగరానకుఁ బిల్లలతోడఁ జేరఁగా
స్వామి పరాకు నామనవిఁ జక్కఁగ నీమదినుంచి యుంచితో
ద్దాముని దమ్మళాన్వయునిఁ దప్పక తోఁడుక రావె ధీమణీ!

అంతట సంస్థానాధీశులు పుల్లప్పను మరలఁ బిలిపించి, యథాప్రకారము తమయేజంటుగనే యుంచుకొనిరట.

## తమ్మడపు సెబాసుమంత్రి

ఉ. . . . . . . . . . . . . నం
దమ్ము నిజమ్ము తమ్ము కవనమ్ము కవీ! రచియించిచూడమీ
దమ్మడపాన్వయేందుని వదాన్యశిఖామణి మా సెబాసు మం
త్రి మ్మతిమంతునిం గనినదివ్యదుకూలముతోడ గంధపు
వ్వుమ్ములవారితమ్ముగఁ గృపామతి నిచ్చుఁ గవీంద్రకోటికిన్.

ఉ. నందవరీకబృందమున నాటికి రాయనిభాస్కరుండు సొం
పొందె వదాన్యుఁ డంచుఁ బొలుపొందెను; నేటికి దమ్మడంపువం
శేందుఁ డరే! సెబాసనఁ బ్రసిద్ధి వహించెనుగా! సెబాసుమం
త్రీంద్రుఁడు మంత్రికోటులు నుతింప వదాన్యు డనంగ ధారుణిన్.

ఉ. కాసులు కొన్ని కూర్చుకొని గర్వముతో నపకీర్తిఁ బొందువా
రేసభ సన్నుతిం బడసి రెక్కడి కెక్కిరి దమ్మడంపుసే
బ్బా సనిపించుకొన్న సచివప్రభు వీవె కదా? నియోగిలో
కాసమకీర్తిచే రవికులాంబుధిసోముఁడు రాముఁడుం బలెన్.

శా. ఏబోధల్ విని తల్లిదండ్రు లుగభూమీశాంఘ్రిపద్మంబులం
దేబిల్వావళు లుంచిరో? కవులు నేతీర్థావగాహోత్తులుం
గాఁ బొల్పారి హరి న్నపత్య లోకదీక్షాసక్తిఁ గావించిరో?
శాబాసయ్య జనించె దమ్మడపువంశంబందుఁ బుణ్యాత్ముఁడై.

ఉ. మందమతిం గవుల్ ఖలుల మందుల గర్వుల దుష్టలోభిరా
డ్బృందము నెంచబోవుట వివేకులు గారొకవేళఁ గాంచిన
న్నందవరీకులందు సుగుణాఢ్యుఁ డుదారుఁడు మా సెబాసుమం
త్రీందుని గాంచినంతనె దరిద్రమతిభ్రమ లూడకుండు నే?

ఉ. భాసురకీర్తిశాలి హరిభక్తవిభామతి దమ్మడంపుసే
బాసనమంత్రికీర్తి రుచి భాసిలె దిగ్వనితాశిరోగ్రజా

తీసుమదామమై పటులదివ్యదుకూలము నై యురోజపా
ళీసితతారహారమయి లీలల క్ష్యాస్పదమై విచిత్రమై.

ఉ. వేసట లేక యాపరకవేషము బొజ్జలు పోగులుంగరాల్
మీసము లుండఁ జూచి చెయి మేలని యెత్తితి దమ్మడంపు శా
బాసనమంత్రిఁ జూచితిని పార్థివకోటులఁ జూడఁబోను గా
వాసవశాఖి చేతఁగలవారల కేల విచారసంగతుల్ ?

చ. నలువ సృజించె నౌర మననందవరీకుఁడు దమ్మడంపుస
త్కులుఁడు "సెబాస్సెబా" సనిబుధుల్ నుతియింపగఁ బేరుఁగాంచెనోఁ
గలియుగమందు నాథునునికన్నను మిన్నదాన్యుఁ డొక్కఁడే
తెలియఁగ భాస్కరుం డని తదీయకులోద్భవు లెంతు రెయ్యెడన్.

## పీసపాటి శేషాచల మంత్రి

ఉ. యాచకులన్ సృజించితి సురాగము లెల్ల సురేంద్రునింటిలోఁ
దోఁచక యుంచి తంచు విధి త్రొక్కటముం బడి పీసపాటి శే
షాచలమంత్రిచంద్రుని మహాత్ముని తాను సృజించినాఁడహో
యాచకులార! రండి పరమార్థము లెల్లఁ గొనుండి! దండిగన్.

క. అల శేషాచలపతిఁ గన
గలఁ దందురుము క్తి కనులఁ గన్నది లేదే
యిలఁ బీసపాటి శేషా
చలపతిఁ గనుఁగొన్నభుక్తి చక్కఁగఁ గలుగున్.

ఉ. తంద్ర యొకింత లేక లపితామహు నేమిటఁ బూజఁజేసిరో?
చంద్రునితల్లియుం గుసుమసాయకశూరుని తల్లియున్ హరి
శ్చంద్రునితల్లియు న్విశదసాత్వలోచనుతల్లి యున్ దయా
సాంద్రునిఁ బీసపాటికులచంద్రుని శేషునిఁగన్నతల్లియున్.

ఉ. ఖేచరభూధరంబు పరుగెత్తినభానుఁడు పశ్చిమంబునన్
దోఁచిన వీతిహోత్రుఁడు జడోజ్జ్వలుఁడైన గిరిన్సరోజముల్
సూచిత మైనఁ బుణ్యగుణశోభితుఁడై తగుపీసపాటి శే
షాచలమంత్రిపుంగవుఁ డసత్య మొకింత వచింపఁ బూనునే?

గీ. మిమ్ముఁగనుఁగొని "కల్పద్రుమమ్ము సుమ్ము
సఫల"మనుకొని కనుఁగవ సంతసించె
పీసపాటికులాంభోజ! ధీసమాజ!
దానసురభూజ! శేషప్రధానిభోజ!

చ. ఇలు నిలువెంబడిం దిరిపె మెత్తెదుశంభుని నమ్మలేదు; కోఁ
తుల నొనఁగూర్చి రావణుని దున్మినరాముని నమ్మలేద; యా
కలిఁ గొనువేళవారెవరుఁ గన్నులఁ జూడరు పీసపాటిస
త్కులుఁ డగు శేషమంత్రిఁ గనుఁగొన్నను నాఁకలిఁ దీర్చునర్థికిన్

ఉ. పూచినయట్టికొమ్మ లివి పో! కరము ల్నఖపఙ్క్తి గాదు శో
భాచయపల్లవంబు లివి భవ్యపదంబులు గావు చక్కఁగా
యాచకకోటి బాంధవజనావళిఁ బ్రోవఁగఁ బీసపాటి శే
షాచలవల్లభాకృతిసురాగము సంభవమయ్యె ధారుణిన్.

ఉ. వందురుఁ డుద్భవించె సరసంబుల బ్రోవఁగ నెన్న భానుఁడిం
పొందుచు నుద్భవించె బిసపుంజము ఉల్లము ఉల్లసిల్ల గో
విందుఁడు సంభవించెఁ బృథివీస్థలిఁ బ్రోవఁగఁ బీసపాటివం
శేందుఁడు శేషశైల ముదయించెర! యర్థులఁ బ్రోవ నేటికిన్?

## గుమ్మడివెల్లి కృష్ణయ్య

సీ. కాలకంధరఘోరకంధరారభటికి
భీతుఁడై చెలంబు విడువఁ డేని

పవికరాభీలసంభగ్నాంతరంగుఁడై
మున్నీటిలోపల మునుఁగఁడేని
కలశోద్భవునిచేత గాసిఁ జెందక సదా
స్పర్శార్హవృత్తిఁ దాఁజలిపె నేని
అమరావళికి నెల్లనమృత మిచ్చెదుంతటి
సెమ్మోము నీలిమఁ గ్రమ్మదేని
యాకృతిని ధీరత గభీరిమను వితరణ
మున సుమాస్త్రి మైనాకసముద్రవిధుల
నగును గుమ్మడివెల్లి వంశాగ్రగణ్యుఁ
గృష్ణయవదాన్యుఁ బోల్ప నీపృథ్వియందు.

కోఠి సుబ్బారాయఁడు

శా. ప్రత్యబ్దత్వదుదాత్తదానధరణీద్రవ్యాగ్రహారాఢ్యసా
హిత్యేచ్ఛద్విజపంక్తి దీవన లిడుఁ "హేభూపవర్యాగ్రణి
ప్రత్యగ్రప్రభుతా జయోఽస్తు భవతః ప్రాయో" యటంచుఁ బలా
ధత్యప్రాభవకోఠిసంతతిపవిత్రా! సుబ్బరాయాధిపా!

వరదామాత్యుఁడు

మ. శరదంభోధరకాలకంధరహరిస్వర్గోహిమాద్రిస్వరా
ధరిహంసామరవాహినీబలసమీరాహారజైవాతృకుల్
కరుణాంభోనిధి మంత్రిపుంగవుఁడు సత్కల్పావనీజాతమా
వరదామాత్యునికీర్తితోడ సరి జెప్పం బోల దెబ్బంగులఁ.

గోపరాజు రామప్రధానుఁడు.

ఈరామప్రధానుఁ డొకరాజ సంస్థానమున మంత్రిగా నుండెను. ఆకాలమునఁ గరణీకవృత్తికమసాలులపై యుండగా

నీతఁడు నియోగిబ్రాహ్మణుల కిప్పించెను. ఒకతఱి నీతఁడు కృష్ణవేణీ నదీతీరమున భూదానము పరిగ్రహించి సశాఖీయుల భరించె నఁట. అందుల "కెప్పుడు నబద్ధపువ్రాఁతలు తగాదా వ్రాఁతలు వ్రాసికొని జీవించుచుండు నీ నియోగులు దానపాత్రులా?" అని వైదికు లెవరో యాక్షేపింపఁగా నియోగు లెవరో చెప్పిన సమాధాన పద్యములు.

ఉ. వ్రాయుట చిత్రమా? వికృతవైదికమా? నిజదాతరక్షణో
పాయముకై నియోగి యిలఁ బార్థివసేవ యొనర్చినంతనే
పాయునె! వంశశీలములు వ్రాయక యెప్పుడు చిత్రగుప్తులున్
వ్రాయరె? యెల్లలోకములవారలు చేసినపుణ్యపాపముల్.

ఉ. మానఘనుండు బ్రహ్మకులమండనమూర్తి పరోపకారి దు
ర్దానదురన్నము ల్గొనఁడు తప్పఁడు స్వామిహితోపకారముల్
దీనులఁ బ్రోచు బాంధవవిధేయుఁడు దప్పియు వేఁడఁబోఁడు తా
నూనినవేడ్కతోడుత నియోగికి నిచ్చినదాన మల్పమే?

## కవులు దానపాత్రులు గారని యాక్షేపించుచుఁ జెప్పినపద్యము

చ. అవగతశబ్దశాస్త్రచయు లైనమహాత్ములు పండితోత్తముల్
భువనతలంబునం దధికపూజ్యులు వార లటుండఁ గూటికై
నవనవకల్పనావిధిచణత్వము తోఁప నబద్ధమాడు నీ
కవు లిల దానపాత్రు లయి గౌరవ మందుట చూవె చిత్రముల్.

## పైయాక్షేపణకు సమాధానము.

చ. కవి కమలాసనుండు త్రిజగత్పతి యైనపినాకపాణియుం
కవియె తలంపఁగాఁ గవులు గారె పరాశరబాదరాయణుల్

కవికృతపుస్తకగ్రహణగర్వితు లల్పులె పూజ లందఁగాఁ
గవు లఁట! దానపాత్రులును కారఁట! యిట్టివి పో విచిత్రముల్.

ఉ. గురుకులవాసఖేదమునకుం గడు డస్సి యపారశాస్త్రసా
గరముల నీఁదియు న్వలఁతి గాఁ దలఁపింపఁగఁ బండితుండు తా
వరకవు లుద్యదిందుకర వారసమాగమఫుల్లహల్లకో
త్కరవిగళన్మరందపదకాండముచే నలరించుచాడ్పునన్.

గీ. ఎంచి యెంచి చూడ నింపయి తోఁచునీ
మూఁడులోకములను ముగ్ధలైన
మించుబోండ్లచూపు లించురసంబులు
చతురులైనకవులసరసమతులు.

చ. పలుమరు శాస్త్రముల్ చదివి పండితుఁడై యజూరాక్షిసత్కృపా
ఫలమును గాంచి తా రసము బాగుగఁ జెప్ప వలంతి యైనవాఁ
డిలఁగవి; లాతివాఁడు కపియే యని చెప్పఁగ నొప్పు; జాయ నాఁ
కులజయ జాయ గాని పెఱకోమలి మాయయ కాక జాయయే?

శ్రీరస్తు

# చాటుపద్యరత్నాకరము

## తృతీయతరంగము

### కృష్ణదేవరాయలు.

ఈప్రభువు పదియాఱవ శతాబ్దిలో నున్నవాఁడు. పండితకవులనాదరించి యాంధ్రభాషనుమరలవృద్ధికిఁదెచ్చినవాఁడగుటయేగాక తాను గొప్పకవియై విష్ణుచిత్తీయమనుమహాకావ్యము రచించి సుస్థిరయశంబు నందినవాఁడు. ఈమహాపురుషుని జననమునుగూర్చిన చాటువు

ఉ. అందలిశాలివాహనశకాబ్దము లబ్ధివసుత్రిసోములన్
వందితమైనయవ్వికృతివత్సరమందలిపుష్యమాసమం
దుందగఁ గృష్ణపక్షమున మండెడుద్వాదశిశుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్.

ఈరాజకవిని వేఱొకకవి యాశీర్వదించిన యాశీర్వాదము

గీ. పద్మనాభ్యుష్ణలంబునఁ బక్కిలోనఁ
బైరుపైఁ బవ్వళించినపరమమూర్తి
యనుదినంబును కృష్ణరాయాధిపునకుఁ
జుక్కజగడాల వేలుపు శుభములొసఁగు.

## కోటి తిరుమలరాయలు

ఇతఁడు పుదుకోట ప్రభువు. తిరుమలరాయలపుత్త్రుఁడు. కోటివంశస్థులకు "తొండమాన్" అనునది బిరుదు.

చ. స్థిరజయసాంద్ర! కోటికులతిర్మలరాయధరాధరేంద్ర! నీ
కరకరవాలశాతలను గాంచిన వైరికిఁబోటు దాన నం
బరమణి మేనఁదూటు బలవైరికిఁ దత్తరపాటు రంభవా
తెరపయిఁగాటు సౌరసుదతీమణి కబ్బురపాటు చిత్రమే ?

చ. అరుదుగదా తలంపఁగఁ గవులార! ధరాధిపులార! వింటిరా?
శరనిధి మేరఁదప్పినఁ బ్రచండ కృశానుఁడు చల్లనైన దు
ర్భరకులిశంబు వాడరిన రాముని బాణము సూటి తప్పినన్
దరణిసుధాకరుల్ గతులు దప్పినఁ గోటికులాబ్ధిచంద్రుఁడీ
తిరుమాలతొండమానుఁడు మదిన్మఱియాడినమాటఁ దప్పునే!

చ. జరజరవచ్చు బాణముల జల్లకు గొంకక రింగురింగునన్
మెఱయు తుపాకిగుండ్లకును బ్రెగ్గక ఖల్లను కత్తిపెట్లకున్
వెఱవక నాజిలో రిపుల వేమరు గెల్తువు రాయ తొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప! దలీపవిక్రమా!

చ. నఱకుదు వౌర వైరినరనాథుల గొగ్గిజిరాలు ఝింగిణీ
తరకసజీనిఘోడలవదండధణాలు ఘుణీలు ఘుల్లనన్
దురమునఁ బెద్దకత్తిఁగొని దోర్బలశక్తిని రాయతొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప! దలీపవిక్రమా ?

ఉ. ఇట్టటుఁ గోటితిర్మలమహీపతియూరక కానివానిఁ జే
పట్టఁడు పట్టఁ డట్లనక పట్టినచోఁ దనయంతవానిగా

గట్టిగఁ జేయుఁగా కపదుగాదు నిజంబుగ నింకఁ జూడుఁడీ
పట్టపురాజులార! భట వంది పురోహితులార! వింటిరా?

సీ. చూచితి నేపాళ చోళ కేరళ పాండ్య
ధరణీధవుల సభాస్థలుల నెల్లఁ
గనుగొంటి సంగ వంగ కళింగ కాశ్మీర
వసుధాధి పతుల ప్రాభవము లెల్ల
దరిశించితి మరాటక లాట కర్ణాట
జగతీశ్వరుల విలాసంబు లెల్లఁ
గాంచితిఁ గుకురు కొంకణ తెంకణ విదర్భ
ధరణీశ్వరుల శౌర్య ధైర్య పటిమ
లిట్టిసొగ సిట్టి విధవంబు లిట్టి మహిమ
లిట్టియౌ దార్య గరిమల నెందుఁ గాన
రాయతిరుమలతోండమాంబ ప్రభుతనూజ!
రమ్యగుణసాంద్ర! తిరుమలరాయచంద్ర!

కళిక. మఱియును దుర్జనభర్జనతర్జన, పరిచయ కరజయ శరజాలునకై
నరపతి లక్షణరక్షణ .................నిజశీలునకై
హరిదతిహాటక శాటకఝూటక, రరుచిరసురచిరగ తేజునకై
పరిసర భాసురభూసుర వాసర ..............
అధికృతగర్వితసుర్వితరోర్విత, లాధిపసాదిపదాతివితతికై
మధురిమపూరితసారితగీరిత, మంగళ ... ... ...
కవిజనదాననిదాననిదానన, కరకృతకరకృతవరరేజునికై
అవితతభావణపావణభావణ, సువదనభువదన ... ...
నవలాల్యానగల నాట్యపుతళికై, హావణిలువరుజుల నలరెడు పలుకై
గువలును బూసుకదుముకుచువడికై

శా. స్ఫాయద్దంతి ఘటాఘటోష్ఠవమదాసారప్రవాహినీ
... ... ...ధరారుహానరస్తోమా వసంతభ్రమ
ద్గాయద్భృంగసమూహనిష్కుటములౌ దారిన్ సుధీగేహముల్
... ... ...ధీరువలనన్ రంజిల్లునెల్లప్పుడున్

కళిక. మఱియు విబుధుల కలన,గరిమను ప్రభువలన
... ... ... ...ననివిభువలన
రణధరాదికచలన, రహితశౌర్యనివలన
గుణధరాధికమిళన,కుతుకధుర్యనివలన

మ. ... ... ...
... ... ... నీ
కరణం బల్కురి తద్గుణైక్య మాని తర్కజ్ఞాళి నవ్వంబడున్
హరతుల్యప్రతిపాద్యచేత ... ... ...

కళిక. మరియును గవులను మనుచును విభుచే
నరులను కవులను ననుచును ప్రభుచే
కలనైనను బొంకని ధీరు ... ...
... ... ... ...
గంట్లిడఁగాచిన కైగలదొరచే
గంట్లిడఁగాచిన కైన్యవరుచే
కోటికులావనగుణవాక్పతిచే
కోటి.........నిజముగఁ గొలిచె
ప్రజతగఁబొలిచెన్ దినుసునమనిచెన్
మనిమదినునిచెన్ వెనరునదనుచెన్

## విజయరఘునాధరాయలు

ఈతఁడు పుదుకోట ప్రభువగు,తిరుమలరాయలపుత్రుఁడు. ఈయనపై శేషయ్యయనుకవి వ్రాసిన చాటువులు,

సీ. శ్రీహరికరుణావిశేషవైఖరులచే
సామ్రాజ్యమేలుము జయము నీకుఁ
జంద్రజూటునిదయాసాంద్రవైభవముచే
సంపదల్ గాంచుము జయము నీకు
వారిజోద్భవుకృపాపారసత్త్వముచే
శౌర్యంబుఁ బూనుము జయము నీకు
మలయకేతనపాండ్యమధురేశువరముచే
సత్కీర్తిఁ జెందుము జయము నీకు
ననుచుఁ గవిబుధపాఠకుల్ వినుతి సేయ
విక్రమస్ఫూర్తికీర్తుల వెలసితౌర!
భళిర! తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథతొండమాన్ విభువజీర.

సీ. పైఠాణిపాగపై పైఁడిరేకుతురాయి
చొక్కమై మిక్కిలి సొంపునింప
హురుమంజిముత్యంపుటొంట్లతో మగరాల
బావిలీలహారంగుపంతగింపఁ
బూర్ణచంద్రునిరీతిఁబోలుపొందుమోముపై
సిస్తుకస్తురిచుక్క జిగివహింప
మైనిధరించినమణిభూషణావళుల్
కొమరొప్పుకాంతులఁ గ్రుమ్మరింప
నీవుపట్టా షిక్తుఁడై నిఖిలజనులుఁ
గొలువ మాణిక్యపీఠిపైఁ జెలగితౌర
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథతొండమాన్ విభువజీర!

సీ. ధారణీతలమెల్లఁ బసుదానె యుప్పొంగెఁ
బలు ఘోర జారబాధలు తొలంగెఁ
జేరికొల్చినవారి కోరికల్ ఫలియించె
విమతులకెల్లను వెతజనించె
బంధుసంతతికి సౌభాగ్యంబుఁ దనరారెఁ
గవుల దారిద్ర్యము ల్కడలిమారె
సకలసజ్జనులకు సంతోషములు మీరె
గాయకకోటికిఁ గలవుతీరె
నీవు పట్టాభిషిక్తుఁడై నిఖిలమైన
ధరణిజనులను రక్షింపదలచినపుడె
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. సకలసద్గుణముల జానకీపతి జోడు
మఱి నీకు "నారణప్పరశ" బిరుద
గాంభీర్యగరిమచేఁ గలశాబ్ధి నీ కెన
"వరివాకమాలికాభరణ" బిరుద
శౌర్యవిస్ఫురణచే సవ్యసాచీడౌను
నర నీకు "వర్తాకలతర్క" బిరుద
వితరణఖ్యాతిచే విధుఁడు నీ సాటియౌ
"జయవీరమణవాళ" చండబిరుద
ధైర్యమున నీకు మేరుభూధరము దీటు
తనర వడుశరుకులదండధారిబిరుద
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. కత్తికిఁ బచ్చిఫిరాల్ గలిగిన నెఱయోధ
జోడ్డుగంట సలాని కిడ్డజోద
కపికేతనముగల్గు కదన రంగకిరీటి
వీరకంకణముచే మీఱు మేటి
ప్రతిలేని సింహతలాటంబుగలధీర
వింజామరంబులు వెలయుశూర
గండపెండేరంబుఁ గైకొన్న దునెదారి
పచ్చగొడ్గులు గల్గు ప్రధనశౌరి
పంచవన్నెలపావడల్ పరగు నేత
మానరక్షణబిరుదంబుఁ బూనుదాత
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. మదనుని యాకారమహిమంబు విడనాడి
యనిరుద్ధు సౌందర్య మణఁగఁద్రొక్కి
చందురు నెమ్మేని సారము నిరసించి
మహిని జయంతుని మట్టుపఱచి
నలకూబరుని నింపుచెలువమ్ము నను రెమ్మి
నకులుని శృంగారనయము గేరి
నలరాజురూపంబు ననుఁజూచి యణఁకించి
గాంగేయుచందంబుఁ గాకుసేసి
కృష్ణదేవుని యందంబుఁ గ్రిందుపఱచి
సాటిలేకుండ మీఱె నీ చక్కఁదనము
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. తూనికే దాతాయెఁ దొలుదొల్త శిబిరాజు
        పంటల దాతాయె జలధరంబు
కఠినదాతాయెను కాంచఁ జింతామణి
        సీసప్రదాతాయె వెలయువిఘ్నుఁడు
పరకదాతాయెను పరికింపకి...
        పాతికెదాతాయె భానుసుతుఁడు
అరవాసిదాతాయె నంబికారమణుండు
        ముక్కాలుదాతాయె మున్నె బలియుఁ
గాన నీసాటి నెఱదాత కలియుగాన
నరసిచూడంగనేగాన హరిసమాన !
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ ! తొండమాన్ విభునజీర !.

సీ. విసిబడి శేషుని పడగలు విడియించి
        పాలమున్నీటిని భంగపఱచి
కలువలచెలికాని కాంతులు కఱగించి
        మఱి తారకలనెల్ల మాయఁజేసి
ఆకాశవాహిని నబ్ధిలోపలముంచి
        వెలిసమ్మివిరులను విరియఁజేసి
పూని శంఖంబుల పొట్టలెల్లనుఁ జించి
        కల్పవృక్షములఁ జీకాకుపఱచి
హారహీరపటీర నీహారరుచుల
మీఱి నీకీర్తి ధరలోన మెఱసె నౌర
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ ! తొండమాన్ విభునజీర !.

సీ. ప్రతిలేని మైసూరిపతి కేతనమువిూఁద
నెలకొన్న సింగంబు నీదుకీర్తి
పాచ్ఛాహుశిరముపై భాసిల్లుచున్నట్టి
నిండుచంద్రజ్యోతి నీదుకీర్తి
గడిచోడభూపతి కంఠదేశంబున
నెలకొన్న హారంబు నీదుకీర్తి
కేరళభూపాలు కేలఁకులఁ జేవల
నెగడు వింజామర నీదుకీర్తి
పరగ సామంతనృపతుల పాగలందు
నిలుచు మగరాతిజిగితురాల్ నీదుకీర్తి
భళిర తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. భానుని నాకాశపథమునఁ బాలించి
బడబానలంబును జడధిఁ జొనిపి
కాంచనాద్రిని విల్లు గావించి యీడ్పించి
వేలాయుధుని ముందువెనుక జేసి
పద్మరాగంబులఁ బట్టి సానలఁ బెట్టి
యరుణునిఁ గుంటిగా నడరఁ జేసి
విష్ణుచక్రంబును వేయంచు లొనరించి
వారిజోద్భవు విప్రవరుని జేసి
పరగ నీదు ప్రతాపాగ్ని పద్మజాండ
భాండమెల్లను నిండి యుద్దండలీల
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. జోడెనల్ ద్రొక్కును సొగసుగా నొక తేప
మదనదుర్యోధుల మస్తకములఁ
జేడాల్ల దాటును జక్కగా నొకసారి
కుటిలవిద్వేషుల నిటలములను
వేడెముల్ దిరుగును వేడ్కతో నొకమాటు
పీరాధి వీరుల వీధులందు
కదలికల్ జూపును ఘనముగా నొకతూరి
సామంతనృపతుల ధామములను
పంచధారలు గనుపించుఁ బరులు బెగడఁ
బూని నీ తేజి నృపరాజి పొగడ నాజి
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!.

సీ. ఘల్లుఘల్లుమనంగ గదుసు వైరులఁ గొట్టి
ఘుల్ఘులీలుమనంగ బలులఁ గూల్చి
ఘణిఘణీలుమనంగ గడివీరులను డుల్చి
ఖచిఖచిక్కుమనంగఁ గరులనొంచి
ఖంగుఖంగుమనంగఁ గంఖాణముల ద్రుంచి
ఖరిఖరీలుమనంగ నరులఁ జిదిమి
కరికరిల్లుమనంగ గర్వాంధులనుఁ జెండి
ఖణిఖణీలుమనంగఁ గత్తళములఁ
జించి విదళించి వితతులఁ జీల్చునౌర
మేలు నీకత్తి వైరులపాలిమిత్తి
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!.

సీ. కలనులోఁ బగవారి ఖచిఖచిక్కునఁ గ్రుమ్మి
ఛేదించు నీదు కైజీతబలము
దురములో రిపులపైఁ దూరి గోరించుచుఁ
జెండాడు నీదు కైజీతబలము
అనిలోన విమతుల నదలించి విదలించి
చించును నీదు కైజీతబలము
పోరిలో వజ్రీలఁ బొడిచి పొర్లించును
చేకొద్ది నీదు కైజీతబలము
ఘోరవైరుల బారులఁ గొట్టి కూల్చి
చెలఁగుఁ జలమున నీదు కైజీతబలము
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!.

సీ. ఘోడాలు తోడాలు కేడాలు బొమిడికల్
ధరఁగూల వజ్రీల నటికినటికి
పేటలు కోటలు బిగువుజంట జిరాలు
సిరధ్వ్రాల వైరులఁ జెండిచెండి
చిలుకొత్తుదగళాలు చికిలిచేదస్తులు
చెదరంగ దునెదార్లఁ జించి చించి
సింగాణితరకసల్ జిగిరేకుకత్తులు
దునియంగఁ బగతులఁ దునిమి తునిమి
తురఁగములమీటి విమతులఁ ద్రుంచిత్రుంచి
గెలిచె భవదీయరాహుత్తదళము కలఁ
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. వికటించువైరుల వేసి"క్రో" యని యార్చు
"నడె కయ్య" మన్న నీ యడప కాఁడు
మదవద్విరోధుల హృదయముల్ పెకలించు
"రణ" మన్న నీ దుకారాంజివాఁడు
కుటిలవిద్వేషుల గుండెకాయలఁ జీల్చు
"సమర"మం చనిన నీ జారిసాఁడు
గర్వించు విమతుల కంఠముల్ తెగఁగొట్టు
గడిదురంబునను నీ గొడుగువాఁడు
నీదుసాహస మెంచి వర్ణింపఁదరమె?
వీరమణివాళబిరుదాంక విక్రమార్క
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!.

సీ. నీభేరి నినదంబు సెగడినయంతనే
మదవద్విరోధుల మతులు గలఁగు
నీడాలు పెటపెటల్ నిండినయంతనే
ఘోరవిద్వేషుల గుండెలదురు
నీకత్తి నిగనిగల్ సోఁకినయంతనే
విమతుల గర్వ నిర్భేదమగును
నీఘోటిఖురధూళి సెగడినయంతనే
మత్తుల చిత్తముల్ తత్తరించు
వీర నినుఁజూచినప్పుడే యాజివిడిచి
ఘోరవైరులు గుహలలోఁ జేరుచుంద్రు
భళిర తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!.

సీ. మొనసి స్వామిద్రోహ మొనరించుమూర్ఖుల
పై తలమిత్తి నీ చేతికత్తి
ఏలినస్వామితో నెదిరించు కుమతుల
నెత్తిపై బలు మేకు నీదుబాకు
స్వామికార్యముల వంచన సేయు కుటిలుల
నిటలంబుపై కొంకి నీదువంకి
పలిమాటమీఱిన బండలండీలకు
జమునిదాడిర నీదు జమ్మదాడి
గదర! యుష్మద్భుజాగ్రగజాగ్రతప్రతాప
మెన్న శక్యంబె యల పన్నగేంద్రునికిని
భళిర తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. మఝ్ఝారె! నీవంటి మహిపచంద్రుఁడుకల్గఁ
దపమాచరించిరో ధరణిసురులు
మాయురే! నీవంటి మనుజసింహముకల్గ
బదాౖక్షుఁగొల్చిరో బంధుతతులు
చాగురే! నీవంటి జననాయకుఁడుకల్గ
నేవరమందిరో? యిష్టసఖులు
భల్లారె! నివంటి ప్రభుశిరోమణికల్గ
నేపూజఁజేసిరో యెల్లకవులు
మేలు! శెహబాసు! నీవంటి మేటికలడె
జలధి వలయితధారుణి చక్రమునను
భళిర తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. అల్ల మార్కండేయు నంతదీర్ఘాయువు
సూర్యునియంత తేజోభరంబు
శంకరునంతటి శాశ్వతైశ్వర్యంబు
దేవేంద్రునంతటి దివ్యభోగ
మర్జుననంతటి యాహవశౌర్యంబు
భీమసేనునియంత భీమబలము
అలహరిశ్చంద్రరా జంతటిసత్యంబు
ధర్మరాజంతటి ధర్మపరత
నళరాజునంత పుణ్యశ్లోకతాయుక్తి
మాంధాత యంతటి మహితకీర్తి
అనిలునంతటి సత్ప్రితాపాతిశయము
కర్ణునంతటి యీవియుఁ గలిగి మనుము
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార !
విజయరఘునాథ ! తొండమాన్ విభువజీర !.

## ఈ ప్రభువుపై వేఱొక కవిరచించిన పద్యములు

క. శ్రీకంఠుని కృపచేతను
నీకత్తికి దీటులేక నిఖిల ధరిత్రిన్
జేకొమ్మ శాశ్వతమ్ముగ
రాకాశశిరూప ! విజయరఘునాథనృపా.

సీ. కత్తికి పచ్చిపూల్ గలిగిన హంవీర !
జోడుగంట గుఱ్ఱానికిడ్డశూర !
సాంబ్రాణిధూపవాసనలుగై కొను మేటి !
గండపెండేరంబుఁ గలకిరీటి !

పంచవన్నెలు గల్గు పావడల్ గలయోధ!
నవబత్తు గలయట్టి యవనినాథ !
సింహతలాటంబుఁ జెల్లించు వజ్రీడ !
వేటుపావడఁ గల్గు పోటుకాఁడ !
మకరబిబ్బీలు కల్గిన మన్నెరాయ !
చంద్రసూర్యాదివాద్యపు సమితజేయ
కోటికులవర్య ! రణనిరాఘాటధైర్య !
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !

సీ. చేపట్టుసడలక చివ్వన వీఁడక
తెగవునఁ దప్పక తెట్టగిలక
విసరెడి తావుల వెలిగాక కడివోక
సుంకులు రాలక చుట్టుకొనక
గడుసైన తావులఁ దడఁబడి నిలువక
సామానటంచన్న సరకుగొనక
కాదని వంపైన గతికూడకుండక
కొనకత్తి మెండైనఁ దునిగి చనక
దొనకు దిగియేటు పోటును చినుకు నిఱుకు
విసరులను హత్తి బిరుదుకక్కసపు బంట్ల
జిగురుఁదినిపించు నార నీ చేతికత్తి
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !.

సీ. వడివేయుమీసంబు పట్టునఁ జిక్కఁగా
పీడియు డాచేత వ్రేలు తలలు
కరకరిచేతఁ బల్గంటి సేయుచునుండ
దొర్లి ముంజేఁ బట్టుకొనెడు తలలు

అడుగంటఁ డెగియుండ నదియోటుంగక పోర
రమ్మను సన్నచే వ్రాలుతలలు
బిరుదులుపలుకంగ దొరఁగియు మధ్యమ
వైఖరిగాఁ బల్కఁ బడినతలలు
కదియు బొమముళ్లు నెత్తురుఁ గక్కుతలలు
నూపిరెగఁదీయు ముక్కులఁ జూపి రిపుల
కుత్తుకలఁగోయు నీ యసి కోటిరాయ
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!.

సీ. ఆధోరణుని వెన్ను నంటియుండెడి పింజ
దంతితుండపుచుట్లు దాఁక నలుగు
భటునకుఁ గుడిజబ్బఁ బడి కానఁబడుపింజ
డాకేలకే డెంబుఁ దాక నలుగు
రాహుత్తు నెత్తిపై రంజిల్లఁ దగుపింజ
గుఱ్ఱము వలచెవి గొన్న నలుగు
రథికు లస్తకమునఁ గ్రాలుచుండెడు పింజ
నాభిదేశంబున నాట నలుగుఁ
గాన జడిపట్టుచందాన కలనులోన
శరములగలించుధాటి దేవరకుసాటి
గాన రిపుకోటి నేను జగానఁ గోటిఁ
గోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. చికిలిబంగరు పూఁత చిల్లోడు గేడెంబు
చిప్పలంచును చనుల్ జెనక వెలిచి

ఛేదమూలేదు జనబ్ధిపరంగు మెఱుంగు
ధారగానెంచి నూగారుకళికి
సరిగెపూహారువుల చాయ సూర్యపుటంప
దొనలంచుఁ బిక్కలఁ గనఁగ వెఱచి
ఘటంపులాహురి నాటకు విల్లని
బొమముడి పాటున భ్రమవహించి
భవదహిత పాళి యప్సరః ప్రతతికేళి
ఖేదము వహించుగాని సుఖింపదాయె
కోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!.

సీ. పాండ్యభూపాలు దీప్తప్రతాపాగ్నికే
శూరునిబలము సమీరణంబు
మధురేశుకీర్తి నిర్మలసుధారాశికే
యున్నిద్రుజయము చంద్రోదయంబు
త్రిశిరఃపురాధి పతిప్రతిజ్ఞామంధ
రమునకే దొరబుద్ధి కమఠరాజి
విశ్వనాథావనీ విభుమనశ్శుభవధూ
గ్రీవకే భూపాలు సేవ బొట్టు
అతఁడు నీవెగదాపదానతమహారి!
హారికరుణావిహారి! యాహవపురారి!
కోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!.

సీ. తేలనై చెడి వేళ బాళిచే దొడరిన
వెనుచక్కి మొనఁబడ్డ విసరివిసరి

కంఠంబుకంఠంబుఁ గదిసియున్నటులైన
దాటించి తొడిబడ మీటిమీటి
కావాలపట్టుచోఁ గలయక దగజెంది
చెండింపఁగాఁ జేరి జవిరిజవిరి
... ... ... మరలించి
పైపైనిఁ జేకొద్ది వైచివైచి
జోడనలుమించఁ గురుచల చురుకుఁజూపి
నరికినరికి...దరిమితరిమి
ఘోటివడిమీటి గురుదాను గొనెదుకోటి
విజయరఘునాథ! జయ భార్గవీసనాథ!.

సీ. గరినిక్కుటమ్ములఁ గురుచయాల్లెలఁ బూన్చి
జబ్బువింటను వేసి చంపుకడిమి
కటికను దాటించు గతినైన మరలిన
తేజి సేమీటి హత్తెడుచలంబు
కత్తికత్తినఁ బట్టఁ గద్దానుఁ జొర్లిన
నణుకుచోఁ బాళ్ల సేర్పఱచు సేర్పు
జీరాలు తెగెనని చేరి మొనల్ జిమ్ముఁ
దప్పించి మక్కిచే గుప్పు తెగువ
నీ కులమ్మున కమరెను గాక ధరను
గనఁగ నేర్తురె? పోటుగాం డ్రనికిమకురు
లసికిలగుచేరఁ దిరుమలరాడ్కుమార!
విజయరఘునాథ! జయ భార్గవీసనాథ!

సీ. జన్యాంగణమున రాజన్యపుంగవులెన్నఁ
గ్రొన్నన విల్కానికన్న మిన్న

సన్నాహమున సముత్పన్న పన్నగవైరి
జవయుతమగు మహాశ్వంబు నెక్కి
"ఢే" యనియార్చి సందీప్తకాలానల
కీలాకరాళసంవేలఖడ్గ
ధారాహతానేక వీరారిజనవార
సారశోణితపూర ఘోరనదులఁ
బఱప నోఱప్పైన దురము నిర్భరము సేయుఁ
నేర్పు నీకబ్బె భార్గవు నేర్పుమీరఁ
గోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ గడగడమని కాళ్లు వడఁక (జొచ్చినయంత
స్తంభగుణంబు కొంత తలఁచివైచెఁ
బలుకు డగ్గుత్తికఁ బడి వికారమునొందఁ
బ్రణయమ్ము మానసంపదను నిల్పె
నెలనెలరైయె మేనువికృతివహించుచో
రోమాంచలంబుమఱుంగు వెట్టె
గన్నీటఁజినుకులుకాలువలై పార
స్వేదప్రవాహంబుఁ జేర్చుకొనియెఁ
దక్కులనుద్రోచ్చితంభపైఁ దనకుఁ బ్రేమ
యనుచునీవైరి సేర్పగ నతనుదారిఁ
గోటివంశసనాథ! సంగుప్తబోధ!
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. చెంగావిపావడరంగుగా మెఱయించి
యదికాకపూదండలలవరించి

తనమేనిచాయచిత్తంబున భ్రమియించి
వలసినబహుమానములను జెంది
కేడంబుఁదెరచాటుఁబిడిచుందరనిల్పి
క్రమముగానటనవైఖరినిఁజూపి
చెంతకురమ్మనిచింగునవెనుదీసి
వేగమేకంతంబుఁగౌఁగిలించి
సురతలీలనుఁగనుపించిసుఖమునించు
నాటవిరిబోణియనఁగనీదగుకృపాణి
గోటివంశసనాథ ! సంగుప్తబోధ !
విజయరఘునాథ ! జయభార్గవీసనాథ !.

ఈ ప్రభువుపై సీతారామయ్యయను కవివ్రాసిన పద్యములు.

సీ. వలిమలల్లుండును వానికుమారుండు
సరినత్తురవనిలో శౌర్యమందు
వనధియల్లుండును వానికుమారుండు
రూపొప్పుదురుధాత్రిరూపమందు
పాండేంద్రునల్లుండు వానికుమారుండు
జంటౌదురిలలోన వింటియందు
వనజాక్షునల్లుండు వానికుమారుండు
నీడౌదురుర్విలోనీవియందు
గానవినుఁ గొల్చి విఖ్యాతిఁ గాంచినట్టి
అల్లుడి కుమాళ్లకవనిలోననుదినంబు
భళిరతిరుమలతొండమాన్ ప్రభుకుమార !.
విజయరఘునాథ ! తొండమాన్ విభువజీర !.

సీ. దేవతారాజులు స్థిరశౌర్యమహిమచే
భోగిరాజులు పటుబుద్ధిచేత
గిరిరాజవర్యులు నతిధైర్యగరిమచేఁ
బక్షిరాజులు బాహుబలముచేతఁ
గలశాబ్ధిరాజులు గాంభీర్యగుణముచే
కలువలరాజులు కాంతిచేత
రాజరాజులుతనరారు సంపదలచే
నలరాజులీలరూప వైభవమున
ధర్మరాజులు నీతిచేఁ దలచిచూడ
సామి నీరాజచంద్రులు జగతి మీఁద
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. గుభగుభాలనిపారు గుంటుఁకోవి ఫిరంగి
జవురు జంగీలకు సరకుఁగొనక
సరసర బిరబిర జరజరమనివచ్చు
బాణాలరవళిచే బబ్బరిలక
ఫెళ ఫెళ ఢమిఢమీ పెటపెట 'రోయ్యను'
బలు తుపాకీగుండ్ల కళుకుఁ గొనక
ధణధణాం ధణధణాం ధాణంధణత్కార
భేరిభాంకృతులకు బెండగిలక
యెంతలెమ్మని తేర్లపై నెక్కితూరి
చుట్టుముట్టుగఁ బాళెముల్ గొట్టితౌర
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. గజఘంట ఘణఘణల్ ధ్వజముల పెటపెటల్
గుంటుకోవిఫిరంగి గుభగుభలును
బలుతుపాకీగుండ్ల ఫెళఫెళల్ కత్తుల
ఫళఫళ లీలల ధగధగలును
శరములబిసబిసల్ చక్రాలజరజరల్
బాణాలబిరబిరల్ భటులరథుల
భూరిభేరీధ్వనుల్ వారణఘీంకృతుల్
జవనకంఖాణఘోషలు చెలంగ
వళుకుబెళుకును లేక యాహవముసొచ్చి
ఘోరవైరుల శిరములఁ గూల్చు వీర!
భళిర తిరుమలతోండమాన్ ప్రభుకుమార
విజయరఘునాథ! తోండమాన్ విభువజీర!.

## కోటి రఘునాథరాయలు

ఈతఁడు విజయరఘునాథ తోండమాన్ మహీపాలుని పుత్రుఁడు. ఈరఘునాథతోండమాన్ మహీపాలుఁడు 1767 సం॥ మొదలు, 1789 సం॥వఱకును రాజ్యపాలనముఁ జేసెను. ఈతఁడు గొప్పపండితుఁడును గవియునై పార్వతీపరిణయ మను నారాశ్వాసముల ప్రబంధమును రచించియున్నాఁడు. ఈతనియాస్థాన కవి నుదురుపాటి వేంకనార్యుఁడు. ఈతనిపైఁ జాటువులు.

శా. గంభీరోద్భటగంధసింధురఘటాఘంటాఘణాత్కారముల్
దంభాడంబరభేరికాధణధణంధాణంధణాత్కారముల్
జృంభింపన్ రణరంగమందు రిపులన్ శిక్షింతువౌ దిగ్జయ
స్తంభశ్రీరమణీయరాయ రఘునాథా! యోధయూథాగ్రణీ!.

శా. రాజారామసరోజబాంధవుఁడు ప్రహ్లాదుండు భైరోజి స
త్తోజీఘోర్పడముఖ్యులైన నెఱయోధుల్ తోండమార్ రాజహో
రాజాభోజ 'సబాసహోబహతుభాల్లా' యంచు నిన్మెచ్చ శా
బోజీ పండితుఁడా! సమర్థుఁడు రణంబుం జేయ నీధాకకున్
హాజీవై భళి మేలు గాయ రఘునాథా! యోధయోధాగ్రణీ!.

శా. శ్రీరంజిల్లఁగ నీకుఁ బాండ్యనగరీ సింహాసనేంద్రుండు బల్
పేరిచ్చెం గద మెచ్చి మేలు సమరప్రేంఖజ్జగూరంభగం
భీరస్ఫారధమామి కాధమధమా భీమోగ్ర బాహాబలో
దారా! సారవిహార! రాయరఘునాథా! యోధయోధాగ్రణీ!.

మ. గణుతింపన్ వశమా భవద్విజయజాగ్రద్వీరవిద్యావిజృం
భణపాండిత్యము నీకె చెల్లె భళిరా! భద్రేభ ఘంటాఘణాం
ఘణనిక్వాణనిరర్ధ్యనిర్ఝరమహాగంభీర భేరీధణాం
ధణధాణంధణధాణ! రాయరఘునాథా! యోధయోధాగ్రణీ!.

మ. దురమందుం దురగంబు దై యనుమఁ జిందుల్ ద్రొక్క బాహాసిభీ
కరలీలం..................ల పేటీజరా
వెఱఘోడాగజళింగిణీతరకసా నేజల్ ధణారింతువో
తరుణీమన్మథ! కోటిరాయరఘునాథా! యోధయోధాగ్రణీ!.

సీ. నవరసాలంకారనయచమత్కృతు లొప్ప
సత్కవుల్ పద్యముల్ సంఘటింప
జమదగ్నిభుజగర్వశమమహోగ్రభుజశక్తు
లుత్తమక్షత్రియు లొగిఁ జెలంగ
విదితసంగరరంగ విజయవిక్రము లైన
బిరుదురౌతుల పరంపరలుగొల్వ
వనవద్యజనహృద్యఘనగద్యపదపద్య
గతులొంది వందిమాగధులు పొగడ

నెగడునభినయ విభ్రమాన్వితులు వార
వనిత లవితరసులభ విద్యను నటింప
నిండుకొలువుండు నాఖండలుండు జగతి
నీవె యవనార రఘునాథ! నృపవజీర!.

సీ. మహిలోనఁ గలహంసమండలంబులఁ చెల్వఁ
గైకొని దిక్కులఁ గలయఁ దిరుగ
నాఁడుద్యుతిపరిణాహంబులనుజూచి
నయము మీఱంగఁ దా నవ్వఁదొడఁగ
నతిశీతభానుజా హంకార హూంకార
పటిమఁ జేకొని వియత్తటి నటింపఁ
దతవారకంతనిస్సృతరుచిస్ఫూర్తితో
నవనిఁ జూడంగ నంనంన నలరు
భళిర! నీవైరిరాజన్యకులము కీర్తు
లరయ నీభవ్యసత్కీర్తు లనుకరింప
వచ్చి జిగినల్ల నల్లన విచ్చిపఱచు
నిస్తులోదార! రఘునాథ నృపవజీర!.

సీ. సముదస్సైంధవశరాసనగురూత్తమరాజ
రాజకర్ణభయంకరంబులగుచుఁ
గదనభీకరవైరిమదనదావళిపజ్జ్రి
వదనవైవర్ణ్యకృత్స్వనములగుచు
సమరనిర్ఝయవిద్విమత్కృతవీర్యము
ల్గర్వసర్వంకషక్రమములగుచు
ప్రతిమహీభృన్మహోద్భటపక్షసంతతు
ణావిచక్షణతరక్షణములగుచు

విజయరఘునాథ! పరపక్షభృద్విభేదుర! పరని
రర్గళోదగ్ర భవ్యదివ్యాయుధోగ్ర
గుణములను మించునీభేరిఘణఘణమ్ము
లదిర ! రఘునాథ చంద్ర ! యాహవమృగేంద్ర

సీ. కార్యంబునకు లేక గ్రాసమిమ్మనువానిఁ
బట్టుక ముచ్చెను గొట్టవలయు
సమరంబనినఁ బారి చదురుననుండెడు
వానిమీసముఁ బీకివైవవలయు
బంతికూటికిఁ జొంచి బారుకేఁగనివాని
వీధిలోనిడి సాడ్లవేయవలయుఁ
బతి యొండుమనుచోటఁ బారివచ్చినవానిఁ
జలమునఁ గొఱ్ఱుపై నిలుపవలయు
ననుచు రోషములాడుచు నహితవరుల
నెగ్గి సిగ్గులుదీతురు నీదుభటులు
కోటికులవర్య ! రణనిర్ఘాటచర్య !
రాయబిరుదాంక ! రఘునాథరాణ్మృగాంక.

సీ. శ్రీరామచంద్రుని గేరుదొరతనమ్ము
రతనమ్ములను మీరు సుతుల కలిమి
కలిమిపూఁబోఁడి నిల్కడయైనవరసభ
రసభావసత్కావ్యరచన తెలివి
తెలివిప్పుటస... తెగని యాలోచన
లోచనానందమైతోచునగరు
నగరుచిరస్తనీనవవిలాసకలన
సకలనరేంద్రప్రశస్తమహిమ

మహేమతంగజగామినీ మాననీయ
భావమును భావమున మెచ్చి భవ్యుఁ డౌసంగఁ
గాంచ కోటిఫలాబ్ధినక్షత్ర నేత!
రాయబిరుదాంక! రఘునాథరాజమృగాంక!.

సీ. గొలగొలమనినంతఁ గలక బారెడురాజు
జండెంబు తట్టు పన్నాడిగాదె
స్వామికార్యమునందు జరిగిపోయెడురాజు
పట్టెనామము కొంగ రెట్టగాదె
వాశెంబుపోవ జాలాలుచేసెడురాజు
బుఱ్ఱకట్టియ దోటికఱ్ఱగాదె
యిది తెలిసి,........నడరు చెదరు నొరుల
మదవదహితుల నెల్లను జదుమవలదె?
కోటికులవర్య! కఠినఘాటచర్య!
రాయబిరుదాంక! రఘునాథరాజమృగాంక!

సీ. తతభేరికాధంధంధరవప్రతిభయ
స్ఫూర్జద్ఘనాఘన గర్జితంబు
జృంభితాహితకుంభికుంభోత్పతత్పత
ద్రుచిరముక్తాఘనవర్షోపలంబు
ప్రతిదళత్స్ఫురదసిద్యుతిచకచ్చకలస
ద్విద్యుల్లతోదగ్రవిభ్రమంబు
శరవర్షనిర్మగ్న పరభూధరధ్వాంత
నిర్ఝరకీలాల నిర్ఝరంబు
గీ. సమర సమయ సముద్భవ త్సైన్యవరష
ముదయపర్జన్యవిలసితం బదిర! భోజ

విజయరఘునాథమేదినీవిభు తనూజ
రాయరఘునాథ భూతలరాజరాజ !.

సీ. మీసంబు దీటి గంభీరభేరీతతి
భాంక్రియాసంభ్రమభ్రమధురీణ
ఘోట్టాణజరటంక కట్టకసంజాత
ధరణీరజస్స...స్థగితసకల
హరిదంతరుండుగా నని మొనలో నిల్చి
చిఱునవ్వుతోడ బల్ సురియఁబూని
జిగిజిరాల్ బిగిగురాల్ తెగిభటుల్ తెగినటుల్
బడి సలామిడ సలా మడుగుమడుగు
దుడుకు నడవడి తడఁబడి యడఁగులిడఁగ
గడుసుకడువడిఁ బడెదు నీ యడఁగులందు
నీకె తగుగాక రణజయాన్వితపతాక !
రాయరఘునాథభూప ! విక్రమదిలీప !.

## సూర్యశేఖరకవి రచించినపద్యములు

చ. హరిహరపద్మజాదిదివిజాంశము లన్నియుఁ గూడి మేటిపై
హరిహయమెక్కి మిక్కిలి రణార్భటి నిక్కిన దైత్యకోటులన్
దురమునఁ ద్రుంచి మించి దయతో భువనమ్ములఁ బ్రోచునట్టి శ్రీ
పురహరుదేవి దుర్గ నినుఁ బ్రోచుదయన్ రఘునాథభూవరా !.

చ. సమరతలంబనే మడిని శాత్రవ రక్తజలంబు నించి దు
ర్దమకరికుంభమౌక్తికపరంపరవిత్తనముల్ ఘటించి వ్యో
మమనెడు కాయమానమున మంజులకీర్తిలతాళితారకా
సుమసహితంబుగాఁ బ్రబలఁ జూచెదు శ్రీరఘునాథభూవరా !.

సీ. ఖండింతువో సముద్దండపటాపండ
పరిపంథిగంధసింధురకరాలు
సాధింతువో జగ్గుజగ్గుగాశరలత
త్కారినారిలోకభీకరపురాలు
భేదింతువో బేడాబెడలుగా నఖ్ఖ చె
ఖ్ఖను లేక రిపుల గొంతులనరాలు
పెకలింతువో పకావకలుగాఁజికిలిత
ఖ్ఖలుగుల్కు శత్రురాజుల శిరాలు
హౌదు! మర్ఝ్ఝూర! బాబురే! ఔ! సెబాసు!
రణజయోద్దండ భుజదండ రాయతొండ
మండలాఖండలతనూజ! దండితేజ!
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. ఖమ్ములై శశిమయూఖమ్ములై స్మరవిశి
ఖమ్ములై చంద్రసఖమ్ము లగుచు
భమ్ములై .........శారదా
భమ్ములై పవిసన్నిభమ్ము లగుచు
సరములైన 'వసుధాసరములై కుముదకే
సరములై కుందవిసరము లగుచు
శరములై ద్యోధునీశరములై హృతపురా
శరములై నరమృగీశరము లగుచు
తావకీనయశమ్ములు ధరణిలోనఁ
బ్రబలు బలసంపదల పెంపు సొబగునింప
విజయరఘునాథమేదినీవిభుతనూజ
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!.

క. నీ కీర్తిపుష్పలతకును
లోకస్తుతి పుష్పవంతులును ఫలములు గా
లోకాలోకము దంబగు
రాకాశశిపూర్ణవదన రఘునాథనృపా !.

సీ. యామినీకామినీహారకాతారక
శరకుందదరబృంద సమితి నొంచి
హరగాత్ర సురగోత్ర మరగాత్ర మరసింధు
జరసింధు భవదంతిఁ బరిహసించి
హరికాండ హరికాండ హరిదంత కరిదంత
శరదభ్ర పరిశుభ్ర సరణిగెలిచి
మదజాల పదజాల మందార బృందార
కాహార భాహార గరిమమించి
అంచితోదారవైఖరి

... ... ...

## మన్నారు కవికృతములు

సీ. ప్రాతరారంభజృంభన్మానసాంభోజ
రమణీయ మకరంద రసముఁ గేరి
సాయం సముత్ఫుల్ల జాతి ప్రసూనాళి
పరిమళ సందోహ పటిమఁ దూరి
శారదచంద్రికా సారసారపటీర
ఘనసార శీతల గరిమ మీరి
వాణీలసత్పాణి వీణా పరిక్వాణ
కలకలాఖ్యతులతోఁ గలసిపోని

మధుర సురభిళ శీతల మంద్రభావ
ములను విలసిల్లు నీపల్కు వలనుమీరి
విజయరఘునాథ మేదినీవిభుతనూజ !
రాయరఘునాథభోజ ! విక్రమబిడౌజ !.

సీ. ఈతఁడే నా సముదితహితసముదయ
ములుకొలువఁగ బలుచెలువు తనర
ఘన రసికులగము లనవరతము మది
ముద మొదవగ నరు.........
............మతు లగు బుధకవి
గురులును నయమున వరుసఁ దనర
కవితలు బలువగ కలితమధుర సమ
ధురిమను గనుఁగొని మెరయ వినికి
గొను..................నత
నమరు నమలపతి కరణి ధరణి
గీ. నగు విజయరఘునాథేంద్రు తనయుఁడైన
రాయరఘునాథమానవ......

సీ..................దురమున
నదరక బెదరక యెదురుకొనిన
మదమున రిపులను గదుముచు గుదుముచు
జదుముచు నదుముచు మెదలనీక
...............................
గుదులను గళములఁ జిదురుపలుగఁ
బడపడి పుడమిని గదుపుల గెలుపులఁ
గలుముల చిలుకల కొలికి నెనసె

గీ. విభవుఁడై కీర్తిచేఁ జాల వెలసినట్టి
విజయరఘునాథ తొండమాన్ విభుకిరీటి......

సీ. కీర్తిచే ధైర్యవిస్ఫూర్తిచే సతతంబుఁ
గలధౌతగిరిలీల వెలసినావు
దానంబుచేఁ బూర్ణమానంబుచే సదా
రాజరాజఖ్యాతిఁ బ్రబలినావు
జయముచే నుతదయోదయముచే ననిశంబు
కృష్ణప్రభావంబు గెలిచినావు
చెలువుచే విద్యల నలువుచే సంతతం
బాత్మభూవైఖరి నలరినావు
రాజమాత్రుండవే? నీవు రాజలోక
సన్నుతౌన్నత్యగాంభీర్య శౌర్యధుర్య!
విజయరఘునాథ మేదినీవిభుతనూజ
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!.

సీ. రాజకరప్రాప్తిఁ దేజంబుకడుమించి
రిపుభేదనస్ఫూర్తి నతిశయించి
వజ్రధరఖ్యాతి వదలకుండుటఁజేసి
వృత్తసంభేదనవృత్తిఁ దనరి
ధారాధరోన్నతిఁ దనరారుటను రాజ
హంసోదయానటన మొనరఁ జేసి
తతసముగ్రస్ఫూర్తి నతిశయించుచుఁ జాల
కమలాధికవిహారగరిమఁ దూరి
నీదు తరవారి పటువైరి నియతిదారి
భూరిశుభకారి సంతతభూరిదారి

విజయరఘునాథ మేదినీ విభుతనూజ
రాయరఘునాథ భోజ! విక్రమబిడౌజ!.

సీ. ఆలాగయనుచు నైజాననాంభోరుహ
సౌందర్య మకరంద సారలోక
చంచరీకచ్ఛటచ్ఛవిఁ గేరుమీసంబు
వడవేయ శాత్రవుల్ జడిసిపార
నడవులలోఁ జూరి యయ్యెడలను దారి
పోనున్న వడి యారి పొదలఁ దూరి
ముండ్లిడఁగ నైరి మూకలంచును దారి
తప్పఁగ మదిఁగోరి ధాతదూరి
యేడవెడలితి మీసారి యింకసారి
వలదటంచును తమవారివద్దఁ జేరి
తెలుపుకోనఁజేసి తహహా! దోర్బలజితారి!
రాయరఘునాథశౌరి! విక్రమవిహారి!.

సీ. వెడకేక వైచి నవ్వీరమణామణిదీప్ర
హాటకడోలికా కటకకలిత
కుంభికుంభములపై గోరిసెలు ప్రోవంగఁ
బారాహజారిని జేర నుతికి
దాపుననిడిన నిద్దాఫిరంగులచాయ
ధగధగయనఁగ వైపుగనె చూసి
"అదె పోటు లదె మీటు లదె నలుక దెచురు
కదె కోసరదె విసరదెయదె" యని
కదనమున నెదురుపడెడు మదవదరుల
గదిమి చిదిమెడు మెరవడి కలదె మహిని

నీకె తగుఁగాక సమరలీలాకుమార !
రాయరఘునాథశౌరి ! విక్రమవిహారి !.

## విజయరంగ చొక్కనాథుఁడు

ఇతఁడు క్రీ. 1704 సం॥ మొదలు 1731 సంవత్సరము వఱకును మధురరాజ్యమును పాలించినవాఁడు. ఈతనిపైఁ జెప్పఁ బడిన పద్యములు.

క. రమ్మనెరా తనదేసే
రమ్మనెరా పంచశరుని రాపోర్చుట భా
రమ్మనెరా నీ వేతన
సొమ్మనెరా విజయరంగ చొక్కవజీరా !.

క. రాపేరా ? జిగిపచ్చల
రాపేరా యొసఁగి తల్ల రమణికి ? నాతో
దాపేరం ? రేపేరా
మాపేరా విజయరంగ చొక్కవజీరా !

క. ఇమ్మగఁ గమ్మని వీడెము
కొమ్మని కొమ్మ నిపుడేలుకొమ్మనిశము నొ
పమ్మెరా ? యా చెలి నీ
సొమ్మెరా విజయరంగ చొక్కవజీరా !.

క. వలరాజును నెలరాజును
నలరాజును........సీతులనీ
తులరాఁ గలరా ? యిలరా
జులరాజా ! విజయరంగ చొక్కవజీరా !

క. సరసానికి దొరసానికి
........నొసఁగితివి భళీ
సరసాలా! కవిగాయక
సురసాలా! విజయరంగ చొక్కనజీరా!.

క. నాటికి మాజోటిని నొక
చోటికి రమ్మనియు నెనయఁజూచితి...
......................
జూటేరా విజయరంగ చొక్కనజీరా!.

క. ఎక్కడ నేర్చితి వగలను
నిక్కము వలచినది కొమ్మ నీ పేరంటే:
మ్రొక్కునురా స్రుక్కునురా
సొక్కునురా విజయరంగ చొక్కనజీరా.!

## కోటి రాజగోపాలరాయలు

క. అదిరా! మహీరథవిధిమధు
మధుమథనకథాసుధాసుమధుమధురిమధూ
ర్మనురమతీ! మధురగతీ!
కుధరధృతీ! కోటిరాజగోపాలపతీ!.

క. కోటిగదా? వితరణ శత
కోటిగదా? యరి సహస్ర కోటీరలునత్
కోటిగదా చరణతులా
కోటిభళీ! కోటి రాజగోపాలపతీ!.

క. ఘృమణయన నీదువనితా
విషమాంబక కార్శ్యకార్శ్య విషమాంబక సత్

విషితసుధద్విషితబుధో
ద్ఘుషితకథాలాప! రాజగోపాలనృపా!.

క. మాపాలవారి నెల్లరఁ
గాపాడుము విమలహృదయ కమలోద్భాస్వత్
గోపాలక గోపాలక
గోపాలకలాప! రాజగోపాలనృపా!.

క. అందఱికి దొరక నేరదు
మందస్మందాకినీందు మందార ఖగ
స్యందన నందన చందన
కుందయశఃప్రతతి! రాజగోపాలపతీ!.

## పూసపాటి విజయరామరాజు

సీ. పదివేలయీటెలు బలునైన సరదార్లు
మేలైన బలు తుపాకీలతోడ
రామసింగులు పెద్దరాతుసఫిరంగులు (?)
దుమికించు నుత్తమాశ్వములతోడ
నెరవైన కోకిరల్ మేలైన జముదార్లు
తప్పెట్ల భేరీల ఢమకుతోడ
నిండైనగజములు నీటెల మొనగాండ్రు
బందుబస్తులతోడ బారుగూర్చి
కోటసాధించి మద్దులు గొట్టినావు
రాళ్లిమూక జగన్నాథరాజు దుమికె
భాగ్యదేవేంద్ర శ్రీ పూసపాటిధీర
విజయగుణధామ! రణభీమ! విజయరామ.

## కలిదిండి రామభూపతి

సీ. ఘోరయుద్ధంబులో కోటిరాణువమీఁద
చెండిచెండాడదా చేతి యీటె
ఢిల్లీన్న మతిదొడ్డ ఢిల్లి పౌజులమీఁద
జగడంబు సేయదా చాయకత్తి
ఎదురు పాచ్చాయైన నెదుట నున్నప్పుడే
సూటిగాఁ బొడువదా చూరకత్తి
నేటుగా మీరుప్రవిల్లుఖానునిమీఁద
నాడఁగా నురుకదా యాయుధంబు
మహిమ వర్ణింపఁగారాదు మానవులకు
విరివి చప్పన్న దేశాల వినుతికెక్కి
నల్లగానున్న తురకల వంచినావు
రమ్యగుణదీప! కలదిండి రామభూప!.

సీ. "... ... ... ...
అతనిసత్కృప మహోన్నతుఁ డితండు
అతఁడు మహోద్యోగి యితఁ డుపాయోద్యోగి
యతని సత్కృప మహోన్నతుఁ డితండు
అతఁడు శ్రీకాంతుండు నితఁడు భూకాంతుండు
అతని సత్కృప మహోన్నతుఁ డితండు
... ... ... ...
దాంతుఁ డాతండు కీర్తివిశ్రాంతుఁ డితఁడు
పుణ్యుఁ డాతండు వీరాగ్రగణ్యుఁ డితఁడు
... ... ... ...
రాముఁ డాతండు కలిదిండిరాముఁ డితఁడు.

## కోమటి వేమన

పదునేనవశతాబ్దిలోఁ గొండవీటినిఁ బాలించిన రెడ్డిరాజులలో నీతఁడొకఁడు. ఈతఁ డిరువదిసంవత్సరములు రాజ్యపాలనముఁ జేసినట్లు నీ క్రింది సీసపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. పోలయ వేమన్న పొలుపారఁ బంద్రెండు
వత్సరంబులు కాచె వసుధ యెల్ల
అటు వెన్క మూప్పది యనపోతవేమన్న
వన్నెవాసికి నెక్కె వసుధయేలె
ధర్మాత్ముఁ డన వేము ధరణీకళత్రుండు
పదియునేనిట భూమిఁ బదిలపఱిచె
ప్రజలకుబ్బసముగఁ బదునాలు గేఁడులు
కొమరగిరి యేలెను సమయుదాఁక
ఏలెఁ గోమటివేమన యిరువదేండ్లు
రాచవేమన్న నాల్గువర్షముల నేలె
మించి కట్టిరి గృహరాజు మేడ కొండ
వీట నూరేండ్లు రెడ్లు భూవిదితయశులు.

## కోమటివేమననుగూర్చిన చాటువు

సీ. శాత్రవరాజన్యతతులఁ బడమొత్తి
దుర్గాగ్రపురములు దుక్కి దున్ని
చెనటి విరోధుల శల్యమ్ము లెడఁబాపి
నటకుటిరిపులను నల్కఁ దేరి

వైరికాంతల నేత్రవర్షంబుఁ గురిపించి
కుటిలారిమొత్తము ల్గొట్టమర్చి
వీరరాహుత్తులవిత్తనాలెదఁ బెట్టి
పగతులయెమ్ములుపంటఁ జేసి
మొనల మన్నీల గుంపుల మొదలుగోసి
యొసఁగ నూర్పించి, నూర్పొత్తి, యేకరాసి
ఖలనుగావించె నీకత్తి కాపుకొడుకు
గాయగోవాళ! జగనొబ్బ గండబిరుద!
అతుల బలభీమ! శ్రీకోమిటన్న వేమ!

ఇప్పల బక్కిరెడ్డి.

సీ. కనకసోపాన మార్గమ్ములు కట్టించె
మహిమీదఁ దంగళ్ల మాచిరెడ్డి
మల్లికార్జునగుడి మంచికుందనమునఁ
జోల్పించె ననుముల బుద్ధరెడ్డి
గుఱుతైన చెఱువులు కోటలు నిర్మించె
భువిఁ బ్రసిద్ధినిఁ గన్న బుద్ధరెడ్డి
జగదేకదాతృత్వ సద్గుణంబుల కెల్ల
విఖ్యాతిఁ గనె ననవేమరెడ్డి
వీరిలో నీడుజోడన వితరణమున
నితరరెడ్లను సరిపోల్ప నెట్లువచ్చు
మానుపాధ్యుండు కత్తి తిమ్మన యితండు
భాగ్యసంపన్నుఁ డిప్పల బక్కిరెడ్డి.

## ఒడ్డెపూడి అక్కనరెడ్డి.

ఉ. కాశిని గోలకొండ కటకంబును డిల్లి నిజాంపురమ్మునన్
భాసురమైన కొండపలి బందరు రాజమహేంద్ర సీమలన్
నీ సరిదాత లేడనుచు నేటుగ నెంచితి బంధుకోటిలో
భాసిలు నొడ్డెపూడి కులపావన! అక్కనరెడ్డి ధీమణీ!

క. యాచకులరాకఁ జూచియు
బూచీయని బెగడి పాటిపోయెదు నా యీ
నీచుల వేడఁగఁ బోవను
ఆచార్యునితోడు పెద్ద యక్కనధీరా!

## లక్కిరెడ్డి పుల్లారెడ్డి

సీ. చండప్రతాపదోర్దండ సంభృతభూమి
మండలపాలనా ఖండలుండు
చండాంశుతను భవోద్దండవిశ్రాణన
ఖండితబుధనిస్వమండలుండు
చండీశకుండలాఖండల సంపూర్ణ
పాండిత్యరేఖాపిచండిలుండు
పుండరీకాండజ డిండీరమండల
మండితసత్కీర్తి మండనుండు
లక్కిరెడ్డి కులాంభోధి రాజసముఁడు
సోమ గౌడాగ్రజుండు సత్పూరి వరగుఁ
డాశ్రిత కవీంద్ర పోషకుఁ డట్టిపుల్ల
రెడ్డి గీర్తింపఁ దరమె మారెందుఁ జూపి

సీ. త్రిభువన భవనంబు లభవప్రసాదంబు
నలన నిర్మించి తా సలలితముగ
నేడి నేలుపుఁ బట్టి వేయి కరంబులు
సానఁ దీర్చితివౌర సరసముగను
కాళికాంబాపాదకమలంబులకు భక్తి
ప్రాజలు సల్పితి శాందుగాను
సౌవర్ణభూషణ సారవస్తువు లెల్ల
లక్షితంబుగాఁ జేయు లాఘవంబు
లహహా! కానీకు సోమ కులాబ్ధిచంద్ర!
రమ్యగుణసాంద్ర! నీ కీర్తిరహిఁ జెలంగె
ఘనమఁడపుల్లయ! కవిబృంద కల్పతరువు!
నిన్ను వర్ణింపఁ దరమె వాణిపతి కైన.

## ధరణికోట ధనంజయుఁడు

పదుమూఁడవ శతాబ్దిలో ధరణికోటను బాలించిన వారిలో నీతఁడొకఁడు.

చ. అమలపయోధిఁజంద్రుఁ డుదయం బగు నట్టులఁ బోలె వారిజా
తముశ విరించి పుట్టిన విధంబునఁ గాంచనధారుణీధరేం
ద్రమున సురావనీజముదితంబయి యొప్పుగతిం జతుర్థ వం
శమున జనించె నుగ్రరిపుసైన్య జయుండు ధనంజయుం డిలన్.

## రాజేంద్రచోడుఁడు

చ. ఇల వెలనాటి గొంకవసుధీశ తనూభవుఁ డైన చోడభూ
తలపతి చోడపట్టము ముదంబునఁ గట్టి భుజాబలంబునన్

గొలని జయించి యందు రిపుకుంజరు భీముని జంపె నాంధ్రభూ
తలము పడాఱువేలు సరసస్థితి నేలె సురేంద్రు లీలలన్.

## కాటయ వేమన

ఈతఁడు పదునాలుగవశతాబ్దిలో నున్నవాఁడు. కొండవీటిని పాలించిన కుమారగిరిరెడ్డి మంత్రియగు కాటయవేమన యీతఁడే నేమో తెలియదు.

ఉ. మానుష దానమాన బలమానిత ధర్మరమామనోజ్ఞ రే
ఖానుతి భూతివిత్తములఁ గాటయ వేమన పోలు వాసవి
న్వానివిరోధి వానివిభు వానివిపక్షుని వానియగ్రజు
న్వానిమఱంది వానిసుతు వానియమిత్రుని వానిమిత్రునిన్.

ఉ. రాజులు వేశ్యలైరి సమరంబున కోర్వక వీరనామ! నీ
రాజితవిక్రమస్ఫురణ రాజులమిండఁడు వేమఁ డంచు రే
రాజు మనంబు కందె దినరాజునకు న్మది వెచ్చఁ బుట్టె గో
రాజు తృణంబు మేసె ఫణిరాజు శిరంబుల వంచె సిగ్గునన్.

## జగదేవభూపతి

మ. జగలోభు ల్మలభాండ విగ్రహులు గంజాతిండిలఁడీలు మొం
డిగులాము ల్మగలంజ లాగడపు కైడైల్ ఘోరశ్రూరాధము
ల్దగిడీ లుండఁగ నేమి యర్థులఁ గృతార్థత్వంబు నొందింతు రే?
జగదేవక్షితిపాల రాణికులతేజా! దీనకల్పద్రుమా!.

## వెలుగోటివారు

ఉ. ఖేటవిఘాటభాంపథనగేద్ధయపుంగవపున్నగద్వన
త్రోటికరుజ్జటేనటవిఘూర్జటినత్కరటీపటీరరు
గ్వాటి హసించి మించె బుధవర్ణిత! నీయశోవఘాటి వె
ల్గోటికుమార మాచనృపకుంజర! కుంజరవైరివిక్రమా!.

ఉ. గొబ్బురిజంగరాజు లోకకోటియు డెబ్బదికోట్లనాకరీ
జబ్బలు, లక్షమీఁదఁ బది మార్గురు రావిలవెంక లైనమా
నిబ్బరగండ మాచక్షోణీపతిముంగటు నిల్వ శక్తులే
కబ్బిలు లేక, బెబ్బులిముఖాముఖి మేఁకలు నిల్వనేర్చునే?

క. ఇయ్యకొ పదవించుకొనే
కొమ్ములు కాలంజతొత్తుకొనుకులు దొరలా?
యియ్యంగ నేరుతు పర్థికి
వెయ్యారులు మాచభూప! విమతదిలీపా!.

సీ. ఘరసుధారసుధాసుధాధారకవళికా
వళికాళికాకారకలిత మగుచు
మవరమావరమారమామానుజలవలీ
లవలవలీలీల లవని మెఱయ
శరతుసారతుసాతుసాసారలవసితా
వసితాసితాతారఫణిసమంబు
శరపశారవశాపశాశాంతభగణితా
గణితాణితాతారకాపథంబు
ఖగముఖాగముఖాముఖాఖాగమగుచు
హరిపురారిపురాపురారాతినితియు.

భవనభారసభాసభాభవ్యముగుచు
యశేము, శము, ముసమొదవు యాచాధిపతికి.

ఉ. కోటలునుగ్గునుగ్గు, మదకుంజరపంక్తులు పిండిపిండి, చెం
డీపెలు పొట్టుపొట్టు, పొగరెక్కుహయంబులు చెక్కుచెక్కు, నీ
ధాటికి సాటి లేదు వసుధాతలనేతల నెంచి చూడ వె
ల్గోటికులాబ్ధిచంద్ర! నృపకుంజర! బంగరుయాచభూపతీ!.

ఉ. శ్రీదరహాసకారణవిశేషవిలాసజనార్ధనానుకం
పాదరలబ్ధకీర్తిజితహారతుషారపటీరహారకా
కోదరకాంతి యాచనృపకుంజరు లేలెదుపర్విసీమలో
నీదర మానివాసము మదీయనివాసము యాచభూపతీ!

పైపద్యము మంచళ్లకృష్ణకవి, ప్రభుదర్శనమున కేగి నప్పుడు చెప్పినది.

## యాచమనాయని నిర్యాణము.

శా. శ్రీరంజిల్లఁగ శాలివాహశకమద్రిశ్రోత్రసప్తేందుసం
ఖ్యారక్తాక్షిసమాదిసప్తమిని దివ్యస్ఫూర్తి వెల్గోటిబం
గారేచేంద్రకుమారయాచమణిమోక్షస్థానముం జేరె ముక్
శ్రీరాముండు వికుంఠధామమున కర్థింబోవుచందంబునన్.

మ. భువి నీడెంతుఁ గుమారవంచవిభుతో భూతిప్రభావైభవా
హవతేజోధృతిచిద్విలాసుసుకళా యాదార్యశౌర్యంబులన్
భవు భానున్ భిదురాస్త్రిభీష్మభుజగప్రత్యర్థిభూర్యద్రిభే
ద్భవు భైమేశ్వరు భోజు భామ భరతు న్భందీరు భర్గాత్మజున్.

ఉ. భండనభీమ కృష్ణ నిజవైరినృపాలుర నిల్చియు న్బలహ
న్మండలపుండరీకహరినాకనివాసులు పాటియు న్బ్రహ

న్మండలపుండరీకహరినాకనివాసులు వచ్చిరయు న్మృహ
న్మండలపుండరీకహరినాకనివాసులు చిత్ర మిద్ధరన్.

ఉ. తారసితారవిందనగతారశతారశతారతారని
స్తారపటీరహీరఘనసారతుషారతుషారచంద్రికా
పూరమరాళికాశపరిపూర్ణసుధాకరచారుమల్లికా
వారఫణీంద్ర శైలరిపువారణకాంతుల నెంతు కీర్తిచేన్.

ఉ. కారిమి రామకృష్ణ నృపకుంజర! నీదుయశంబు పైకొనన్
వారిజగర్భునారి పురభంజనునారి కుముద్వతీవిభు
న్నారి మఘారి మిత్రగృహనారియు నిల్వఁగ లేక భీతిమై
చేరె జనాళిభోగినుల శ్రీపతిపాద మపారమారమున్.

మ. జగతి న్నీదుమహోఘున ప్రబలరాజత్కీర్తి శాసించె నె
న్నగ నాగారి నగారినాగ నగభిన్నాగారి నాగంబుఁ బె
న్నగనాగారినగారినాగనగభిన్నాగారి నాగంబులన్
దగ నైరేభసృణీ! ఘృణీ! గుణమణీ! దానప్రధానాగ్రణీ!.

సీ. మదవిద్విరోధుల మెదడు బోనముఁ జేసి
ప్రత్యర్థిదంతము ల్పప్పుఁ జేసి
కుటిలారిమాంసంబుఁ గూరగాయలు చేసి
వైరికండలు పిండివంటఁ జేసి
ఉగ్రాహుతులగుండె లూరగాయలు చేసి
శత్రుబాహులను బచ్చళ్లు చేసి
అరిరాజరక్తంబు నానబాలుగఁ జేసి
నిష్ఠురారుల క్రొవ్వు నెయ్యిఁ జేసి
మొనసి నీఖడ్గభేతాళ ముఖ్యులకును
విందుఁ జేతువు సంగ్రామ వీథులందు

సమర నిశ్శంక! రేచర్ల శాసనాంక!
దీపితాటోప! వెల్గోటి తిమ్మభూప!

### వత్సవాయ జగపతి భూపతి

ఉ. ఆయతవత్సవాయ సుకులాంబుధి పూర్ణనిశాపతీ! జగ
ద్గేయశుభాకృతీ! విదితకీర్తిసతీ! కమనీయయౌవన
ప్రాయనిలాకృతీ! సతతవైభవనిర్జిత పూర్వదిక్పతీ!
ధీయుతవాక్పతీ! జగపతీ! నృపతీ! సుకృతీ! మహోన్నతీ!.

### పెమ్మసానివారు

సీ. చూచెనా! యొకవింత సుముఖుండై కవులకు
నాకార నూటపదాలు లిచ్చు
మాటాడెనా! బలే మన్నీలమిండం డిం
పార వేనూటపదాలు లిచ్చు
నవ్వెనా! యొకమాలు నాయకారత్నంబు
చక్కంగా లక్షలసంఖ్య నిచ్చు
సంతోషపడియెనా! సకలార్థిపోషకుం
డలుదుగాం గోట్లపర్యంత మిచ్చు
మెప్పు లెన్నంగం దరమా నె? మేలు! మేలు!
బళి! బళీ! యన జగతిలోం బరంగి తౌర!
యవుర పెమసాని యక్కపార్థివకుమార!
మన్నె దేవేంద్ర! నరసింహమండలేంద్ర!.

సీ. సత్కావికృతకావ్య శారదాదేవికిం
బాయకుండెడు రచ్చపట్టు భట్టు

జయలక్ష్మి వరియింప సమరశూరులఁ జేయఁ
బ్రస్తుతింపఁగ వాతరట్టు భట్టు
మంగళపాఠకమహితనామముఁ దాల్చి
విభుశుభంబులవీఁదిబెట్టు భట్టు
రాజచర్యలకీర్తిరమణి స్వర్గం బను
మేడపై కెక్కింప మెట్టు భట్టు
గానవిూనంటిసత్కీర్తికాము లైన
పార్థివావళిభట్టుఁ జేపట్టవలయు
నాహవోపేంద్ర! పెమ్మసాన్యన్వయేంద్ర!
నయగుణసాంద్ర! చినతిమ్మనాయ నేంద్ర!.

## మాకనృపతి

ఉ. మేలిమితోడఁ బద్రిపుల మెట్టుచు రెక్కలగాలిచేతఁ బా
తాళముఁ దూలఁ గొట్టుచును తారలమట్టును నీదు పేరముం
గూళకుమార! మాకనృపకుంజర! శూరనృపాల! ధీర! నీ
సాళువపిట్టతోడ సరిసాటియె తక్కినయారపిచ్చుకల్.

## కంబనృపాలుఁడు

ఈతఁ డుదయగిరి దుర్గాధిపతి

సీ మనుషాకమాటాడి వెనుక నిల్వఁగ లేని
నరనాథులను బొమ్మ చరిచినాఁడు
తాను మాన్య మొసంగి నే నీయ నని పల్కు
మూర్ఖులశిరముల మొట్టినాఁడు
యెవ్వ రేమడిగిన నీయఁ జాలనియట్టి
పృథ్వీశులకుఁ బొమ్మఁ బెట్టినాఁడు

స్వామికార్యములందు జాడ్యంబు లెన్నిన
మన్నీలముఖములఁ బన్నినాఁడు
యితనిసమ మెన్న జగతిలో నెవ్వ రీడు
ఉదయగిరిదుర్గసంరక్షణోన్నతుండు
నయగుణోదారచిన్నమల్లయకుమార
కంబనికిఁ బోల్ప దాతలు గలరె ధరణి?.

క. కోటికిఁ బెట్టినయన్నము
పూటనె జీర్ణించుఁ గీర్తి పోదు ధరిత్రిన్
నాటుకొని కఱవు నిలువదు
మాటయొకటె నిలుచుఁ జిన్నమల్లయకంబా!

## దామర వేంకటపతి

క. శ్రీదామరవర వేంకట
భూదారక! రూపభాగ్యభోగావనముల్
శ్రీదామరవర వేంకట
భూదారక నిన్నుఁ గాక పొందునె యొరులన్.

## వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు

ఈకమ్మప్రభువు మహాదాత. పదునేడవశతాబ్దిలోఁ దెలుఁగుదేశమునఁ గొంతభాగమును బాలించినవాఁడు. ఈతని రాజధాని కృష్ణాతీరముననున్న యమరావతి. ఆకాలములోఁ బచ్చెపువాండ్రను నొకజాతివాండ్రు దారిదోఁపుడుగాండ్రయి జనులను మిగుల బాధించుచుండిరి. వారిలో ననేకులను వేంక

టాద్రినాయఁడు బహుప్రయత్నమునఁ బట్టించి, తలారులచే వారితలలు నఱికించి జనులకుఁ జోరభీతిని మాన్పెను. ఈప్రభువు యొక్క దానమునకు మితిలేదు. త్రాసునందు తానొకప్రక్కఁ గూర్చుండి రెండవప్రక్కనఁ దనతూకమునకు సరిగా బంగారము వేయించి—తులాభారముఁ దూఁగి—ఆబంగారము నంతయును విప్రులకుఁ గవులకును దానముఁ జేసెను. భూలోకదేవేంద్రుఁ డనుపేరుఁ బొందెను. అమరావతి, వైకుంఠపురము మొదలగు ననేకగ్రామములను గట్టించెను. ఈ వేంకటాద్రినాయఁడు నింద్రునివలెనే యమరావతి కధినాథుఁడై నందవనముఁగూడ ప్రతిష్ఠించెను. ఈతఁడెన్నియో దేవాలయములను కట్టించెను. ఈపుణ్యపురుషుని గుఱించిన చాటువు లనేకములు గలవు. అందుఁ గొన్నిమాత్రమే దొరకినవి.

సీ. శ్రీకృష్ణవేణికిఁ జెలు వొప్పఁ బడమర
సిరిఁ దేజరిల్లు లక్ష్మీపురంబు
ఆయూరికుత్తరం బతిరమ్యమైనట్టి
కుదురైన భైరవగుట్ట కలదు
పశ్చిమభాగానఁ బరభయంకర మైన
సొరొప్పు మేదరసాల కలదు
దక్షిణమ్మున నీదు తల్లి పేరిట నొప్పు
ప్రేముడి యచ్చమ్మపేట గలదు
మేటిరాజులు మన్నీలు మిమ్ముఁ గొలువ
గజతురంగంబు లిరుగడఁ గదిసినిలువ
వసుధఁ బెంపొందితివి భళీ! వాసిరెడ్డి
వేంకటాద్రీంద్ర! మన్యహం వీరచంద్ర!.

శా. ఏకి నీవలెఁ గీర్తిఁ గాంచినధరిత్రీశుల్ జమీందార్లఁ గా
శ్రీరామేశ్వరమధ్యభూమిని నరశ్రేణి న్విచారింపఁగా
సారాచారతఁ గాంచిరో ప్రజలకిష్టాన్నంబుఁ బెట్టించిరో?
ధీరాగ్రేసర! వేంకటాద్రినృపతీ! దేవేంద్రభాగ్యోన్నతీ!.

మ. వరహాల్కాసులభంగి సేలువలు కంబళ్లట్ల రూపాయలు
నమ్మజే గవ్వల్బలెఁ గంకణంబులు తృణప్రాయంబుగా నిచ్చి బం
గరుపళ్లెంబులఁ బాయసాన్నమును లక్షబ్రాహ్మణాపోశనం
బర లేకిత్తువు వాసిరెడ్డికులదీపా! వేంకటాద్రీశ్వరా!.

శా. కానీనప్రతిమానమూర్తివని వక్కాణింతు నిన్ధాత్రి గీ
ర్వాణస్తోమము లెన్నఁ బ్రత్యహము సాలగ్రామగోదానభూ
దానాన్నప్రతిపాదనార్థ లిడి శీతక్షోణిభృత్సేతుమ
ధ్యానూనాంబుధి మేఖలాస్థలి సమాఖ్యం జెంది తీవే గదా
భూనాథావళి వేంకటాద్రినృపతీ! పూర్ణప్రభావాకృతీ!.

సీ. ధాత్రీసురప్రీతి ధనతులాభారంబుఁ
దూఁగ నే భూపతి తూఁగఁ గలఁడు?
నవరత్నకీలితనవ్యకిరీటంబు
మించి యేరాజు ధరించఁగలఁడు?
పదినూర్ల శిరముల ఫణిరాజుపై శౌరి
లీల నేపతి పవ్వళింపఁ గలఁడు?
చతురిభరాజితస్యందనారూఢంబుఁ
జక్కఁగా నిక నేరు సల్పఁగలరు?
అతఁడు రాజశిఖామణి ధృతిసురాద్రి
కనక నేతత్ప్రకారప్రకాశుఁ డగుచు
వసుధఁ బేరొందె నౌరౌర వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డతులపృథ్వీవరుండు.

సీ. ఇంతి యీధీరుఁ డాయింద్రుఁడుఁ గాఁబోలు?
నింద్రుఁడుఁ గాఁడే యో యిగురుబోఁణి!
కాంత! యీధీరుండు కర్ణుఁడుఁ గాఁబోలు?
కర్ణుఁడు గాఁడే యోకంబుకంఠి!
మగువ! యీధీరుండు మదనుండు గాఁబోలు?
మదనుఁడుఁ గాఁడే యో మందగమన!
సుదతి! యీధీరుండు సోముఁడు గాఁబోలు?
సోముఁడుఁ గాఁడే యోసుందరాంగి!
ధర పురందరుఁ డొకో? సుధాకరుఁడొ? నరుఁడొ?
తరణిసూనుండొ? వరధర్మతనయుఁ డొక్కొ?
పరమదనకోటి లావణ్య వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁడే కదే! పంకజాక్షి!.

చ. గుణనిధి! వేంకటాద్రినృపకుంజర! నైభవధీ! భవత్సుధీ
జనకరవంశజాతముల శత్రుమదేభనికాయసద్వధూ
గణనయనాండజాతములఁ గారణజన్ముఁడ వౌటచేతఁ గం
కణములు నిల్పఁ గా నొకటఁ గల్పనఁ జేసితి వెంతచిత్రమో?

ఉ. అర్థికి నీవొసంగినపదార్థము భోజనవస్త్రధర్మకా
మ్యార్థములౌ త్వదన్యవసుధాధిపు లిచ్చుపదార్థము ల్నిశా
తీర్థమరీచికామ్లరసదివ్యముఖాదులు నానో! కావో! స
త్పార్థివ! వేంకటాద్రివసుధాపతి! నూతన మన్మథాకృతీ!

క. అమరావతి యమరావతి
అమరఁగ నింద్రుండు వేంకటాద్రీంద్రుండే
అమరులు గోత్రామరులే
కమనీయము నందనంబు ఘననందనమే.

చ. హితమతి వేంకటాద్రివిభుఁ డేలెడు నయ్యమరావతీపురిన్
గ్రతుభుజు లన్నవస్త్రములు గాంచ రొకప్పుడుఁ బూర్వదేవతా
హితమతి; వేంకటాద్రినృపుఁ డేలెడు నీయమరావతీపురిన్
సతత సమస్తవర్ణులును జక్కఁగ గాంచుదు రన్నవస్త్రముల్.

సీ. ఏరాజు కట్టించె నెలమితో నమరావ
తీపురప్రాకార గోపురములు
ఏరాజు ఘటియించె హితభద్రగిరి కేళి
కుంభధ్వజస్తంభ గోపురములు
ఏరాజు రచియించె భూరివైకుంఠపు
రస్తంభవరగోపురాలయములు
ఏరాజు నిలిపెఁ బొన్నూరుపట్టణ ధర్మ
కూటధ్వజస్తంభ గోపురములు
మేటిబాపట్ల గుంటూరు మోటుపల్లి
చింతపల్ల్యాదికుండిన సీమఁ గొన్ని
యూళ్ల నేతత్ప్రతిష్ఠల నొనరఁ జేసె
నతఁడు శ్రీవేంకటాద్రీంద్రుఁ డతులయశుఁడు.

సీ. ఏరాజు వాకిట నేప్రొద్దు గృష్ణాన
దీదివ్యతిలకంబు తిరుగుచుండు
నేరాజు హృదయమం దింద్రప్రతిష్ఠితుం
డమరేశ్వరేశ్వరుం డమరి యుండు
నేరాజు కెదుట గా నీప్సితార్థము లీయ
వైకుంఠపురిశౌరి వరుస నుండు
నేరాజు నెడఁబాయ కేవేళఁ గేళికై
రాజ్యలక్ష్మియు హృష్టిఁ గ్రాలుచుండు

నట్టిరాజును వినుతింప నలవి యగునె ?
రాజమాత్రుం బేటుం బనరాదు గాని
వేంకటాద్రీంద్రుఁ డెంచును వినుతి నేయ
నలయు శ్రీవాసిరెడ్డి సత్కులజమణిని.

మ. సుమబాణాకృతి ! వేంకటాద్రినృపతీ ! సంభృత్ప్రతాపాఢ్య ! నీ
యమరావత్యమరేశ్వరోన్నతసువర్ణాంచన్మణీగోపురా
గ్రము మెన్నన్ ద్విజరాట్కళ ప్రథమదృక్ప్రాప్తి ప్రసిద్ధిం గాంచి కా
ర్యము కాదంచును నిల్చెఁ గాక గగనం బంతంతకు న్మించదే ?.

మ. క్షయసంవత్సరమాఘశుద్ధశుభచంచద్ద్వాదశీజీవవా
రయుతశ్రేష్ఠపునర్వసుప్రథమసద్రాశిం దులాభారమే
నయశీలుం డమరావతీపురములోన న్దూఁగి నానార్థిసం
చయహర్షాప్తి ధనం బొసంగెఁ గవు లెంచన్ వేంకటాద్రీంద్రురీ
తి యనంగాఁ దగి వాసిరెడ్డికులము న్దేజంబుఁ జెన్నొందఁగన్.

ఉ. ఎన్నివనంబు లెన్ని కృతు లెన్ని సురార్చన లెన్ని దేవళా
లెన్ని సువర్ణగోపురము లెన్ని తటాకము లెన్ని బావు లె
న్నెన్ని పురంబు లెన్ని కల వెన్నిక ధర్మము లెన్న ధాత్రిపైఁ
బన్నినవేంకటాద్రివిభుపాటినృపాలుఁడు లేఁడు చూడఁగన్.

క. శ్రీవాసిరెడ్డికులభవ
పావనుఁడై వేంకటాద్రిపతి భాసిల్లెన్
గేవలవాగ్దీపశిఖా
వ్యావృతకలధౌతకుంభితాహిమకరుఁడై.

ఉ. తద్దయు వాసిరెడ్డికులధన్యుఁడు వేంకటనాయఁ డర్థికిన్
గొద్దిగ నిచ్చె నేని నృపకుంజరు కొక్కని పెండ్లి కౌ నహో
గద్దరి మేదినీశ్వరులు కద్దని యిచ్చినయీవి పూటకుం
జద్దికిఁ జాల దాయె నృపసందడి దాతల నెన్న దోసమే?.

చ. కమలజుఁ డుర్విపైఁ గవులఁ గాయకుల న్సృజియించి కల్పభూ
జమును సృజింపనైతి నని చక్కఁగఁ జక్కనివాసిరెడ్డిజ
గ్గమహిపవేంకటాద్రినృపుఁ గారణజన్ము సృజించెఁ గాని చో
నమితవిహాయితాత్మమతియై చెలువొందునె ? చిత్రవైఖరిన్.

సీ. "సర్వబుధశ్రేణిసంతరింపఁ దలంచి
గగనావతీర్ణమౌ కల్పకంబు"
"కల్పకం బది గాదు కవిచాతకావళిఁ
బ్రేమతోఁ బ్రోవఁ గాన్పించు ఘనుఁడు"
"ఘనుఁడుగాఁ డితఁడు సజ్జనచకోరావళిఁ
గరుణింపవచ్చు రాకావిధుండు"
"విధుఁడు గాఁ డితఁడు కోవిదజనాధారుఁడై
పేరు లీయవచ్చు నిక్షేపమూర్తి"
యనఁగ విలసిల్లి తౌర ! జగ్గావనీంద్ర !
లక్ష్మమాంబాతనూజ ! సద్రాజతేజ !
వాసిరెడ్డ్యన్వవాయసద్వార్ధిచంద్ర !
ధీరగుణసాంద్ర ! వేంకటాద్రిక్షితీంద్ర !.

క. భూపతి మతిజగతీభృ
ద్భూపతి శ్రీవేంకటాద్రిభూపతి క్రౌంచ
ద్వీపాకృతిఁ దగు శిఖర
స్థాపితహరినీలఘటితతారాపథమై.

శా. సద్వర్ణాంచితహేమపాత్రతతితో సత్రంబులోన న్విశి
ష్టాద్వైతప్రముఖద్విజావళికి మృష్టాన్నప్రదానోక్తి న్వివే
కాద్వైపాయను లిందు వచ్చి రనఁగాఁ గాన్పించుతన్మన్వతీ

స్ఫురద్వైచిత్ర్యగుణక్రమప్రతతిభాస్వచ్ఛంద్రికాశోభక్రాం
చద్వీపం బమరావతీపురము వీక్షాసక్తిఁ జూడఁగన్ సగన్.

సీ. అంజనాచల మీనఁ గంజోద్భవాండంబు
నిండారురానడగొండ లనఁగ
భానుబింబంబుపైఁ బగలు సాధింపఁగా
గోరాడుచీకటిగుంపు లనఁగ
కవిదర్శనాపేక్షఁ గదలి వచ్చిన గజా
సురగోత్రదానవస్తోమ మనఁగ
వింధ్యశైలస్థలి వెడలి కృష్ణాస్నాన
వాంఛాగతేభరాడ్వర్గ మనఁగ
వెలయునమరావతీపురి వేంకటాద్రి
విభుమనోభీష్టసంచారవీథిఁ దలఁచి
తీర్థవాసంబు గావునఁ దిరుగులాడుఁ
దత్పదావళిమత్తదంతావళములు.

సీ. విబుధేంద్రసేవ్యమై వెలయుఁగాంచనగంబు
సలలితవేంకటాచలము గాఁగ
ఆశ్వీజశుద్ధమహానవమ్యాగతుల్
బ్రహ్మోత్సవాగతప్రజలుగాఁగఁ
బారమార్థికహోమపాత్రాన్నభుక్తియే
తనరఁ దీర్థప్రసాదంబుఁ గాగ
శ్రుతగజస్యందనారూఢోత్సవోన్నతుల్
దివ్యరథోత్సవస్థితులుగాఁగ
విశ్వసత్త్వాంసహోస్థలావిర్భవంబు
తిరుపతిస్థల మమరావతీస్థలంబు

వన్నెఁ జెలువొంద విలసిల్లె వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రనామపృథ్వీవరుండు.

ఉ. అక్కడవేంకటాద్రివిభు నద్భుతచర్యలు చూచి వచ్చి తా
నిక్కడఁ గూర్చెఁ బండితుల నిద్దటి లోపల వాసిరెడ్డివా
రెక్కడ ... ... ... యుప్పలపాటివారిగిరా
జెక్కడ నక్క యెక్కడ న దెక్కడ నిర్జరలోక మెక్కడో?

వేంకటాద్రినాయఁడుగారి యాస్థానమునకు బుచ్చివెంకన యనునొక కవి యొకగ్రంథమును వ్రాసికొనివచ్చెనఁట. ఆతని కులమున గొంచెము కళంకము గలవాఁడఁట. ఆవిషయమును కొంచెమెత్తి యాస్థానములోని యొకకవి ప్రభువుగారి యభిప్రాయము నిట్లు తెల్పెను.

గీ. కులమునఁ గళంకు కల దనుకొంచుఁ గొంకుఁ
గేలిఁ గావించి కంకున కేలఁ గొంకుఁ
గవనమున జంకు నీమీఁదఁ గాదు బొంకు
బుధజనాటవ్యటవ్యంకు బుచ్చివెంకు.

తరువాత వేఱొకకవి లేచి—

క. కొంకక తమరాడినయది
బొంకేలగు వేంకటాద్రిభూపాలక యీ
వ్యంకేల వానికిం గల
రంకే యిచ్చోట నిల్వ రసవంత మగుణ్

అనెనఁట దానికా కవి యిట్లు పలికెనఁట

ఉ. పన్నిన సత్ప్రబంధమున బాసను నోగునుఁ జూడకీసుచే
మన్నన మాలి మాకులము మాటఁ దలంతురె? చేమకూరి వెం
కన్నకు లోపమేమి? కులమా కవనానకు వేంకటాద్రిరా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచిన నాకుఁ జాలదే?

వేంకటాద్రినాయఁడు గారిపై నేఁవొక కవి చెప్పినది.

గీ. వైభవోద్దాముఁ డైనట్టి వాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డర్థార్థి వితతి కొసఁగు
నొక్కపూఁట వ్యయంబు లీ తక్కినట్టి
రాజకోటికి నొకయేఁటి భోజనంబు.

ఈపద్యమును రచించినకవి రాళ్లబండి పట్టాభిరామ రాజను బట్టనియు, (ఇతఁడు మలరాజువారి యాస్థానకవి. ఇతఁడు కృష్ణాస్నానమునకై యమరావతి కేగినప్పుడు వేంకటాద్రినాయఁడు గారిని దర్శించి చెప్పె ననియు—ఈవిషయము నెఱింగి మలరాజు వేంకటగుండారాయణంగారు రౌద్రమూర్తులై "మనయుప్పు పులుసుతోఁ బెరిగి సాటివాని నట్లు వొగడిన యాకృతఘ్నుఁడు మనదేశములో నడుగుఁబెట్టె నేని ఫిరంగితోఁ గాల్చుఁడు" అని తమసైనికుల కుత్తరువు జేసి రనియు—ఈ సంగతినంతయు విని యాబట్టు వేంకటాద్రినాయఁడుగారి వద్దనే యమరావతిలోనే యుండి తరువాత కొలఁదికాలమునకే పరలోకగతుఁ డయ్యెననియు వినికి గలదు. అచటనుండియే

ఆ. వె. వెలమదొరలపొందు వేయేండ్లు చేసినఁ
గాసువీస మెనఁ గానరాదు

మెచ్చె నేని మంచిముచ్చటఁ జెప్పును
అడిగె నేని ప్రాణహానిఁ జేయు.

అను పద్యమును వ్రాసెననియుఁ గింవదంతిగలదు.

## జూపల్లి ధర్మారాయఁడు

ఈరపరాజు, సూరపరాజు ననునిరువురుకవులు జతఁగూడి ధనసంపాదనకు బయలువెడలిరఁట. వారు దేశసంచరణంబుచేయుచు, నొకనాఁ డీ ధర్మారాయఁ డుండుగ్రామముఁ జేరిరి. ఇద్దఱు నొకచోటికే పోవుట యుక్తముకా దని తలంచి, యీరపరాజుమాత్రము ధర్మారాయనిదర్శనమున కేఁగెనఁట. సూరపరాజు వేఱొకచోటికిఁ బోయెనఁట. ధర్మారాయఁడు కవిని సమ్మానింపలేదఁట. వీరిరువురును, తమబసకు చేరిన తర్వాత, సూరపరాజు రెండవకవి నిట్లడిగెనఁట.

క. జూపల్లిధర్మరాయం
డేపాటిధనం బొసంగె? నీరపరాజా!

అనఁగా నీరపరా జిట్లు సమాధానమును జెప్పెనఁట.

పాపాత్ముం డెవ్వరికిని
చూపనిదే చూపె నయ్య సూరపరాజా!

ధర్మారాయనిఁ గూర్చిన మఱికొన్ని చాటువులు.

చ. ఎఱుఁగనివానిఁ గోటఁ జొఱనీయఁడు నేర్పున జొచ్చె నేనియుఁ
దొరకదుముఖమ్ము దొరకెఁబడి దుర్లభ మట్లు లభించె నేనియుఁ

మెరువడి విద్యలేకకడు మెచ్చఁడు మెచ్చక యీవి నీఁడయా
సురగురునంతవానికిని జూపలిధర్మని వేఁడఁ బోయినన్.

శా. నే నాకాశతరంగిణిన్ ధరణిలో నీవెవ్వరే? నావుడున్
నేనా! జూపలిధర్మభూవిభుని పాణిన్ బుట్టుదానాపగన్
నీనాయంతర మేడ కేడ? యవులే నీవేడ నేనేడ పో
నేనా యాచకపాదజాతనటవే? నే దాతృహస్తోదితన్.

## మల్కిభరామ్

ఈతఁడు తురుష్కప్రభువు. ఈతని సరియగు నామము మలిక్ ఇబ్రాహీమ్. ఈతని తురుష్కుఁడైనను తెలుఁగుభాష యందు రుచిగలవాఁడు. ఒకటి రెండు గ్రంథములనుఁగూడ కృతి నందెను. ఈతఁడు పదునారవశతాబ్దిలో నాంధ్రదేశమునకుఁ బ్రభువుగానుండెను. ఈప్రభు వొకనాఁడు "ఆకుంటే, ఈకుంటే, మీకుంటే, మాకుంటే" యని సమస్య నొసంగఁగా నప్పు డచ్చటనే యుండిన యొకకవి యిట్లు పూరించెను.

క. ఆకుంటే వృక్షం బగు
నీకుంటే లోభియౌను హీనాత్ముం డౌ
మీకుంటే మా కిమ్మా
మాకుంటే మేము రాము మల్కిభరామా!.

సమస్యాపూరణమునకు సంతోషించి మల్కిభరామ్ ప్రభు వాకవికి బహుమాన మొసంగెనఁట.

## మహమ్మద్ భేక్ సాహెబు

ఇతఁ డొకచిన్న జమీనుదారుఁడు. ఇంచుకయుదార భావముఁ గలవాఁడు. ఒకనాఁడు ప్రసంగవశమున నొకబ్రాహ్మణుఁడు—"పూర్వము, మల్కిభరామ్ ప్రభువు కవులను మిగుల నాదరించి కృతులనంది బహూకరించి తన పేరు జగమ్మున నిలుపుకొని చనెను. సాహేబుగారూ! తమరును నవాబుప్రభువు లంతవారు గదా" యనెను. ఆమాటలకు సాహెబుగారుబ్బి "ఇప్పుడెవ్వరైన నాపైఁ బద్యమును వ్రాయుదు రేని, నూటపదియాఱులు బహుమతి నొసంగెద" ననెను. కవి గాకపోయినను సమయస్ఫూర్తిగల యావిప్రుఁడు భాగవతములోని యొకపద్యము చివరనసాహేబుగారి పేరు నీక్రిందిరీతిఁ దగిల్చి చదివి నూటపదియాఱు రూప్యములు గైకొనెను.

క. ఖిల్లీభల్లులులాయక
భల్లుకఫణిఖడ్గగవయబలిముఖచమరీ
ఝిల్లీహరిశరభకరికిరి
మల్లామ్భతకాకఘూక! మహమదు భేకా!.

## రావిళ్ల వారు

చ. ఎనయఁగ నెన్నిజన్మముల నేమిట నీశ్వరుఁ బూజఁ జేసిరో?
మనసిజుఁ గన్నతల్లియును మల్లనృపాలునిఁ గన్నతల్లియుఁ
దనరఁగ భోజుతల్లియును దానగుణుం డగు కర్ణుతల్లియుఁ
ఘనుఁ డగు రావిళ్లాన్వయశిఖామణి శేషనృపాలుతల్లియుఁ.

సీ. దురములో నరివీరకరిఘటంబులఁ గన్న
వీఁకఁ బారఁ బొడిచి వెన్నుఁ దన్ను
దుర్ధరశత్రుల దొడ్డనుఁ గనుఁగొన్న
గోరాడి కొమ్ముల గ్రుచ్చి యెత్తు
మార్కొన్న పగరాజు మున్నెగిత్తల నెల్ల
మానమూనము జేసి మగుడఁ దోలుఁ
గక్కసించెడు వైరి దుక్కిటెద్దుల నెల్లఁ
గురుమన్నెగిత్తల సరిపఁ గొనక
రంకె లిడు చుండు బసవనశంకరుండు
శంక సుంతయు లేక నిస్సంశయముగ
సమరరఘురామ! రావిళసార్వభౌమ!
వైరిహృద్ఘల్ల! యుద్దండవీరమల్ల!.

క. పిన్నమహీశుల పేరుల
నెన్నకురా భట్టు! దళము లెదిరించినచో
వెన్నిచ్చి పారిపోయిన
మన్నీలభుజంగు వీరమల్లఁడు ధాత్రిన్.

క. ఇచ్చెడువేళల రణమునఁ
జొచ్చెడువేళలను వెనుకఁ జూచినఁ బెద్దల్
మెచ్చరు వినుతిం జేయరు
రచ్చలఁ గవికోటు లెల్ల రావిళమల్లా!.

క. తెగి తాఁ బొడవని పోటును
తగ నర్థుల కీయనట్టి త్యాగము సభలోఁ
బొగడించుకొనుచుఁ దిరిగెడి
మగలంజలమగఁడు వీరమల్లఁడు ధాత్రిన్.

ఈ వీరమల్లన యొకకవికి మాన్య మిచ్చి, మఱల తానే కైకొనెనఁట. ఆసంగతి నాకవి యిట్లు వెల్లడి చేసెను.

ఆ. వె. తోడబుట్టినదానిఁ దొలుతన మను విచ్చి
వయసు వచ్చువెన్క వలచినట్లు
రమణ మాన్య మిచ్చి రావిళమల్లన్న
కమతమందు తానె కలుపుకొనియె.

## శాకమూరి యెల్లయజన్నయ

క. బాలుఁడు వెతలం బెట్టినఁ
దాళవలెఁ దల్లి యర్థి తగ బాధింపన్
దాళవలె దాత యితరుల
కేలా మఱి శాకమూరియెల్లయజన్నా!.

## గద్వాల ప్రభువులు

### సోమభూపాలుఁడు

క. గద్వాల సోమభూపా!
మృద్వీకప్రసవతుల్యమృదులాలాపా!
విద్వద్విసరదిలీపా!
సద్విద్యాభోజభూప! శాత్రవతాపా!.

క. నలుగురుఁ బలికిరి సరి యని
నలుగురు బలికిరి సురూపనయదానధరా
వలయధురాచరణోన్నతిఁ
బొలుపుగ గద్వాలసోమభూపాలునకున్.

## రామనృపాలుఁడు

శా. నిస్తంద్రప్రతిపక్షశిక్షకరణోన్నిద్రప్రతాపోజ్జ్వల
ద్దోస్స్తంభార్జితసర్వభూవలయదాతృత్వామరానోకహా!
అస్తోకాఖిలవైభవేంద్ర! కరుణాయాదోధినాథా! యశ
శ్శస్తప్రాభవ ముష్టిపల్లికులకంజాతార్క! రామాధిపా.

ఉ. చిత్రము ముష్టిపల్లికులశేఖర! రామనృపాల! నీయనిన్.
శాత్రవకోటి నీల్గి కులసంగసుఖం బెడఁ బాసి యాపయిన్
గోత్రవిఘాతిఁ బొంది పయిఁ గోరినసంపద లొందుఁ జూడ నీ
పత్రిమహత్త్వ మిట్టి దనఁ బాత్రు లిలన్ మహనీయులే చుమీ?

మ. భవదీయామలకీర్తిసన్నిభములౌ పర్వేందుపాండుచ్ఛద
ప్రవరప్రాగ్గజపంకజాతీనససపాథోధి పంచాస్యముల్
పవనాహారపతిప్రలంబరిపుసత్పంకేజము లొప్పఁగగో
ధవగద్వాలపురీశ రామనృప! విద్వత్కల్పభూమీరుహా.

సీ. శరదంబుధరకంబుహరిదంబరుల దూరు
ఘనమైన నీకీర్తి కామమూర్తి!
మేరుభూధరభూరిసారత న్నని గేరు
మహి నెన్న నీధైర్యమమలచర్య!
పటునిదాఘవిభాసి చటులార్యమునివాసి
మాయించు నీవిక్రమక్రమంబు
బలికర్ణదుగ్ధార్ణవముల వమ్ముగ డిందు
పఱచు నీదాతృత్వపటిమ హెచ్చు
కవిజనంబులు కొనియాడఁ గదనరంగ
చండకరవాల కోటిసంజాతవీతి

హోత్రశలభాయితాహితక్షాత్ర! ముష్టి
పల్లిగోత్ర పవిత్ర! సంపద్విచిత్ర!.

## ఆత్మకూరు సంస్థానాధిపతులు

### ముక్కర సీతారామభూపాలుఁడు

శా. జంభద్వేషణభోగ! నీదుయశమున్ జర్చింపఁగా స్వర్గవీ
శంభుద్యోద్రుమశంకరాలయ కుభృత్సర్పాధిరాడ్కాంతులన్
దంభంబు ల్సడలించుఁ గాక యనుచున్ దాశ్వర్యమా మాకు దో
స్తంభప్రాభవ! ముక్కరాన్వయజ! సీతారామభూపాలకా!.

శా. శ్రీయోషిత్కుచపర్వతాశ్రయము సచ్ఛృంగారగాంగేయకా
శేయప్రస్ఫుట విద్యుదన్వితము సుస్థేమప్రదాపాంగకో
చ్ఛాళియైకామృతవృష్టిదాయకము చంచత్కర్మతీశాభ్ర వి
కాయోత్పన్నసమాను ముక్కరకులక్ష్మాభర్తనుం బ్రోవుతన్.

క. శ్రీమన్ముక్కరసీతా
రామావనిజానికీర్తి రాజిలె ఘనమై
సోమహరిస్వర్గంగా
కామారిగజారిసీరి కంధుల కన్నన్.

శా. తారుణ్యాకర! ముక్కరాన్వయజ! సీతారామభూపాల! నీ
వైరిక్ష్మాపతి దారసంఘము కడుం బ్రాప్తాకులం బయ్యు వి
స్తారాక్షిద్వయ మందుఁ గంకణము లంచత్పాణియుగ్మంబునన్
ధారల్ గాఁ దిలకంబుఁ గూర్చుదు రహో! ధాత్రీజనుల్ నవ్వఁగన్.

ఉ. శరధిగభీర! ధీరహితసత్వవినిర్జితశత్రుభూప! భూ
పరహితకార్య! కార్యఫణివర్యసమానసుధీ! సుధీభరా

ద్ధిరిపరకీ ర్తి! కీ ర్తిరుహద్వృగ్వసరాంగజమూ ర్తి! మూ ర్తిదు
స్తరరణసోమ! సోమనృపసన్నుత! ముక్కరవంశపాలనా!.

## జన్నుపల్లి రామకృష్ణభూపతి.

సీ. ఘనమార్గోద్ఘుతధవళయశశ్చత్ర
గోపాయితాఖిలక్షోణితలుఁడు
ఘనదానమహిమ నిష్కాసితసంతాన
జీమూత బలిదైత్య శేఖరుండు
ధైర్యసంపల్లవ ధావిత మేరుమం
దరగంధమాధన ధరవరుండు
నిజపరాక్రమవహ్ని నిర్ఘోషితారాతి
పార్థివసందోహవార్థి యితఁడ
టంచు బుధు లెన్న వెలసితి వౌర జన్ను
పల్లివంశాబ్ధిచంద్ర! వైభవజితేంద్ర!
భరితభూభార! శంకరాంబాకుమార!
అసమశరరూప! రామకృష్ణావనీప!.

ఉ. చిత్రము రామకృష్ణనృపశేఖర జన్నలివంశదీప! నీ
శాత్రవకోటి పోరుటకుఁ జాలమి సాధ్వసమంది వేగ లో
కత్రయిఁ జొచ్చినన్ మిగులఁ గాకల విక్రమభానుఁ డేచి ని
శ్చత్రుల వీడి ఛత్రులను జాల తపింపఁగఁ జేసెఁ బూనికన్.

## వేంకటరమణప్ప

క. పొంకముగ దిశలఁ గప్పెను
వేంకటరమణప్పకీర్తి విశదభ్రభశ్రీ

పంకజభవ పంకజభవ
పంకజభవ పంకజారి పంకేజంబై.

క. సరసిజశశి శిశిరశర
చ్ఛరదశరము లోఁడెఁ దద్యశముసకు ధైర్య
స్ఫురణకు నవియే యోఁడెను
హరినుతి మగు తేజమునకు నవియే యోడెన్.

కచ్చి రంగయ్య

క. నలు గురు నినుఁ బలు మారున్
గెలిచితి సుగుణో క్తికాంతి కీర్త్యాకృతులన్
నలుగురు నినుఁ బలుమాఱున్
భళి! భళి! యనఁ గచ్చిరంగ! భాగ్యతరంగా!.

బారు వేంకన

క. వర బారు వేంకనార్యుని
ధర నిండినకీర్తి వెలసె ధరజిత్పురజి
ద్ధరధరజిత్పురిత్పురజి
ద్ధరజిత్పురజిత్తురంగ ధావళ్యంబై.

మల్రాజువారు

వీరునరసారావుపేటసంస్థానాధీశ్వరులు. మహాశూరులు. వెలమదొరలు, దాతలు, పండితులయందును గవులయందును నాదరముగలవారు. దిట్టకవి నారాయణకవికృతమగు రంగా

రాయచరిత్రమునకు:గృతిభర్త యీవంశోద్భవుఁడే.నరసారావు పేట నరసారాయణుంగారి పేరఁ గట్టింపఁబడినది. కావుననే గ్రామమున కాపేరే పెట్టఁబడినది. వీరియాస్థానకవి, రాళ్లబండి పట్టాభిరామ రాజనునొకబట్టు. సంస్థానపతులను గుఱించిన చాటువులు.

చ. "హరుఁ డనుకొంటిమా విషధరాభరణంబు ధరించు టేది? శ్రీ
హరి యనుకొంటిమా ఫణికృతాంతకవాహన మేది? వాఙ్మనో
హరుఁ డనుకొంటిమా సరసిజాసన మే"దని ధీరు లెంతు రీ
స్థిరతర మల్లరాడ్కులనృసింహుని వేంకటనారసింహునిన్.

మ. బలభిద్వైభవభీమరేఖ విలసద్బాహాబలప్రౌఢి కుం
డలిరాడ్వాండితి యత్నరాడ్తనుజసౌందర్యంబు దుర్గాధిప
త్యలఘుస్థేమము జానకీపతిసుదానాసక్తి మీ కిచ్చుఁ గా
కలరన్ శ్రీమలరాజవేంకటనృసింహా! రాజకంఠీరవా!.

ఉ. తోయజగంధిచుక్క లని తోఁచు ఖభిత్తిక నున్న వేమి? యే
మో యని సంశయింపకుము ముద్దులగుమ్మ! సురాంగనామణుల్
వ్రాయఁగ లేక యిందు మలరాడ్కుల వేంకటనారసింహభూ
నాయకచంద్రునింటఁ గలనాకము లెన్నఁగఁ జిత్రవైఖరిన్.

శా. శ్రీమన్మంగళదేవతాహృదయ రాజీవద్విరేఫంబు శ్రీ
రామబ్రహ్మము పుత్రపౌత్రబలదీర్ఘాయుస్థిరాభోగసు
త్రామైశ్వర్యముఖాదిసద్విభవ మాశాంతంబు మీ కీవుతన్
హేమప్రాజకులీన! వేంకటనృసింహేంద్రా! కవీంద్రస్తుతా!.

ఉ. కంతుఁడొ; యిందిరారమణికాంతుఁడొ; చారుసరస్వతీసతీ
కాంతుఁడొ; శ్రీజగజ్జననికాంతుఁడొ! పుణ్యవసంతుఁడో! శచీ
కాంతుఁడొ! యంచుఁ బండితులు గాంచి హృదబ్జములందు మించి యో
జింతురు మల్లరాడ్కుల నృసింహుని వేంకటనారసింహునిన్.

సీ. ఇతఁడే కదా! మదోద్ధతవైరిరాణ్మత్త
వారణవారకంఠీరవుండు
ఇతఁడే కదా! జగద్ధితకీర్తి విఖ్యాత
విరియాలగోత్రాభివృద్ధికరుఁడు
ఇతఁడే కదా సదాశ్రితకోటిసంరక్ష
ణార్థాగతామరానోకహంబు
ఇతఁడే కదా కవిస్తుతభూరిసామ్రాజ్య
లక్ష్మీకటాక్షసంరక్షితుండు

ఈతఁడే కద గుడగిరిశ్రౌతశైల
కొండవీడుర్గభూ భుజోద్దండధారి
హరి మలరాజవేంకట నారసింహ
కుంభినీపతి వేంకటగుండనృపతి.

ఉ. రా జనవచ్చు శక్తి రతిరా జనవచ్చు మనోజ్ఞమూర్తి ర
రా జనవచ్చు భూతి నిధిరా జనవచ్చు పదార్థమోవధీ
రా జనవచ్చుఁ గీర్తి నగరా జనవచ్చు నుదారరేఖ మ
హ్రాజనవచ్చు రా నరసరాయని వేంకటగుండరాయనిన్.

సీ. అనృతభాషణ మొక్కఁడాఁడనేరనిజిహ్వ
కేరీతి శాస్త్రార్థహితవు గల్గెఁ
బరకాంత మాతృభావనఁ గనుమనమున
కెటు యశఃకాంతపై నిచ్చ గలిగెఁ
బరునినొక్కనిఁ బ్రోవఁ గరుణఁ బూననిమది
కెటు సర్వజనగుప్త పటిమగలిగె
నవమానభార మింతైన నోపనిశిరం
బెటుల భూభారసంస్థాపన మాసె

నౌర తావక మహిమ మహావిచిత్ర
మనఁగ వెలసితి మలరాజ ఘనకులేంద్ర
వేంకటనృసింహవిభుపుత్ర! విమలగాత్ర!
గుణగణకలాప! వేంకటగుండభూప!.

వేంకట గుండేంద్రు వితరణస్ఫూర్తికి
జలరాశి సంతోషశాలి యయ్యె
వేంకట గుండేంద్రు విమలయశః కాంతి
క్షేణాంకుఁ డతిహర్షమాణుఁ డయ్యెఁ
వేంకట గుండేంద్రు వృత్తివైభవమున
కబ్జనాభుఁడు సుఖప్రాప్తుఁ డయ్యె
వేంకట గుండేంద్రు విక్రమప్రౌఢికి
విబుధాంగనాతతి వేడ్కఁ జెందె

నౌరమలరాజవేంకట నారసింహ
విభుఁ డొనర్చెడు తత్ఫలవిశదమూర్తిఁ
దేజరిల్లెడు జనభాగధేయ మనఁగ
గురుబలోన్నతి వేంకటగుండనృపతి.

ఉ. మలరాడ్వేంకటగుండభూరమణ యుష్మద్వైరిభూపాలకాం
తలు కాంక్షించుచునుందు రాతతసమత్వాబ్దంబు లబ్జారిచి
హ్నలఁ జెన్నొందనిమాసబృందముఁ దమిస్రాయుక్తఘుస్రావళిక్
బలభిద్భేదనరాజచంద్ర సుకృతీ! ప్రద్యుమ్నరమ్యాకృతీ.

మ. చటులోర్వీపతియై మహావిభవుఁడై సత్త్రాణధారాయశ
శ్చట లేదంచును వేంకటేశుఁ డిలపై జన్మించి మల్రాజవేం
కటభూపాలకమౌళి యాచు వెలయం గాఁబోలుఁ గాకున్న నీ
పటుదాతృత్వవిశేష విశ్వభరణప్రారంభముల్ గల్గునే?

మ. మలరాడ్వేంకట గుండభూవర భవన్మాన్య ద్విపద్రాజమూ
ఱలిగుండెల్ పగులన్ ఢణాంఢణనినాద స్ఫారభేరీసుళిం
ఘుళఘుంటారవగంధసింధురఘటాక్రాంతైకపద్యాంచితా
ఖిలసంపత్పరిపూర్ణ భావ విలసద్వల్లక్షశ్రీవసుఃపట్టణా
కలిత శ్రీనరసింహరాయనగరిన్ గట్టించి తీవిద్ధరన్.

ఈగుండారావుగారి కిరువురు భార్యలు.

శా. స్వామీ వేంకటగుండభూవరనృసింహక్ష్మాధిరాడ్పట్టణా
శ్రీమత్సౌధవిచిత్రరత్న రుచిసాంద్రీభూతపీఠిన్ భవ
ద్వామాక్షీయుగమధ్య మీరలు తలంపన్ రుక్మిణీసత్యభా
మామధ్యస్థిత కృష్ణమూర్తి వని సంభావింతు రార్యోత్తముల్

మ. రవిచంద్రాక్షుగృహాగమోపమిత బెల్లంకొండ వినుకొండకొం
డవిటీదుర్గధరాధిపత్యధృతినై నానానృపస్తోమసం
స్తవివై శ్రీమలరాణ్నృసింహుని తనూజాతుండు నా మించి తీ
వవనిన్ వేంకటగుండభూవరమణీ! యర్థార్థి చింతామణీ!.

ఉ. రాజకళాకలాప! మలరాట్కులవేంకటగుండభూప! నీ
రాజితకీర్తి రాజసురరాజధరాజభరాజరాజభృ
ద్రాజశిరాజవాహనగరాజ శిరాజశిరాజ వాహగో
రాజ భుజంగరాజ రుచిరస్థితిఁ గాంచెను చిత్రవైఖరిన్.

మ. మలరాడ్వేంకట గుండభూరమణ యుష్మత్కీర్తి శుభ్రాంబుజం
బలర న్నీలమణి ప్రభావిజితదైత్యద్వేషిపాదంబు త
ద్దళమధ్యాంతరచంచరీకమనఁ బ్రోద్యల్లీలఁ జెన్నొందె భూ
వలయాధీశసుతాధిపా! ప్రబలదైత్యారి ప్రవజాబ్జద్విపా!.

మ. మలరాడ్వేంకటగుండభూవరునిసామ్యం బెవ్వరిం జెప్ప భూ
వలయత్రాణమనోజ్ఞసూనృతరిపుప్రధ్వంసలీలావిని
శ్చలధైర్యోక్తుల నొక్కపట్టున హరిశ్చంద్రోరగేంద్రుల్ సముల్
తలఁపన్ వారల కన్న నెవ్వ రనుచున్ దర్కింతు రార్యోత్తముల్.

శా. శ్రీశా వేంకటగుండభూరమణవాక్క్రీడామహైశ్వర్యలీ
లాశాస్త్రాదికళావిలోచనధనుః ప్రజ్ఞానుభోగస్థిరా
పాశాస్ఫూర్తులఁ దుల్యు లం చనఁగ నుద్యత్ప్రాజ్ఞవాణీశగా
రీశాంభోజవరుల్ భవత్సములుగా కెవ్వారునీసాటికిన్.

మ. పటువార్ధిన్ విధిదీనరక్షణకుఁ గల్పాఘుంబుఁ గల్పించి యొ
క్కటి నైనన్ ధర నుండ నీక దివిఁ జక్కన్నిల్పి మల్రాజవేం
కటగుండప్రభు నిత్యదానమతిఁ గాఁ గల్పించెఁ గా కెట్లు ప్రా
చుట యిం దుద్భవమైనయర్థులకు రక్షోపాయ మూహింపఁడే?.

మ. పటులీలన్ నిఖిలావనీజనము సంప్రార్థింపఁగా ముందు భూ
ర్జటి లోకోత్తరుఁ డీశుఁ డేకతరదుర్గాధ్యుండు నై యుంటయెం
తటికార్యం బని పద్మనాయకకులోత్తారుండు మల్రాజవేం
కటగుండప్రభుఁడై జనించి బహుదుర్గాధ్యక్షుఁడై మించెఁ గా
కెటు లొక్కం డఖిలావనీజనమనోభీష్టంబు లీ డేర్చెడిన్

ఉ. వేరుచమల్లరాజఘనవేంకటగుండనృపాల! నీయశ
స్సారము వారిజారికి గజారికి తార్క్ష్యగజారి కబ్జభ
న్నారికి శంభునారి కజునారికి సీరికి సారవాహినీ
వారికి లచ్చి వంగడమువారికి చివ్వఁ డినయ్యవారికిన్.

మ. కలివేళన్ విబుధాశ్రితావళికి సౌఖ్యప్రాప్తిగావింప శ్రీ
మలరాడ్వంశము భాస్కరాన్వయమునన్ మాన్యం డుదారుండు కే
వలపుణ్యుండు నృసింహుఁ డాజిబలవద్వైరిక్షమావైభవో

జ్వలుఁ డౌ వేంకటగుండభూవిభుఁడు విప్రవ్రాతపుణ్యంబునన్
గలిగె న్నే( డని పల్కుచుండుఁ గవిలోకం బెల్ల నెల్లప్పుడున్.

చ. రతివరదివ్యరూప! మలరాడ్కులవేంకటగుండభూప! నీ
వితరణరేఖఁ గాంచి ద్యుకవిగ్రహరాజు తనూజురాజు వా
క్పతు లొకవేళ దాత లని ప్రస్తుతిఁ జెందుదు రేమొ కాని సం
తతసహధుర్యచర్య! వసుధావరులం దొకఁ డైన దాత యై
క్షితి విలసిల్లుటం గన మొకించుక వంచన లేదు భూవరా!.

ఉ. వింటిని మల్లరాజకులవేంకటగుండని కీర్తి జంటయౌఁ
దొంటికిటీంద్రుపంటికి నధోక్షజుఁడాపలికంటి కల్లము
క్కంటికి వానియింటికిని కామునివింటికిఁ దమ్మిచూలివా
ల్గంటికి నిగ్గులీనువడగంటికిఁ గప్పురపున్నంటికిన్.

మ. మలరాడ్వేంకటగుండభూరమణ యుష్మత్ప్రాంగణక్షోణికృం
ఖలబంధంబుల గంధసింధురతతు ల్గాఢంబుగా నిల్చె శ
త్రులయావాసకృతాపరాధికకుభృస్తోమంబు నా లేక భే
రులనాదోన్నతి నిల్చునే? యకట! నిద్రోద్రేకముల్మానునే?

మ. మలరాడ్వేంకటగుండభూరమణయుష్మచ్ఛౌర్యసంరంభసం
కలితోద్యద్రణభేరికాధ్వనిమహాకాంతారభూభృద్గుహా
వళులున్ వైరిచయంబుఁగాం చెనన గావర్తించెఁ గాకున్న త
త్కలనాదంబులువాని కేమిపని తత్తద్వేళలన్బల్కఁగన్.

మ. కుటిలారాతిపరాక్రమానలునిపైఁ గోపించి మార్తాండు నో
క్కటఁ భక్షించి నగాళి నెక్కి దివిమార్గం బేగి సింధూదక
చ్ఛట మాన్పం గమకించుఁ దద్ధనగతు ల్కాంతింప మల్రాజువేం
కటగుండక్షితిభృచ్చమూజనిత రంగద్భూరజోజాలముల్.

మ. అరిరాడ్భీతిక నారసింహపురసౌధాగ్రస్థరాకానిశా
కరసారంగము మల్లికాకుసుమసంఘాతంబు భక్షింప సుం
దరు లంతం గనిపట్టి రం దదిమొదల్ దైన్యంబు జెన్నొందెఁ గ్ర
చ్ఛుఁ జంద్రుం డదిగాక రాజులకుఁ గాంతుల్గావె సారంగముల్.

మ. రమణీయాకృతి నారసింహనగరప్రాకారరత్నాగ్రదు
ర్గమసంధానవిభిన్న విస్రుతసుధాధారాప్లుతిం గల్గె ను
త్తమచామీకరహర్మ్యవ్ర మౌళి కలసౌధఖ్యాతి కాకున్నచోఁ
గమలారాతికి నాఁడునాటికిఁ దనూకార్శ్యంబు సిద్ధించునే?.

మ. ధరణీమండలి నారసింహపురసౌధాభ్యంతరాళ ప్రభా
కరచంద్రామలపుత్రికాముకురముఖ్యాలంకృతస్తంభకు
డ్యరమావైభవముం గనుంగొన సహస్రాక్షుండు దక్షుండుగా
కరయం గేవలమర్త్యమాత్రునకు శక్యంబే నిరీక్షింపఁగన్?.

మ. నరసింహప్రభుపట్టణోత్తరలసన్నానామణీచిత్రభా
స్వరమాయోషితరాజసౌధ మమరెన్ సర్వంసహామండలే
శ్వరసన్మానితభాసమై వెలయుచున్ సాక్షాదయోధ్యాపురీ
వరభాస్వత్కులరామచంద్రగృహభాస్వల్లీలఁ జెన్నారుచున్.

మ. ప్రతతార్యాన్వితనారసింహనగరప్రాసాదసంచార సం
గతదాంపత్యరతి......... ..............
ప్రతతుల్పువ్వులతోడఁ ద్రోయ నవిధారాభృత్తటిన్ వ్రాలి వి
చ్యుతు లయ్యెన్ ధరపై సముద్రజము లంచున్ జూడఁ జిత్రంబుగన్.

మ. పటులీలానరసింహరాయనరగప్రాసాదరత్నంబు వేం
కడగుండప్రభుతోడఁ జెల్వమరె సాక్షాద్వైజయంత్యాఖ్య నొ

క్కుటి గాఁపున్నను నిల్తురే బుధగురుల్ కావ్యజ్ఞు లుద్యత్సుమ
త్కుటదివ్యాంగన లిష్టభోగములు శృంగారంబులుం గల్గునే?

మ. సరసీజాతపరాతతాంతగతలక్ష్యస్ఫూర్తి వీక్షించి కొం
దఱుసారంగశశద్రుమాగ్రదళితేంద్రాశ్మద్యుతిస్తోమమం
దురు గా కంచు నృసింహరాయపురసౌధోత్సంగసంసర్గగా
కరయన్ వేఱొకరీతి గాదనుచు మత్స్వాంతంబునం దెంచెదన్.

ఉ. శ్రీయుతనారసింహపుర శేఖర కాంచనరత్న సౌధవా
తాయనమార్గదీపకళికాగ్రసమంబున ధూమరేఖ నే
చాయనఁ జూచినా వదియె "చంద్రునిలో మృగ" మంచుఁ గాదు "లే
డే"యని కాని వాదములు దెప్పర మప్పురిముగ్ధకోటికిన్.

మ. నరసింహప్రభుపట్టణాంతరలసన్నానామణీవ్రాతబం
ధురసౌధంబురులీల మించ హిమవద్గోత్రంబు దూరంబుగా
జరిగెన్ దారకశైలరత్నమొగినై జావాసమెవ్వారికిన్
గురిగాఁగన్పడవయ్యెఁ దద్గరిమలోకుల్మెచ్చఁగాశక్యమే?.

చ. అకలుష నారసింహనగరాంతరచిత్రితచక్రయంత్రనా
యకకృతతామ్రపాత్రనివహభ్రమణీకృతిఁ జూడ నొప్పె దీ
ర్ఘికనిజపుత్రకోటి కొకక్రీడ యొనర్పఁగఁ బూనెనో యనన్
నికటతలస్థరాజభవనేశ్వరుఁ డాత్మముదంబుఁ జెందఁగన్.

ఉ. శ్రీనరసింహరాయపుర శేఖరసౌధనివాసవాసినీ
మానవమానినీమణులు మాటికిమాటికిఁ జూడ వచ్చువై
మానికమానినీమణుల మానక పూజ లొనర్చు మల్లికా
సూనములో యనన్ దలపఁ జొప్పడు నప్పురిఁ దారకావళుల్.

ఉ. ఎంచఁగ వారిభాగ్యము మఱేమన నేర్తు సమస్తసూత్సర
త్నాంచితనారసింహనగరాంతరసౌధవిహారిణుల్ కరా
భ్యంచిత ఖంబు విష్ణుపద మంచు సపర్య లొనర్ప నేర్పుగా
నుంచినపూవులో యనఁగ నొప్పెడి నప్పురిఁ దారకావళుల్.

చ. నరహరిపట్టణాంతరమునం దపనీయమణిస్ఫురద్రసో
త్కరనృపమందిరం బలరె ద్వారకతో నలయాదవేంద్రుమం
దిర మనఁ గానిచో నచట నిల్చునె? రుక్మిణిసత్యభామలి
ద్దలు నిరుప్రక్కలన్ వెలయఁ దామరసాక్షుడు కృష్ణదేవుఁడున్.

చ. జలనిధిమగ్నసాంద్రత...చ్ఛితి ద్వారవతీపురీరమా
లలన ముకుందుతోఁ దెలుప లాలనఁ జేసి నృసింహరాడ్పురిన్
నిలు మని సౌధరాడ్ప్రకృతి నేనొక వేంకటగుండరాయరా
ట్తిలకుఁడనై జనింతు నని తెల్పినవో? యన మించెఁ దత్స్థితుల్.

ఉ. ధారుణిశ్రీనృసింహవసుధాపతిపట్టణభర్మహర్మ్యరోచి
త్రారచితైకపుష్పవనులం దిర వొందెడుసత్సరఃపయః
పూరితభూరియంత్రజలపూరము లొక్కెడఁ గూడఁ బాఱి మి
న్నారన నిల్చి కాల్వ యొకఁ డేరుపడెన్ గగనాంతరమ్మునన్.

ఉ. నీ టొలయన్ నృసింహధరణీశపురాంతరసౌధవీటికలో
బోటులు జల్లులాడుజలపూరము లభ్రములోనఁ గల్గెఁ బో
వాటికి నాటనుండి జలవాహము లన్నప్రసిద్ధి గల్గె నీ
బూటక మెప్పు నీటఁగొని పోకెటు లిచ్చెడి? నిర్మలాంబువుల్.

క. గురుబుధకవిలోకంబై
సురుచిరబహువజ్రహేమ శోభాకరమై

సురరాజు మేడకంటెను

నరసింహపురంబు సౌధనాయక మమరెన్.

క. నరహరిరాడ్పురసౌధం

బరయఁగఁ గైలాసశైల మనఁగా దగునా

గిరి కా దటుండు రేనియు

మఱువకో దుర్గాధినాధమందిరమగునే?.

శ్రీ ర స్తు.

# చాటుపద్యరత్నాకరము

## చతుర్థతరంగము.

---

### వేమగుంట వేంకట్రాయఁడు

క. విధవైన మేలు మగనికి
తిథివెట్టును కథలు వినును తీర్థము లేగుఁ
అధముఁడవు దానికన్నను
విధవాయా వేమగుంట వేంకట్రాయా.

### వేముల చిన్నారాయఁడు

క. తల లెంత పెంచుకొన్నను
కులధర్మము విడిచి కన్నకూళ్లం దిన్నన్
గలుగదు మోక్షము చిత్తము
విలయము గాకున్న బిజన వేములచిన్నా.

### గువ్వల చెన్నని పద్యములు

క. గుడి కూలును నుయి పూడును
వడి నీళ్లన్ జెఱువు తెగును వనమును ఖిలమౌఁ

జెడనిది పద్యం బొకటియొ
కుడియెడమలఁ గీర్తిఁ గన్న గువ్వలచెన్నా!.

క. వెలయాలు సుతుఁడు నల్లుఁడు
నిలపతియును యాచకుండు నేవ్వరు ధరలోఁ
గలిమియు లేమియు నెఱుఁగరు
కులపావనమూర్తి వన్న గువ్వలచెన్నా!.

క. అంగీలు పచ్చడంబులు
చంగావి మెఱుంగు నేలు సరిగంచులమేల్
రంగుల దుప్పట్లును నీ
గొంగడి సరిఁ బోలవన్న గువ్వలచెన్నా!.

క. ఎఱుఁగుదువు సకలవిద్యల
నెఱుఁగని వీఁక రెండుకలవ వేవే వన్నన్
బిరికితనంబును లోభము
గుఱు తెఱుఁగవు జగతి నెన్న గువ్వలచెన్నా!.

క. ఈవీయని పదపద్యము
గోవే సభఁ జదివె నేని కుంభినిలోనన్
ఈవిచ్చిన పదపద్యము
గోవే సభఁ జదువకన్న గువ్వలచెన్నా!.

క. పరిగేరు కున్నగింజలు
కఱవున కడ్డంబు రావు కష్టం డిడునా
తిరిపెమున లేమి తీరదు
గురుతరసత్కీర్తిఁ గన్న గువ్వలచెన్నా!.

# కొత్త అమరప్ప

క. భూమండలిలోఁ గన్గిన
యేమానవుఁడైన ధన మపేక్షించును గా
ఆమేల్మిగుణము పట్లను
కోమట్లనుఁ జూడ గొప్ప కొత్తమరప్పా!.

క. వరహాలెన్ని గణించిన
పరమార్థజ్ఞానిపోలే పావనుఁ డౌనా?
ధర వన్నె లెన్ని గన్గిన
గురిగింజకు నేమి గొప్ప కొత్తమరప్పా!.

క. వాటమెఱిఁగి వచియించిన
బాటిలుఁగావానిమాటపదుగురిలోనన్
వాటమెఱుంగకపలికినఁ
గోటికిసరితూగదప్పకొత్తమరప్పా!.

క. కూటికిగదయింద్రాదులు
వాటముగాయజ్ఞములకువచ్చుటలెల్లన్
గోటానకోటులొసఁగినఁ
గూటికిసరితూగదప్ప కొత్తమరప్పా!.

క. ఇమ్మహిగుణములకెల్లను
సమ్మతివితరణగుణంబు సరసులు మెచ్చే
సొమ్ములలో ముత్తెదువ
సొమ్ములకుందాళిగొప్ప కొత్తమరప్పా!.

కృష్ణరాయక్షితీంద్ర

సీ. ఏనుఁగు సింహంబు నెలనాగయునుఁ గూడి
యొకమాటలోపల నుండవలయుఁ
బక్షియు వస్త్రంబుఁ బాషాణమునుఁ గూడి
యొకమాటలోపల నుండవలయు
ఫణిరాజు ఫణివైరి ఫణిభూషణుఁడు గూడి
యొకమాటలోపల నుండవలయు
రారాజు రతిరాజు రాజరాజును గూడి
యొకమాటలోపల నుండవలయు
దీనియర్థంబు జెప్పఁగా దీనిధులకు
నెలలు పన్నెండు గడు విత్తు నేర్పగాను
చెప్పునాతఁడుభావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!.

సీ. మనుజునియాకారమహిమకు మొద లెద్ది?
నగవైరివైరుని నగర మెద్ది?
రఘుపతి గాచినరాక్షసాండజ మెద్ది?
శిబికన్ను లార్జించుచెలువ మెద్ది?
పంచబాణునియింటఁ బరఁగినరుచి యెద్ది?
గిరిపతి భుజియించుగిన్నె యెద్ది?
నయనాంగరక్షకత ననువైనవలు పెద్ది?
చెలఁగి మానముఁ గాచు చెట్టదెద్ది?
అన్నిటికిఁ జూడ రెండేసియక్కరములు
చెప్పునాతఁడు భావజ్ఞ శేఖరుండు

చెప్పఁ గల్గినచే నిత్తుఁ జిన్నిమాడ
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర?

సీ. అసమానకోదండుఁ డైనరా జెవ్వఁడు
రాజు పేరిటఁ గల రాగ మెద్ది?
రాగంబు సరివచ్చు రాజిత ఋతువెద్ది?
ఋతువు పేరిటఁ గలరుద్రుఁ డెవఁడు?
రుద్రుని పేరిట రూఢియౌ పక్షెద్ది?
పక్షి పేరిటఁ గలవృక్ష మెద్ది?
వృక్షంబు సరివచ్చు వెలయుభూషణ మెద్ది?
భూషకు సరివచ్చు భూమి యెద్ది?
అన్నిటికిఁ జూడ మూఁడేసి యక్షరములు
ఆదు లుడుపంగఁ దుద లెల్ల నాదు లగును
చెప్పు నాతఁడు ప్రాజ్ఞశేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!.

సీ. ఇలరామునకు సీత యెచ్చటఁ గనఁబడె?
నారాముఁ డేటికి యడవి కరిగె?
నేఁగినమారీచుఁ డేమిరూపముఁ దాల్చె?
నెలమి దైత్యులరాముఁ డేచటఁ జంపె?
సుగ్రీవుఁ డారాముఁ జూచి యేమని పల్కె?
వాలి రాముని చేత నేల చచ్చె?
లంక యేరీతిని రాముఁడు శోధించె?
............బ్రదుకఁ జూచె?
అన్నిటికిఁ జూడ మూఁడేసి యక్కరములు
మొదలు దుదలును నొక్కడ నొదిగి యుండు

చెప్పఁగలవాడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!.

సీ. నక్షత్రవీధికి నాయకుఁ డెవ్వండు
రంగగు గుడిలోన లింగ మెద్ది?
వాహనంబులమీఁది వన్నెకు మొదలెద్ది?
దేవతాబుషులకుఁ దిండియెద్ది?
నరకాసురునిఁ గన్న నాతినామం బెద్ది?
పొలతి చక్కఁదనానఁ బోల్ప నెద్ది?
తల్లికిఁ గడగొట్టు తనయునిపై నెద్ది?
కమలాప్తబింబంబుఁ గప్పు నెద్ది?
అన్నిటికిఁ జూడ రెండేసి యక్కరములు
ఆదు లుడుపంగఁ దుదలెల్ల నాదు లగును
చెప్పు నాతఁడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!.

సీ. రాముఁ డెవ్వరిఁ గూడి రావణు మర్దించె?
పరవాసుదేవుని పట్టమెద్ది?
రాజమన్నారుచే రంజిల్లు శరమేది?
వెలయ నాలుగువంటివిత్త దేది?
సీతను గొనిపోవఁ జెఱచిన ధనువెద్ది?
సభవారి నవ్వించుజాణ యెవఁడు?
అలరంభతురుములో నలరుమాలిక యేది?
... ... ... ...
అన్నిటికిఁ జూడ నైదేసియక్షరములు
ఆదు లుడుపంగఁ దుదలెల్ల నాదు లగును

చెప్పునాతఁడు భావజ్ఞశేఖరుండు
లక్ష్మణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!.

## శృంగారము

చ. కరభము లేమ పెందొడలకాంతులఁ గాంచి దలంచి భీతిచే
విరలగతిన్ సతీగమనవృత్తి వహింపఁగ నోచెనో తుదన్
దరిగినమధ్యమస్థితిపదద్యుతిచే ముఖవర్ణమంతమై
తిరిగి సకంటకావిలగతిన్ దలవంచి నశించెఁ గోఁతలన్.

గీ. కంధరం బింతిజడసరి గాక యోడి
ప్రథమవర్ణంబుఁ బాసి కుచాగ్రసీమ
కొత్తుఁ బోయి కచశ్రీకిఁ దత్తరిల్లి
క్రిందుమీఁదయి ముఖసీమఁ బ్రీతి నెనసె.

మ. మృగశాబేక్షణ గుబ్బగుబ్బగవతో మెండొడ్డి హీనంబులై
నగముల్ వృద్ధి వహించి యానయసమాన స్వచ్ఛరోమాళితోఁ
బగ సాధింపఁగ లేక పూర్వమునఁ బుంభావమ్మునన్నాభికిన్
దగకే క్రిందుగ బడె ధరిత్రి బలవద్వైరంబు వాటిల్లుటన్.

క. కంధరము ధరము కరమును
కంధరధర దరము కరము కచకుచకటివా
క్సింధురమా సింధురమా
సింధురమా వైభవాప్తిఁ జెలువ యొసంగున్.

సీ. ద్విరదంబునడతోడ సరిరాక ముఖభంగ
దశనొంది నవ్వులోఁ దనరఁజూచె
గగనంబుకొనతోఁ బగజెంది మధ్యమాం
తమునొంది నవ్వుతో దనరఁజూచె

సారసంబంధ్రఘితో సరిరాక సావర్ణ
గతిమానిమోవితోఁ గదియఁబూనె
గనకారికటితోడ నెనరూని నారివే
సముఁ బూని మేనితో సమతఁ జెందె
తిరిగి పతికంఠకుచబాహు సరసనాసి
కలక్షు భయమంది మొఱవెట్టిగతులు మాని
యొరఁగి ధరఁగూలి వత్తులై యొకటరెంటః
మాటనాగ్గింటితో సరి మొనయవయ్యె!

సీ. కుచపాళి గాంగేయకుంభజప్రభ మించె
ధర్మరాజఖ్యాతిఁ దనరెఁ బొమలు
పటుమత్స్యరాజ ప్రభావంబుఁ గనెఁ గన్ను
లంగ మశ్వత్థామరంగుఁ దాల్చె
ఘనకృపాతిశయంబుఁ గన్గి పల్కులు మించె
చక్రితేజముఁ గేలి సల్పె నారు
ధార్తరాష్ట్రద్యుతిఁ దనరె యానస్ఫూర్తి
రూపుఁ ద్రుపద్యుమ్న రుచుల మిగిలె
నఖము లర్జునసత్కాంతి నగవు మిగిలె
ఘుర్మసంపద నవనవగణన మొసఁగె
తరుణిఁ గురుపాండవబలంబు తనరె మేన
నెంత చిత్రం బహో యింతి నెంచి చూడ.

క. అహహా దానిపిఱుందులు
రహిఁ బోల్పఁగ దానుఁ బోలు రమణీయములై
మహిళామధ్యము నెన్నఁగ
మహిళామధ్యంబుఁ బోలు మంగళ మగుచుక్.

క. నగమా కుచ మా రొగిప
న్నగమా తర శేక్షుజీవనగమా నగమా
నగ మార్కొను నడి రంభా
నగమా తొడ లీఘనాఘనగమా మణికిన్.

ఉ. మోహము మోహరించె సతి! మొల్లసుగంధిరొ! తాళజాలనే
మోహము నిల్వదాయె కడు ముక్కురమారుడుఁ బాణజాలమున్
దేహము గ్రుక్కఁగన్ మిగులఁ దీవ్రత నేసెను భామ! చూడవే
యాహవవీరుఁ డౌమఘుడు నద్భుత మొప్పఁగ మూర్ఛఁగూర్చెనే!.

మ. మమతను తన్కు నొక్కచెలి మానిని నీవిభునామ మేమనన్
గమలజగంధి పల్కెఁ గరి కంధి ప్రజాపతి సోముఁ డాతప
త్రములఁ ద్రివర్ణయు క్తముగ వ్రాసియు నందలిమధ్యవర్ణముల్
క్రమముగఁ గూర్చి పల్కినను గ్రమ్మర నావిభునామ మయ్యెడిన్.

మ. చవితిన్ వష్టజుఁ డేగి పంచమనిధిస్థానంబు లంఘించి యే
డవవాఁ డేలినవీడుఁ జేరి పదిలుండై యష్టమస్యందనో
ద్భవి వీక్షించి తృతీయుచెంతకుఁ జతుర్థశ్రేణి నంపించి యా
దివిరోధిన్ బెదిరించి యప్పురి ద్వితీయు న్నిల్పి వచ్చెన్ వెసన్

చ. వనదఘుషేందుజంబిలసువర్ణములన్ గిరి నీట నింగిఁ జె
ట్లను సెగ నెక్క నీద ఘహుళవ్యథఁ బొల్పడ మాగఁ గ్రాగ ను
ర్మను బెళుకంగఁ గంద నిలరాలఁ గరుంగఁగ నీరుఁ గ్రక్కము
న్గ నవియ నొక్కనీరుగ నొనర్చెఁ గచాక్షిముఖ స్తనాంగముల్.

సీ. ఘువకేళి యని నీవు చెనక రాకు సమీర
భుజగరోమాళి యీ పువ్వుబోఁడి
మీనాక్షి యని నీవు మీఱకు కోకంబ!
జంద్రికాహాస యీచంద్రవదన

బింబోష్ఠి యని నీవు బెదరింపకు శుకంబ!
సాంకవామోద యీసన్నుతాంగి
కంజాస్య యని నీవు కలహింపకు మృగాంక
స్వర్ణాభవేణి యీజలజపాణి
శ్వాస వక్షోజ వచనాస్యబాంధవముల
బంధువులు గాన మీకుఁ జెప్పంగవలసె
నిట్లు వినకుండినఁ బరువు లిడుట యెగిరి
పడుట వదరుట కుందుట ఫలముసుండి!.

చ. సరసిజనేత్ర! నీవిభునిచారుతరం బగు పేరుఁ జెప్పుమా!
అరయఁగ నీవు నన్నడుగునాతని పేరిదె చిత్తగింపుమా!
కరియును రక్కసుండు హరుకార్ముకముల్ శర మద్దముల్ శుకం
బరుదుగ వీనిలో నడిమి యక్కరముల్గణుతింపఁ బేరగుల్.

చ. నగతనయల్ ధరల్ సిరిని నాలుగువర్ణములన్ లిఖించిపొం
దుగఁ దుది నొక్కయక్కరముదూకొని వ్రాయగనింపుమీఱగా
నగును గజాననుండు మఱి యాదిగ నొక్కొక యక్కరంబు దిం
చఁగఁ జతురాననుండు శరజన్ముఁడు పంచశరుండు వహ్నియుల్.

చ. అరయఁగ నాలువర్ణముల నర్జును పేరు లిఖించి చూడ నా
యమరవిభుండు షణ్ముఖుఁడు నక్షిపయోరుహవైరి మేదినీ
సుమశరు లయ్యెడిన్ మఱియుఁ జోద్యము దానితుదాది చేసినన్
గమలయు భూమిసంభవుడు కాంతియు స్వర్ణము గాఁగనంబడుల్.

చ. సతికుచవాక్సమత్వ మరిజాతసుధల్గానఁ బూని వాదులై
హతులయి వారిజాత వసుధాకృతు లూని యు దృష్టితంబని
ర్జితరుచి గాంచియుం దుది నరిత్వము జెందినచంద్ర శేవధి
స్థితిని ముఖాంగముల్ గెలిచె నీ! తగ దన్నిట నొంటి నోడినన్

ఉ. అక్షరపక్షపాతమున నర్థము నూళ్ల నొసంగ నుబ్బుచున్
భిక్షుజటాధరాధికులు భిన్ననిజవ్రతు లౌదు రైనదు
ర్భిక్షురజాశిశుచ్యుతులు పెక్కగు భక్తియ చాలు దానినా
తత్క్షుభితత్వమే యఘము దార్పెడు శంక దొఱంగు మీఱెదన్.

మ. శైవాలంబును సైకతంబు లెదురై చంద్రప్రవాళాంబుజ
గ్రావాకాశభుజంగకూపములు దూరంబైన నేతత్పరీ
క్షావిద్యావిభవం బొనర్పఁగ దశాబ్జజ్యోత్స్నలో నర్థచం
ద్రావిర్భావముఁ జూపినం గలిసె దానాత్మేశుభావజ్ఞయై.

గీ. తామరబిడారు కొమ్మనెమ్మోమునకును
సారచంద్రచంద్రస్ఫూర్తి సాటి యగునె?
నాతితలమిన్న చెక్కిలివాతెరకును
సారచంద్రచంద్రస్ఫూర్తి సాటి యగునె?

క. ఆగరితకు ముఖకచకుచ
భాగరిమసుధాంశులకుచబలభిన్మణికా
ధాగధగీధైగధగీ
నైగనగీవిభ్రమముల నగుఁ దగు మిగులన్.

సీ. కుసుమంబు లనిన నో భసలకిరోరుహ!
కనుక వెన్కధరింతు ననకు మమ్మ!
సారసం బనిననో చారుకాంచనగాత్రి!
యాద్యంతముల విడనాడ కమ్మ!
అగరులపరిమళం బనిననో మీనాక్షి!
పగమీఱఁ గాఁ దెగఁ బల్కకమ్మ
కస్తూరి యనిననో కంజనిభానన!
విసరమధ్యమవృత్తి విడువకమ్మ

వనిత నీమాటలే నీకు వైర మగును
అనుచు నొక్కతె పల్కె మాఱనె నొకర్తె
శ్వాస, యుచ్ఛ్వాస, ఘనవేణి చంద్రికాస్మి
తహారిమధ్యమ లేదనితలఁగ కనియె.

ఒకానొక వేశ్యారసికుఁడొక వెల్లాటకత్తెయింటికి వెళ్లెనఁట. ప్రసంగానుకూలముగా నాపడుపుచెలి రసికునిట్లు ప్రశ్నించెనఁట.

ఉ. మొల్లసుగంధి కూఁతురది ముంగిటనున్నది దానిఁజూడు; నే
నెల్లవిధంబులన్ రతుల నేలెడుదానను నన్నుఁజూడు; ఫు
త్ఫుల్లసరోజనేత్ర వరపుత్రిక పుత్రిక దానిఁజూడు; నా
కల్లుఁడవయ్యెదో? మగఁడవయ్యెదవో? మనుమండవయ్యెదో?

ఆప్రశ్నకారసికుఁ డీరీతిగా జవాబొసంగెనఁట.

ఉ. మొల్లసుగంధికూఁతురిని ముంగిటఁ గంటిని దానిమాన; నీ
వెల్ల విధంబులన్ రతుల నేలెడుదానవు నిన్నుమాన; ను
త్ఫుల్లసరోజనేత్ర వరపుత్రికపుత్రిక దానిమాన; నీ
కల్లుఁడనయ్యెదన్ మగఁడనయ్యెద నీమనుమండ నయ్యెదన్.

అటుపిమ్మట కొంతసేపటికి కాంచనకాంత రసికునకువక్కలాకు లొసంగెనఁట. ఆతఁడు సున్నముః దెమ్మని యీరీతిగా నడిగెనఁట.

గీ. పర్వతశ్రేష్ఠపుత్రికాపతివిరోధి
యన్న పెండ్లాము నత్తనుగన్నతల్లి
పేర్మిమీఱినముద్దులపెద్దబిడ్డ!
సున్నమించుకఁ దేగదే? సుందరాంగి?

ఆజాణ సున్నమును దెచ్చి "యిదిగో తీసికొమ్మని"
యీరీతిగాఁ జెప్పెనఁట.

క. శతపత్త్రంబులమిత్త్రుని
సుతుఁజంపినవానిమామ సూనునిమామన్
సతతముఁదాల్చెడు నాతని
సుతువాహనవైరివైరి? సున్నంబిదిగో!

చ. పలుకక పల్కరించుగతిపాడక పాడినరీతిఁ దేనియల్
చిలుకఁగనవ్వకే నవగినలీలఁగనుంగొనుచున్న వారిక
న్నులకతిసుందరంబయిమనోజ్ఞపుఁ జిత్తరువందునున్న నీ
చెలువముఁజూచి నేనునొక చిత్తరువైతినిగాదె? కోమలీ!

ఉత్సాహ. ఐతినైదునైదునైదునైదునైదుగల్గినన్
భాతిగమ్మతీలునైదుపంకజాస్త్రుఁజేసినన్
జేతినైదెఱుంగనట్టిచీకుపోతుగూడునే?
నీతిమేతినైదువేనినీరజాక్షి! వేడుకన్.

క. వండినదెండినదొక్కటి
ఖండించినపచ్చిదొకటికాలినదొక్కటై
తిండికిరుచియైయుండును
ఖండితముగ దీనిఁదెల్పుకవియుంగలఁడే?

క. శిలవృక్షులతలఁబుట్టిన
చెలువలుముప్వురునుగూడిచిడిముడి పడుమ.
తలవాకిట రమియింతురు
సలలితముగ దీనిఁదెలుపఁగ సరసులుగలరే?

క. శుద్ధకులజాతయొకసతి
యిద్ధరణిందఁద్రిఁజంపి రోషఁగవిశుద్ధిన్

బుద్ధిఁబితామహుఁబొందుచు
సిద్ధముగాఁదంౘ్రడిగనునుఁ జెప్పుముదీనిన్.

ఉ. భూపతిఁజంపితిన్ మగఁడు భూరిభుజంగముచేతఁజచ్చె నే
నాపదఁజెందిచెంది యుదయార్కునిపట్నముఁజేరివేశ్యనై
పాపముఁగట్టుకొంటిఁ దనపట్టివిటుండని కౌఁగిలించి సం
తాపముఁబొందియగ్నిఁబడి దగ్ధముగాకిటు గొల్లభామనై
యీపనికొప్పుకొంటి నృపతీ! వగ పేటికి చల్లచిందినన్?.

సమస్య:—గోలకొండ; మాలముండ; పూలదండ; కొత్తకుండ; యనునాలుగుపదములును వచ్చునట్లు శృంగార విషయముగాఁ గందపద్యముం బూరించుట.

క. ఒకగోలకొండచెంతను
ప్రకటంపుతమాలముండఁబటుతరగతిరా
చుకపూలదండవిడనా
యకునకుమైకొత్తకుండనతివరమించెన్.

సీ. చంద్రుఁడెవ్వారికైనఁజల్లనై యుండఁగా
పద్మాలపుణ్యమాపాటిగాక
వరవసంతుఁడువచ్చి వనమెల్లఁబ్రోవఁడా?
జాజినూనపుటదృష్టంబుగాక
సంపంగివాసనల్ చర్చింపశక్యమా?
యిలఁదేంట్లకును దైవమీఁడుగాక
హరుఁడేప్రసూనంబు శిరమునఁదాల్పఁడా?
ంగికినిప్రాప్తిలేదుగాక

ఎవ్వ రెవ్వరి భాగ్యంబు లెట్టివో కా
మాకుఁ బ్రాప్తంబు లేకున్న మానెగాని
పద్మదళనేత్రి! ప్రౌఢభూపాలపుత్రి
చిక్కవిరుపాజి! మరుని రాచిల్క తేజి!

ఉ. ఇంచుక నూదిపోటుసహియించినమాత్రన నంగనాకుచో
దంచితసౌఖ్యకేళి సతతంబును గంచుకి గాంచె నాజిని
ర్వంచనతీవ్రబాణనికరక్షతదేహుల కబ్బవే మరు
చ్చంచలలోచనాచకితచారుకుచద్వయసంగసౌఖ్యముల్.

పాలకుండ; గోలకొండ; మాలముండ; పూలదండ; అను పదములు వచ్చునట్లు రామాయణార్థమునఁ బూరింపఁ బడిన పద్యము.

మ. బలవద్రాక్షసపాలకుండవనుచుం బాటింప నాగోలకొం
డలచెట్లందుఁ జరించువేళ మగనిం దప్పించి తే నీతియే?
ఖలుఁడా! నీవిటుపొంచి వైచుటలు నాకంజాక్షి నీమాలముం
డలలో నుంచినఁ బూలదండకడు నెండన్ వాడినట్లుండదే?

మ. కదళీస్తంభమునందు నాళయుతమై కంజాతమింపొందె నం
దుదయంబై పవళించెఁ జంద్రుఁ డచటన్ బ్రోత్ఫుల్లరక్తోత్పలం
బొదవెన్ దత్సుమజాతయై యమున సర్వోర్వీధరంబందుఁ దాఁ
బడి నూతై గగనంబుఁ గాంచె నిది యేభావంబు భావింపుఁడీ.

చ. పురుషవియోగికామినులు పొక్కుచు దూఁటిరి మిత్తిఁ గొంగనున్
ఉరగపుఁగామినిన్ రవికులోదధిచంద్రము డైన రామునిన్
గరువలినూను నంతట నఖండపరాక్రముఁ డైన కీశునిన్
గరుడుని నింగిమానికముఁ గాంచనగర్భుని మాటిమాటికిన్.

## చిత్రకల్పన—

సీసపద్యము.

1. అరిభయంకరచక్ర కరిరక్షసాగర
చాయశ్రీకర్బురసాటియుగళ
2. నాళీకసన్నిభనయన యండజవాహ
వాణీశజనక వైభవబిడౌజ
4. రాజీవమందిరారమణ బుధప్రదక్ష
వరజటిస్తుతశౌరి వాసుదేవ
8. భూరికృపాకర బొబ్బిలిపురపాల
పాపభుజంగమ పరమగరుడ
16 దోష శైలేశ శశిప్రదక్ష ద్రుహిణహేళి.

కీ. వాక్యము:— అ న్న య్య తో టి వి స్నా ప్ర గ డ కా మ రా జు
1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14
భా షిం చు హే ళి దా క్షి ణ్యా శా లి.
15 16 17 18 19 20 21 22 23 24.

ఈ చాటుపద్యమును బొబ్బిలిపురమున విస్నాప్రెగడ కామరాజకవి రచించినట్లు కీ వాక్యమువలనఁ దెలియుచున్నది. సీసగీతచరణములు తక్కినవి కవిరచించెనో లేదోకాని యెవరు చదివినను ఈపద్యమింతే. ఈపద్యచరణములకు మొదట— వరుసగా—1, 2, 4, 8. 16 అను నంకెలు వేసియున్నవి. కీవాక్యము 24 అక్షరములఁ గలిగియున్నది.

ఇఁకనిందలి చిత్రమేమనఁగా నెవ్వరైన నాంధ్రభాషలోని యొకయక్షరమును దలంచుకొన్న యెడల నీపద్యసహాయమున

వారుచెప్పకయే మనము కనుగొనవచ్చును, అయితే ఆ యడు గువారొక కొన్నివిధులకు బద్ధులైయుండవలెను. ఎట్లన:— (1) అచ్చులలో ఆ యొకటిమాత్రమే తలఁచుకొనవలెను. (2). హల్లులలో జ ఞ లు తలఁచుకొనవలదు. (3) గుణితముతోఁ బనిలేదు. (4) న, ణ; ల, ళ; ర ఱ; ల క భేదము. ఇంతకును కీ వాక్యములో 24 అక్షరములలో దేనినేనికోరుకొనునట్లు చే యుటే దీని భావము.

పైవిధానములకులోఁబడి యెవరైన నడిగిరేని, యాయ క్షరమును, గనుగొనుటెట్లన? ముందు కీవాక్యమును కంఠతః నేర్చుకొనవలెను. ఆపద్యము మొదటి చరణమును చదివించి విని యందు తలఁచుకోఁబడిన యక్షరమున్నదియు లేనిదియు తెలిసికొనవలెను, అట్లే 1, 2, 3, 4, 5 చరణములను వరుసగాఁ జదివించి ఆయక్షర మేయేచరణములలోనున్నదో తెలిసికొనుచుండవలయును. అప్పుడాయక్షరము కొన్నిచరణము లయందుంటయుఁ గొన్నిటియందు లేకపోవుటయుఁ దటస్థించును. అప్పుడాయక్షరమున్నపాదములప్రక్కన వేయఁబడియు న్నయంకెలను కలుపునది. అప్పుడు 10 వచ్చుననుకొనుఁడు. కీ వాక్యములోని 10 వ యక్షరము—డ— గనుక, డ, అని చెప్పునది.

ఒకయుదాహరణము. కోరుకొనఁబడిన యక్షరము— య—ఇపుడేమిచేయవలెను? ఇది 1, 2, చరణములలోఁదప్ప నీక లేదు గనుక—1+2=3. కీ వాక్యములోని మూఁడవ యక్షరము—య—చూచితిరా చిత్రము!.

## కృష్ణరాయబారము

సీ. చరణారవిందము ల్పమ్మతిమదినెంచి
ముమ్మాఱు రాజుకుమ్రొక్కితనుము
వచ్చినవైరంబు వారింపనూహించి
మాభూము లిమ్మను మనుజవిభుని
ఆరీతినృపతికి హర్షమ్ము గాకున్న
నేవురి కైదూళ్లు నెలమినడుగు
పుడమీశుఁడామాటకొడఁబడకుండెనా
నడవడి పురికొప్పనడుపు మనుము
పనులు సేయంగ నెందేనిఁ బంపుమనుము
పంపుపనిసేయ సేవకభటులమనుచు
ధర్మమార్గంబు వినబుద్ధి దనరదేని
కదలిరమ్మను శ్రీకృష్ణ! కదనమునకు.

మ. పదరుల్ పన్నక ధర్మశాస్త్రగతి భూభాగమ్ము మారాజ్య సం
పద మాకిమ్మను మీయకుండిన మహాబాహాబలస్ఫూర్తి మై
యెదురై రమ్మను వచ్చిమద్బలము దానేపారఁగాఁ జూచుచో
గదఘాతంబుల నూరువుల్ దెగిపడున్ గంజాక్షు! యింతేటికిన్.

మ. కలహం బేటికి వద్దువద్దనుమిటుల్ గర్వాంధుఁడై మమ్ముఁ దాఁ
జులకంజూచుట నీతిగాదనుము యీక్షోణీతలంబందునన్
నిలువన్నేఁడధర్మవృత్తినను మా నీవిన్నియుం బల్కినన్
బలవద్వైరమునందు దుర్మరణముల్ ప్రాప్తించునంచాడవే.

ఉ. మానము దప్పియిట్టు లభిమానము లేక............
కాలలపాలుచేసి...............................తా
బూనెను రాజ్యసంపదలు బోయగుణంబునఁ బాపకర్ముఁడై

హీనత నెంచనేల యిఁక నేమ్యము చెప్పితినంచుఁ బల్కుమా
తానునుదమ్ములుం బలముధాత్రిని గూలుదురంచు మాధవా!

## చంద్రమండలము

సీ. పాంచజన్యసమాభపాంచజన్యాలోభ
పాంచజన్యప్రభా భాసమగుచు
సారస్వతవినోదసారస్వతామోద
సారస్వతాభేదసారమగుచు
ప్రాలేయగణగణ ప్రాలేయగణగణ
ప్రాలేయగణగణభ్రాంతమగుచు
తారహారకదంబతారహారకదంబ
తారహారకగంబధామమగుచు

నిట్టపుట్ట గట్టు నిట్టానగస్పట్టు
పుండరీకనండదండరండ
పండఖండ...చండీశడిండీర
మండలమ్ము చంద్రమండలమ్ము

## చలి

మ. చలి! నీవెందుకు మచ్చరించెదవు నీశౌర్యంబుమూన్నాళ్లెగా
కలకాలంబును నిల్వఁబోవుగదవే కాకున్న నింకొక్కడో
నిలలో బాలుర రోగులన్మగులఁగా వృద్ధాళి బాధింతువా
జలజాక్షీకుచశైలమధ్యములఁ జెల్చక్ జొచ్చిగోడాడకే.

ము. చలి! మమ్మేలవిదిల్చెదీ వకట! నీశౌర్యప్రతాపోన్నతిం
పలరజ్ శాలిసుఖాన్నమాంగరకసూపాద్యన్నదివ్యానుభో
క్తలు నవ్యాంచితలై సతులమేల్కౌగిళ్లఁగ్రీడింప వా
రల...బోకలైనఁ బీకఁగలవా? ప్రాడ్భాయిశీతాధమా!

## వసంతఋతువు

గీ. జాజియొక్కటియే కాని సకలకుసుమ
వితతసంపదచే నొప్పె వసుధయెల్ల
విరహినె కాని ధరణిపై వివిధజనుల
సంతసమునందఁజేసె వసంతవేళ.

## పడమటిగాలి

చ. మృదునయనాగ్నిఁ గ్రోలి డిగి మేచకకంఠముమీఁద వ్రాలి త
జ్జలనిధి బాడబానలము చక్కఁగఁ గ్రోలి రవిప్రభావళిన్
దడదడఁ దోలితోలి బెడిదం బగుమంటల నప్పళించు నీ
పడమటిగాలి మానవులపాలిటిధూళి మహోగ్రకేలియై.

## లోభి

క. అంతయుసరి యింతయుసరి
యంతకునకు మద్యపాయి కపహాస్యునకున్
అంతయుసరి యింతయుసరి
చింతింపక యిచ్చుదానచింతామణికిన్.

క. ఇలలోభి నెంతవేఁడిన
వలవని వెతలంతె కాని వాఁడిచ్చెడినే?
జలమును వెస గిలకొట్టినఁ
గలుగునె నవనీతమాసఁ గాదురికేసా!

క. కలుగక యిచ్చెడిమనుజులు
తలవెండ్రుక లంతమంది తర్కింపంగాఁ

గలిగియు నీయనియధములు
మొలవెం(డుకలంతమంది మోహనరంగా!

క. పదివేలమంది కిచ్చియుఁ
దుదినొక్కని కీయకున్న దొరకవుకీర్తుల్
పదివేలనోమునోచిన
వదలదె? యొకరంకువంక వన్నియసుంకా!

క. పుట్టుకతోడుతఁగరమునఁ
బుట్టవలెన్ దానగుణము పుట్టకపోతే
యిట్టట్టు నులిమిబలిమిం
బట్టింపనుగాజ? తాళ్లపలికొం(డాజా!.

క. పెక్కావులిచ్చుచో నొక
బక్కా వీకుండే నేని పాడికిఁ గఱవా?
పెక్కుదొర లిచ్చుచో నొక
కుక్కలకొడుకీయకున్నఁగూటికిఁ గఱవా?

గీ. నిండిదరిఁ జేరనీయదు గుండ్లకమ్మ
కలిగి లేదను నర్థికి గంపకమ్మ
మాటలేకాని చొరనీదుమాచకమ్మ
కమ్మత్యాగంబు భువిలోన నమ్మకమ్మ.

మ. కొలిచేదిన్ వగలేక నే; యడిగితే కోపించు టీలేక నే;
చెలుల న్మెచ్చుట కోక నే; విభవముల్ చేకూరుటల్ రూక నే;
బలవంతుం డగు మూక నే; సతిచెడున్ (బాణేశుఁగ్రై కోక నే;
జలదశ్యామల! శంఖచక్రధరకృష్ణా! యాపదుద్ధారకా!

ఉ. అన్నటులీయఁడేని సభనాతఁడె పోపెనులోభిదున్న; యీ
దున్నకు రెండుకొమ్ములును తోఁకయు లేమిని మొండిదున్న యీ
దున్నతొ దున్న రెవ్వరును దున్నదుగా మఱి గంగలమ్మ కా
దున్నెడువారియిండ్లఁ జెడదున్నెడుదున్నర! యెంచిచూడఁగన్.

సీ. లాలింపఁజెఱకు బెల్లంబుఁ దానిచ్చునా?
చెండాడిపిప్పిగాఁ జేయకున్న
అడిగినప్పుడు ధాన్యమన్నంబుఁ బెట్టునా?
దండిరోఁకటదంచి వండకున్నఁ
మ్రొక్కివేఁడిన భూజములు పండ్లనొసఁగునా
మొనసిదండాహతి మోదకున్న
పొగడిన బంగారమును సొమ్ములొసఁగునా?
గొబ్బుగొబ్బునఁ గాచికొట్టకున్న
లండిపోతు శిఖండి గులాము లోభి
తెగువ నొసగఁడు పేరునఁ దిట్టకున్న
దండితనిశాట! భళిర! భూధవుని పేట
బాలగోపాల! గుణజాల! ధర్మచేల!

పొగాకు

క. ఖగపతి యమృతము తేఁగా
భుగభుగమనిపొంగి పొరలి భూస్థలిఁబడితాఁ
బొగచెట్టయిజన్మించెను
పొగ ద్రావనివాఁడు దున్నపోతైపుట్టున్.

క. రావణయుద్ధంబందునఁ
బావనుఁడగు లక్ష్మణుండు బడిమూర్ఛిలినన్

ఆవలఁ బొగచెట్టుండినఁ
బావని సంజీవికేలపరుగెత్తు? నృపా!

క. పొగఁద్రాగ నేర్చి భీముఁడు
పగఱన్ బొగరడఁచె నాజి బాహాశక్తిన్
బొగద్రావనిదుర్యోధనుఁ
డిగిలించెను రణములోన నిహిహీయనుచున్.

## నస్యము

ఉ. నస్యము శీతమత్తగజనాశనహేతువిచారధీరపం
చాస్యము సుప్తిరోగనిబిడాంధతమఃపటలార్కబింబసా
దృశ్యము వేదశాస్త్రపటుదివ్యసుపండితవాగ్విచిత్రసా
రస్యము రాజవశ్య మహిరాణ్మణికైన నుతింప శక్యమే?

ఉ. మట్టపొగాకులో నడుమ మందము గల్గినచోటఁ దీసి తా
పట్టుగఁ బక్వశుద్ధిగను బాగుగఁ గాచి యొకింతసున్నమున్
బట్టనవేలనొత్తి తనబల్మికొలందిగ నల్చి నస్యమున్
బట్టపుఁడబ్బిలో నునిచి ప్రాజ్ఞుల కిచ్చినభాగ్య మబ్బదే?

సీ. నస్యమా యిది? మరున్నారీశిరోమణీ
కుచకుట్మలముమీఁది కుంకుమంబు
నాసికాచూర్ణమా? నలినరుద్వనితాధ
రార్పితతాంబూలికాసవంబు
పొడుముగా? వెడవిల్తుఁ బొలతినెమ్మోముపై
కొమరొందుకసటుకుంకుమపుఁదావి
పొక్కుపొడే? యిది....................
.....................జ్వాలరసంబు

సకలజనమానసోజ్జ్వల చరమమార్గ
తత్వమస్యాదివాక్యప్రధానగూఢ
హేతుకంబై చెలంగుచు నింపునింపు
నస్యముగణింప శక్యమే నలువకైన?

సదాశివసద్గురుప్రభూ

ఉ. కారము లేనికూర యుపకారము లేనిమనుష్యుఁ డాదినోం
కారము లేనిమంత్ర మధికారము లేనిప్రతిజ్ఞ వాక్చమ
త్కారము లేనివేశ్య గుణకారము లేని... లెక్క సా
కారము లేనిపాట కొఱగావు సదాశివసద్గురుప్రభూ?.

చ. కుదిరిక లేనిఖత్తు మదిఁగూటమి చాలనిపొత్తు సుత్తెకున్
మెదుగనిసత్తు ముక్కిడికి మెచ్చులకిచ్చెదునత్తు విత్తఁగన్
బదునన లేనివిత్తు పెనుపల్వకుచేసినయెత్తు మొత్తమై
యదుకునురానిసొత్తు కొఱయగానె సదాశివసద్గురుప్రభూ!.

చ. అగడిత లేనికోట జనులందఱు మెచ్చనిమాట దిక్కులన్
బొగడిక లేనిపేట ఫలపుష్పసమాజము లేనితోట త
న్నగడుకు దీయుపూట యిలుదావిడి పెట్టినబాట రమ్యమై
నెగడదయా! లలాటతలనేత్ర! సదాశివసద్గురుప్రభూ!.

చ. రసికులు లేనియూరు కవిరాజుల కీయనిపేరు నాజిలోఁ
గసరినఁబారుబారు గుఱిఁగాననితీరు బజారుకేఁగుచోఁ
గుసికిరిపడ్డతేరు మిముఁ గోరిభజింపనినోరు గాల్పనా?
భసితవిలేపనాంగ! భవభంగ! సదాశివసద్గురుప్రభూ!.

చ. జలములు లేనిబావి బుధజాలముమున్టనితావి శుంఠకా
యలపరమైనదీవి మదికాశఘటింపనిమోవి గుత్తలం
జలపరమైనకీవి తగసత్కవికీయనియీవి యెల్ల ని
ష్ఫలములు పార్వతీశ! మృదుభావ! సదాశివసద్గురుప్రభూ!.

ఉ. వేదములేనివిప్రుఁ డరవిందములేనిసరోవరంబు ము
త్తైదువలేనిపెండ్లి హిమధాముఁడులేనినిశీథి మీటినన్
నాదములేనివీణ నరనాథుఁడులేనిపురంబు వ్యర్థమౌఁ
గాదె తలంప స్వామి! శితికంఠ! సదాశివసద్గురుప్రభూ!.

ఉ. దుస్తరమైనమూర్ఖునకు దుర్మతిపీడఁగ నెంతదెల్పినన్
స్వస్థపడంగఁబోదొకటి సాదృశమిందుల కుల్లి మోసుకున్
గస్తురిపాదుఁజేసి తగగంధముఁ బన్నీరుఁ బోసిపెంచినన్
బుస్తుగుణంబుఁదా విడువబోదు సదాశివసద్గురుప్రభూ!.

ఉ. దీపములేనియిల్లు నుపదేశములేనిజపంబు మంజులా
లాపములేనికావ్యము విలాసములేనివధూటి విక్రమా
టోపములేనిభూపతి పటుత్వములేనియురోజపాళి ప్ర
స్తావములేనిమాటలు వృథాలు సదాశివసద్గురుప్రభూ!.

ఉ. ఆఁడదిహెచ్చి భర్త కెదురాడఁగవచ్చినఁ గొట్టవచ్చినన్
గూడదుదానితోనవలఁ గూడి నటించుట; తత్క్షణంబునన్
వాఁడొకజాణయైన భగవత్పదసన్నిధిఁ జేరుమార్గమే
చూడవలె న్మనోజ్ఞమగుచోట సదాశివసద్గురుప్రభూ!.

ఉ. పంటకురానిచేలు పతిభావమెఱుంగఁగలేనియాలు నీ
రంటినపాలు దోర్బలపరాక్రమహీనునిచేతివాలు వే
యింటికినీనికేలు భుజియింపక దాచువరాలు ధాత్రిలో
మంటికిపాలు గాక మఱి మన్నన కెక్కునె? సద్గురుప్రభూ!.

ఉ. వేచనికందిపప్పు నవివేకునిమెప్పు వికారియొప్పు ము
ల్లాచనిచెప్పు కుర్లుముడికందనికొప్పు పఠాణిచొప్పు మే
ల్వాచవిసేచునుప్పు దురవస్థలు చెప్పఁ దరంబుగాదయా
మేచకకంఠ! చక్రధరమిత్ర! సదాశివసద్గురుప్రభూ!.

ఉ. ఎన్నఁడుఁ దాతనాఁడుఁ దనయింట నెఱుంగనికల్మిఁగల్గెనా!
వెన్నన కద్ద మద్గఁ గొనఁ బ్రేళ్లకు ముచ్చెలుతొడ్గు నింతలో
మిన్నెగఁ జూచు ధింధిమని మిట్టలు ద్రొక్కని దేమి చిత్రమో!
పన్నగభూష! సన్మృదులభాష! సదాశివ సద్గురుప్రభూ!.

భైరవా

చ. చెఱకురసంబుకన్న నునుచేడెలకన్నను తేనెకన్న భా
సురసుధకన్నఁ దియ్యనగుచూతఫలంబునకన్నఁ బాండుశ
ర్కరరుచికన్న ధాత్రి మధురంబయి తోఁచు వివేకియౌ మహా
సరసునితోడిముచ్చటలు సారెకు సల్పుచు నున్న భైరవా!.

ఉ. బంధులు తన్ను మెచ్చ జనపాలురు మెచ్చను బ్రజ్ఞలేక కా
మాంధతనుండు ముష్కరున కారయ మేదినియందు నీతియౌ
గ్రంథము లేమిసేయు జిగికన్నులవానికిఁ గాక దర్పణం
బంధునకేమిసేయ పగలైనను రాతిరియైన? భైరవా!.

ఉ. డంబముమాని మూఢులకుఁ డంకములీయక దేశకాలపా
త్రంబు లెఱింగి యిచ్చినపదార్థము వన్నియ కెక్కు ధాత్రిపై
నంబుధినున్న శుక్తికములందునఁ జెందిన స్వాతివాన ము
త్యంబులుగావె? ధన్యులకు హారములై వసియింప భైరవా!.

చ. సరసునితారతమ్య మది సాధుఁడెఱుంగును గాని మూఢుఁడే
మెఱుఁగును రంభఁ గూడి సుఖియించుటఁ జూడఁగఁ బాకశాసనుం
డెఱుఁగునుగాని బానిసల నెప్పటికిన్ రమియించుచుండువాఁ
డెఱుగునె దేవకాంతవలపించుట యించుకయైన? భైరవా!.

ఉ. ఇల్లుభుజంగమైనఁ దనయిష్టుఁడు వైరికి మర్మమిచ్చినన్
గల్లనిజంబు నేర్పరుపఁ గానక భూపతి చంపవచ్చినన్
దల్లి విషంబుఁ బెట్టినను తండ్రిధనాఢ్యుల కమ్మఁజూచినన్
వల్లభుఁ డొల్లకున్న నిఁక *వారల కెవ్వరు దిక్కు భైరవా.

* వారల కేగతి తిమ్మభూపతీ! యని పాఠాంతరము.

# చతుర్థతరంగము

## నీతి, హాస్యము.

ఉ. దానము లేనిసంపదలు; ధాన్యము లేనిగృహంబు శిష్టసం
తానము లేనివంశమును తాలిమి లేనిజపంబు నాత్మవి
జ్ఞానము లేనివిద్యయుఁ బ్రసన్నత లేనినృపాలుసేవయుఁ
వానలు లేనిసస్యములు వన్నెకు నెక్కవు ధర్మనందనా!.

ఉ. సారము లేనివంట సరసత్వ మెఱుంగనియాఁడిఁగొంట భూ
సారము లేనిపంట పనిసల్పనిబానిసయింట నీరు వి
స్తారము లేనికుంట పురుషార్థము లేనిధనంబులుంట యోం
కారము లేనిగంట కొఱఁగావుర ద్వారక వేంకటేశ్వరా!.

ఉ. దానము లేనిహస్తములు ధర్మగుణంబులు లేని బుద్ధియుఁ
గానఁగరానికన్నులును కాయలుకాయని వృక్షజాతముల్
కూనలు లేనిగేహమును క్రొన్నెల లేనినిశాసమూహముఁ
వేనలి లేనికాంతయుఁ బ్రవీణతఁగాంచునె? వేంకటేశ్వరా!.

ఉ. దాతకు లోభి కీడు వసుధావరునొద్దను చాడికీడు దు
ర్జాతినినమ్మఁగీడు పనిసల్పనిబానిస కీడు నారిలో
ఘాతుకుఁడుంట కీడు రసికత్వ మెఱుంగనియాఁడి కీడయా
పాతకనాశ! భక్తజనపాలక! వేంకటశైలనాయకా!.

ఉ. అంగన లేనియిల్లు చతురంగబలంబులు లేనిరాజు ని
స్సంగుఁడుగానిమౌని జనసమ్మతి లేనిప్రధాని కామినీ
సంగతి లేనియౌవనము శాంతము లేనితపంబు స్త్రీలకుఁ
ముంగర లేని భూషణము మోదమ శే? భువి రాఘవేశ్వరా!

ఉ. మాటలచేత దేవతలు మన్ననఁజేసి వరంబులిచ్చెద
ర్మాటలచేత భూపతులు మన్ననఁజేసి సుఖంబులిచ్చెద

ర్మాటలచేతఁగామినులు మన్ననఁజేసి సుఖంబులిచ్చెద
ర్మాటలు నేరకున్న నవమానము న్యూనము మానభంగముల్.

మ. తసవాదంబులు పెక్కు నేర్చిన మహారాజేంద్రులన్ గెల్చినన్
వెస సన్మంత్రము లుచ్చరించిన మహావిద్యల్ప్రసంగించినన్
అసహాయంబగుశూరత న్గనినఁ బానంబోధి లంఘించినన్
నొసటన్వ్రాసినవ్రాలు కన్నఁగలదా నూటేండ్లుచింతించినన్.

చ. గురువులరాక దాసిమృతి గుజ్జుఁపుదాడియు వానవెల్లువల్
పొరుగునన్నప్పుబాధ చెవిపోటునుదొమ్మరులాట యింటిలో
వరసతిగర్భవేదన వివాహము విత్తుట యల్లునల్కయున్
గఱవు దరిద్ర మాబ్దికము గల్గెనొకప్పుడు కృష్ణభూవరా.

ఉ. నిన్నటిరేయి నేఁ గలను నీకుఁ బ్రయాణ మెఱుంగకుండ నే
తిన్నఁగనిద్రలేచి కడు దీవ్రముగాఁ జనుదేర నీవు నా
కన్నను మున్నుగా నచటఁ గన్పడవచ్చితి దుర్ఘటంబ! నీ
వెన్నన బండలెత్త నట విస్తరలో నిడినట్టిసర్వసి
ద్ధాన్నము తట్టివేసితివహా! గ్రహచారము! దుర్విచారమా!.

ఉ. అద్దిర! సింబపోగణము నర్జునుఁడెక్కక శిద్ధిరాజుపై
యిద్దెమునేయనడ్డెముక యేటుకునేశ; గనేశునెక్కిరా
సుద్దులిబీసనుండొదర సోద్దెముగాఁగను రాభరావణా
యిద్దెమునూస్తినంచు వచియించును మూర్ఖుఁడు సంగమేశ్వరా!.

ఉ. "నల్లనిదేంది? బేరి!" "మృగనాభిరగొల్లడ!" "దాన్నిదెందురా?"
"అల్లటుగాదు, స్త్రీలుపనులందునఁ బూతురు!" "పూసినంతనే
జల్లునఁజేపువచ్చి తెగజాఱునె?" "కాదుసుగంధమబ్బు" "మా
పిల్లకుకాస్తపెట్టు" మన బేరియుఁ గస్తురి మూసెఁ గక్కనన్.

† నల్లనిదెం బేరి! మృగనాభిరవల్లవ! దీన్నితిందురా!
పుల్లసరోజలోచనలు పూతురుచన్నులఁ బూసినంతనే
జల్లునచేపునా? యెగసి తన్నక ఊరక పాలొసంగునా! (?)
గుల్లకునెంతయొ తనుచు గొంగడిపర్చిన నవీరందముల్.

క. ఏనాఁటి యగ్రహారము
మీనాఁటికి కంద్రికాయె మీపనిదీరన్
మానాఁడు మాన్యమాయెను
నానాఁటికిఁ దీసికట్లు నాగంభొట్లూ !.

క. లింగాలగురివిశెట్టికి
గంగాధరుఁ డేమిగతులు కల్పించె నయా ?
బంగారువంటికోమటి
సంగీతమువల్ల జేరసాతము లుడిగెన్.

క. వంకాయవంటికూరయుఁ
బంకజముఖిసీతవంటి భామామణియున్
శంకరుని వంటిదైవము
లంకాధిపువైరివంటి రాజునుగలఁడే ?.

విధవలు

సీ. షోఁకలు నములుచు నాకులు చేఁబూని
సున్నచుడుగువాఁడు శుద్ధవిధవ
ఇద్దఱునొకచోట నేకాంతమాడంగ
వద్దఁజేరెడువాఁడు వట్టివిధవ
ఆలితోఁ గలహించి యాఁకలిగావని
పస్తుపండెడువాఁడు పంజివిధవ
దారిద్ర్యముననుండి తనపూర్వసంపద
లూరకతలఁచువాఁడుత్తవిధవ
ఇట్టివిధవలఁ గడఁద్రోచి యొసక మెసఁగఁ
గావుమీ వేడ్క విబుధులఁ గమలనాభ !
పాహి శ్రీపార్థసారథి పరమపురుష !
తిరుమలద్దంకి మల్లికేశ్వరగిరీశ !.

సీ. వారకాంతలయిండ్ల వాసంబుఁజేయుచు
మగువకేడ్చెడువాఁడు మడ్డివిధవ
అన్నదమ్ములతోడ నాలికై ద్వేషించి
కడఁగితిట్టెడువాఁడు బడుగువిధవ
కట్నమిచ్చెదనని కాలమందీయక
గోళ్లుగిల్లెడువాఁడు కొంటెవిధవ
చదువుఁజెప్పినకూలి జఱుపుచునీయక
ఖిటకరించెడువాఁడు మేటివిధవ
ఇట్టివిధవలఁగడఁద్రోచి యెసక మెసఁగఁ
గావుమీవేడ్క విబుధులఁ గమలనాభ!
పాహి శ్రీపార్థసారథి! పరమపురుష!
తిరుమలద్దంకి మల్లికేశ్వరగిరీశ!.

సమస్య:—కామిగాఁడు మోక్షకామిగాఁడు.

సీ. నిపుణత్వమున రాజనీతిరొఱుంగక
నేల నేలెడువాఁడు నేలగాని
సంగీతసాహిత్యసరసత నెఱుఁగక
కృతిఁ జెప్పువాఁడు దుష్కృతుఁడు గాని
కుశలుఁడై యింతులకోరికల్దీర్పని
విషయాతురుండు దుర్విటుఁడుగాని
మాధవశ్రీపాద మగ్నతఁజెందక
ముక్తిఁగోరెడువాఁడు రక్తిగాని
అతిదయాభిషక్తి యతులితమగుయుక్తి
యంగనానురక్తి యచలభక్తి
పరతఁగాంచమన్నఁ బతిగాఁడు కవికాఁడు
కామిగాఁడు మోక్షకామిగాఁడు.

శ్రీ ర స్తు.

# చాటుపద్యరత్నాకరము

## పంచమతరంగము.

---

### అర్థకందమున దశావతారములయిమిడిక

క. వనచరములు నాల్గరయఁగ
మనుజాకృతు లేను పైనిమావొక్కటియై
తనరిన నరహరి మాకెపు
డనుపమసౌఖ్యంబు లొసఁగు నవనీస్థలిలోఁ.

### దశావతారశ్లేష

క. ఏమీననఁ దాఁబేలన
నాముంగిటికేలరాఁడు? నరహరి పిన్నా!
రాముని ముమ్మాఱంపితిఁ
బ్రేమంబున బుద్ధిఁజెప్పి పిలువవెకలికీ!.

### భృత్యులు

క. వాసవరవిసోమార్కులు
వాసవరవిసోమసుతులు వాసవసుతులుఁగ
వాసవులు కవులు సోములు
వాసవరవిసోమసుతులు వాకిట భృత్యుల్.

## శ్రీగండవరపమ్మ దండకము

### రచయిత చేజర్ల నారాయణకవి

శ్రీమత్ప్రశస్తావనీనిస్తులద్దేశదేశాభిముఖ్య ప్రకాశో జ్జ్వలస్థానమై యొప్పు నప్పాక నాటిప్రసిద్ధ స్వదేశంబునం జాల రంజిల్లు కుల్లూరు సీమందుఁ చేజెర్ల గ్రామంబునం బూర్వకాలంబునం దుద్భవంబైన గండారపమ్మాఖ్య విఖ్యాత యాశక్తి యుక్తి ప్రకాశోన్నతిం జెంది తత్తీర్థ సేవావిశేషార్థము ల్మాని స్వస్థానమానాభిమానంబుఁ బోనాడి తానేగి కొన్నాళ్లు లున్నంతలో శోభకృద్వత్సరంబందు వైశాఖమాసాన శ్రీపాకనాటీకులశ్రేష్ఠుఁడైనట్టి తూమాటి వెంగన్న స్వప్నంబులో వచ్చి సాకారరేఖావిలాసంబుతో శక్తిప్రత్యక్షమై ప్రేమఁ దత్పూర్వ వృత్తాంత మాద్యంతముం జెప్పి తానప్పుడే యప్రకాశంబునుం బొంద నవ్వేళ వేగంబె మేల్కాంచి యత్యంతసంతోష ముప్పొంగ నావెంగధీరుండు శూరుండు నారీజనానందసౌందర్యకందర్పుఁ డాభోగదేవేంద్రుఁడా సద్గుణైశ్వర్యసంపన్నుఁ డాకాంతిచంద్రుండు సత్కీర్తి సాంద్రుండు ప్రత్యర్థిమత్తేభకంఠీరవాభుండు సౌఖ్యోన్నతిం జెంది చేజర్ల చెన్నాభిధానప్రభావాచ్యుతానంతగోవిందుఁ డైనట్టి యద్దేవు నవ్యాద్భుతాకారగర్భాలయాద్యంతరాళంబులుం దద్విమానప్రపద్యత్కటాక్షస్ఫురద్వైనతేయాదిసద్వాహనంబుల్ మహావిశ్వకర్మాంశసంభూతులౌ భీమలింగయ్య గుర్వయ్య చెంచాభిధానాది శిల్పాధికారప్రసన్నుల్ ప్రభావజ్ఞులౌ వారిచేత న్వినోదంబుగాఁ బూని నిర్మింపఁగా నెంచి తర్వాత గండారపమ్మ న్వినోదంబుగా శక్తి రూపంబు నాశిల్పశాస్త్రప్రకారంబుగాఁ గోశలం బొప్పఁ జేయించెఁ దచ్ఛక్తి సౌందర్యముం జూచి వర్ణింపఁగా బ్రహ్మకున్ శక్యమే గాదు నిక్కంబుఁ జొక్కంపుస్వర్ణాంశసంభూతహైయంగవీనాభ్రసంజాతవిద్యుల్లతాతుల్యదేహన్ జగన్మోహనాకారతారుణ్యలావణ్యదుగారవావిర్భవ

తపూర్ణచంద్రాననఁ జూడ దృగ్గోచరంబైనతల్లిన్ విలోకించి నేనెంత సేవింతు భావింతు నాయంతరంగంబునం గట్టిగా సూటిగా నాటఁగా, నీటుగా నున్నయద్దేవి దివ్యావతారంబుగా నొప్పు చందంబు నందంబుతో నుత్తమాంగంబుపైనం గిరీటప్రభల్ భానుబింబంబు తేజంబుమాయింప, నయ్యిందుబింబావతంసంబు తత్ఫాలభాగంబునం దొప్ప, నాభ్రూతిరేఖల్ ముఖాబ్జంబునందందమైయొప్ప కందర్పబాణంబులం గేరు నేత్రంబులా నందముం గొల్పఁ దన్మధ్యదేశంబునం దున్నతంబైన సంపెంగసూనం బు నా నొప్పు ముక్కుందున న్మౌక్తికల్లాడ ముత్యంబునృత్యంబుతో నిక్కి తాధిక్కరింపంగ మాత్సర్యముంబూని తారక్తసిక్తాంగమై మ్రింగనుంకించు బింబాధరశ్రీలనొప్పారువక్త్రంబునన్ హాసము ల్గుల్కఁగా వజ్రతుల్యంబులౌ దంతధావళ్య మారెంటినిం గప్పఁగాఁ గంబుకంఠంబు ఘోషింప ధర్మాంగ శాగ్రప్రభాభూషణవ్రాతముల్ పట్టి పల్లార్చిచిందాడఁగా రత్నతాటంకయు గ్మంబుతో డ్డోడ వర్తించుచుండంగ నా చెక్కుటద్దాలుముద్దాడ సంగీతసాహి త్యసామాగమంబంతలో నృత్తతాళానురూపంబులై గొప్పలై యొప్పుచున్న ట్టివక్షోజకుంభంబు లుప్పొంగఁగాఁ జూచి తత్కంఠహారంబులం గప్పు నాచొ ప్పువీక్షించి రంగైన యాపైటకొంగంత లోగంతులన్వేచి హారాలుపోఁ ద్రొబ్బి తాగొబ్బునం గుబ్బచందోయిపైఁ జక్కఁగా దండలుద్దండవృత్తిన్ వుడాయించి యాకొంగుపొంగారఁగాఁ ద్రొక్కుచుండంగ నూగారునాభి ప్రదేశంబునందున్న బంగారుటొడ్డాణ మామధ్యదేశంబు నాశంబు గావింప షోణీతలశ్రోణి తా నీవిబంధానుబంధంబుతో చిత్రవస్త్రంబుపాదాల పర్యంతముం గట్టఁగా డెప్పరంబైన హారంబుతోఁ గింకిణీనూపురద్వంద్వ ముల్లోడుగాఁగూడి ఘోషింపనీలాభ్రసంకాశవేణిన్ సదామంజువాణిన్ శరత్కాలసంపూర్ణచంద్రాననన్ గుందమందారహాసన్ సునాసన్ జకోరా క్షినక్షీణతైరిరేఖ భ్రూతిర్యల్లాటం జలాటాన్వయగ్రీవ సద్భావ జంభారిగం క్షీర కుఁక్షీక్షవత్కక్షధిక్కారకుంభత్ స్తనిన్ నిస్తులద్బాహుదండో

భూషావిశేషన్ అశేషామరస్తుత్యపాదారవిందన్ సదానంద లోకైక మాతన్ మహాపాతకవ్రాతజీమూతవాతన్ ద్రిశక్త్యాదిశక్తిన్ గుణాతీత నవ్యక్తఁ బూతన్ జగన్నేత్రి బ్రహ్మాదిమూర్తిత్రయాధార వేదాంతసారన్ నిరాకారఁగా సన్నుతుల్ సేయఁగావచ్చి సాకారరూపంబుతో నున్నయా దేవికిన్ సిల్లు బోనాలు బొంగళ్లు నివ్వాళ్లు గర్పూరసాంబ్రాణిధూపంబు సూపాన్నపూపాది భక్ష్యంబులు న్వేఁటలున్ ఆటలున్ బాటలున్ గండదీపాలువస్త్రాలు శస్త్రాలు శివ్వాలు బువ్వాలు పవ్వాడముల్ వారముల్ మంత్రముల్ యంత్రముల్ తంత్రముల్ జంత్రగాత్రంబుతోఁ బాడువీణాది వేణుస్వనానందముల్ గంధముల్ పిండిగండంబు జందేలుచిందేలు పచ్చాకుపుష్పాళ్లుజవ్వాజికస్తూరి కర్పూరముల్ దీపముల్ ధూపముల్ హారతుల్ చిందులున్ చప్పటల్ తప్పెటల్ జమ్మికల్ కొమ్ములున్ పంబలున్ గుంభముల్ సుద్దులున్ గద్దెలున్ పద్దెముల్ మద్దెలల్ కీర్తనల్ నర్తనల్ వెండిబంగారపుంగిండ్లు సింగారంపుంబండ్లు మాధుర్యపుంబండ్లు చేచల్లయుంగల్లు సారాయి మాంసంబురక్తంబు యుక్తంబుగాఁదెచ్చు పచ్చళ్లనచ్చంపు నూబిండికూరాకులున్ యిడ్డెనల్ లడ్డులున్ చక్కెరల్ ఉక్కెరల్ బిల్వపత్రంబులుం బుష్పముల్ పచ్చనక్షింతలున్ బోగు నూళ్లాదిగాఁగల్గు సర్వోపచారాలతో బ్రాహ్మణక్షత్రవిట్శూద్రులున్ శాయనాసాదిపై నేళ్లు మాతంగులామద్యపానంబుచే మత్తులై బూతులాడంగఁ జూడంగ నాఁడెంతయున్ వేదఘోషంబుతో శంఖభేరీమృదంగాదివాద్యధ్వనుల్ సన్నమేళంబుతో మిన్నుభేదింపఁగాఁ బూర్ణహర్షంబుతో వచ్చి తద్బాణవిద్యాది నానావినోదంబులంజూచి యానందముంబొందఁగానందమా సుందరుల్ మందలై మందయానంబుతో గంతుపూబంతులై మించి పూఁగొమ్మలై కమ్మలల్లాడఁగా రత్నపుం సొమ్ములంబెట్టి చూపట్టు పట్టాంబట్టు పుట్టంబులాప్పారఁగాఁగట్టిదట్టంబుగా గంధకస్తూరిజవ్వాజి నెమ్మేనులన్మెత్తి గుత్తాపుఁ జందోయిపైవ్రేలుతో రాలహారాలు వేఁజింపులంద్రొక్కఁ జొక్కంపుఁ గస్తూరిగ

తాంబూలముల్ సేయుచున్ పాయుచున్ జోడుగాఁగూడుచున్ గొప్ప
లంజుట్టుదట్టంపుఁ జెంగల్వప్రూదండ లొండొండు తండోపతండంబులై
తత్కటిదీపముల్దాటి వ్రేలాడఁగా నవ్వుచున్ జవ్వనుల్ కేరుచున్
మూఁకలోదూఱుచున్ బోయి యాయాసముంజెంది తద్దండభాగంబులం
దీర్చు కస్తూరికావక్ర పత్త్రానుసమ్మిశ్రమై జారుఫాల ప్రదేశంబునంబుట్టి
ఘర్మాంబుజాలంబు మూలంబుగాగోరులం గిరిపార్శ్వంబులందున్న సౌంద
ర్యకందర్పులం జూచి హాస్యంబుగా వారిలోనన్ వికారాంగంబులంజూచి
నేత్రంబులన్ జిమ్ముచున్ మమ్మరం బైనయాపేక్షతో వచ్చి గండారపమ్మ
న్వీలోకించి దండప్రణామంబులంజేసి తాంబూలములెవ్వట్టి యాశక్తియా
కార మాద్యంతముంజూచి యానంద మగ్నాంత రంగంబు లుప్పొంగ ము
గ్ధాంగనల్ నాసికాగ్రంబులం దర్జనీయంగుళాలుంచి యాశ్చర్యముంబొంది
సందేహముల్ దీఱ "కోయమ్మ! యీయమ్మ నణొత్తిపైనున్న దేమే? అదే
బొప్పిగా; కాదు చూడే గరాసా! కిరీటంబు; ఓయబ్బ! యీయుబ్బుగాను
న్న రెండేంటివే? కణ్తులే; కావుచీ కుయ్యకే గుబ్బచన్గొండలే; గొడ్డుబోతా
దదో? పట్టితేగట్టిగానున్న పీచన్ను; లట్లందురా దోసమే నోరుపుచ్చని,
ఈగొంతుచుట్టేంటివో? తోలుపాదాలు; నీకండ్లు చెడ్డావటే రత్నహారాలు
ఈనోరుగబ్బేమొకో? కల్లుచాగేదిగా? వుండవే గొండగొయ్యా! యిదేగం
ధకస్తూరికావాసనేయమ్మ! యిన్నాలుగున్నేంటివో? తెడ్లుగా; కావుహ
స్తంబులేబోటి! వొడ్డారమాదీనిసుట్టేంటివో? విల్లుగా; కాదె ఓమల్లి! నీవా
ల్లుకొవ్వెందటే, చూడవేతోరణం; దీనిపైనున్న దీబాకినోరేమొ? చెయ్యిటే
ట్టితేకర్నినో పిల్లియేమొకొ? కాదే బికారీ! యిదేసింహతల్లాటమే య
క్క! నిక్కంబుగాఁ జెప్పవే దీనివోళ్లంతయున్ దెల్లఁగా నెఱ్ఱఁగా నున్న
వీచారలేమే? బళాస్ఫాటకంమచ్చలే యిచ్చకమ్మాటలో పిచ్చికల్లాల। యీ
యమ్మమేనంతయున్ సొమ్ముతో కమ్మియున్నట్టి యీయమ్మ తాఁగట్టు
కున్నట్టి చిత్రంపుచీరందమే; చేతులంబట్టుకో పొంచుకున్నట్టి విద్యేంటివో

చెప్పవే జడ్డిగప్పిడ్డయుఁ మూకుడుఁ గోలయుఁ గొజ్జులున్నట్టుగా నున్న
వే చూడవే, అంటివేకొమ్మ! నీవింక నోరెత్త కీనాలుగుఁ దక్కియుఁ గి
న్నెయుఁ గత్తియుఁ శూలముఁ యుల్లమందుంచుకోఁగట్టిగా మంచిదోయ
మ్మ తానాడదేశంటివే, అంటుముట్టై తెరయేలాగుపూజారి తానీళ్లుకాపించి
పోశీని? యిట్లాడితే నాలుకల్గాయ్యరా? అయ్యయో పాపమేతల్లి! ముల్లోక
ముల్ ప్రోచు నిల్లాలికిఁ అంటుముట్టొచ్చునా? దైవమే మ్రొక్కవే,
కుయ్యికవ్యక్తురాలా! అదేతిట్టబోకేపెకుం బిడ్డలా? గొడ్డుగా; చూడు నే
నెంతఁగా దిట్టినా గుట్టుగానుండగా నేరవేమందు నీయందు సుజ్ఞానమార్గం
బు గొదంతయుఁ లేదు యీయమ్మకుం జంగమస్థావరాలాడిగా గల్గు
యీజంతుజాలంబుతోఁగూడ వారందఱుఁ బిడ్డలీమాటను న్నామ్మఁమాటా
డఁగా వద్దు శోభిల్లంచు సుజ్ఞానముం దెల్పియందొక్కచోఁ గూడి యాసుం
దరీబృందముం దానదద్దేవతాగారము న్వీడిస్వస్థానమార్గమ్ములంబట్టి తా
మేగి; ఠీరితి నిత్యోత్సవక్రీడ ప్రత్యబ్దమాశక్తికిం జెల్లుచుండంగచే జెర్ల చెన్న
ప్పకు న్నెప్పుగాఁ దీర్ఘసేవావిశేషంబు లేకోట నత్యంతసంతోష మొప్పా
రఁగా సాగుచుండంగఁ దానిత్యముం జెన్నకేశుండు నీశుండు వేదాంతసా
రుండు ధీరుండు కంజాతనేత్రుండు పాత్రుండు బ్రహ్మాదిసేవ్యుండు భా
వ్యుండు నాద్యంతశూన్యుండు మాన్యుండు నానాగుణౌఘాభిరాముండు
భీముండు ఓంకారవాచ్యైకరూఢుండు గూఢుండు మాణిక్యవక్షస్థలాలం
కరిష్ణుండు జిష్ణుండు మార్తాండకోటి ప్రభాభాసమానుండు నిత్యుండనిత్యుండు
గోవిందుఁడానందుఁడై లోకముల్ మోదముం జెందఁ బాలించుచు న్వచ్చి
తూమాటివెంగన్నకుం బుత్రపౌత్రాదిసంతానసౌభాగ్యముల్ గూర్చి చేజర్ల
రంగప్రధానాగ్రణీసత్కుమారుండు నారాయణాఖ్యుండు నిర్మించునీదండ
కం బెప్పు డెవ్వారు భాషింతురెవ్వారలున్వీందురో వారికవ్వారిగా సంపదల్
గూర్చి రక్షించు మోదేవదేవీ నమస్తే నమస్తే నమః.

## హెచ్చరిక

ఉ. చంద్రకళాధరుండు కలుషానలవారిధరుండు శంకరుం
డింద్రియలోలదూరుఁ డఖిలేశ్వరుఁ డద్రిసుతాసమేతుఁడై
మంద్రవచోవిశేషపరమామృతసేచనమొందుచున్నవా
డింద్ర! పరాకు వే విడిచి యీనిశి నీదిశఁ గాచియుండుమా.

ఉ. మానిమనోంబుజాంతరనిమగ్నపదద్వయ షట్పదుండు కా
దేనవిభూషితుం డజుఁ డతీంద్రియుఁ డద్రిసుతాధరామృతం
బానుచుఁ గార్యకారణమయాత్మసుఖంబునఁ జొక్కినాఁడు వై
శ్వానర ! యీత్రియామమున సన్మతి నీదిశఁ గాచి యుండుమా!..

ఉ. కుండలిమండనుం డసురకోటివిఖండనుఁ డంగజాహితుం
డండజవాహనాత్మహితుఁ డవ్యయుఁ డాఢ్యుఁ డగేంద్రకన్యకా
ఖండతరోపగూహనసుఖంబున మిక్కిలిఁ జొక్కినాఁడయా
దండధరా ! వివేకమతి దక్షిణ మీనిశఁ గాచియుండుమా.

ఉ. హేమనగేంద్రచాపుఁ డురగేంద్రకలాపుఁ డుపేంద్రమిత్రుఁడా
హైమవతీపయోధరయుగాంతరతల్పశయానురక్తుఁడై
శ్యామపయోధరాంతరనిశాంతతటిల్లతఁబోలియున్నవా
డేమర కీవు దైత్యవర! యీనిసి నీదిశఁ గాచియుండుమా.

ఉ. సూరినుతుండు దర్పకనిషూదనుఁ డార్తశరణ్యుఁ డీశుఁ డిం
పారతుషారశైలతనయాపరిరంభణచుంబనాదిశృం
గారకళావిశేషపరికల్పితకాముకుఁడైనవాఁడయా
వారినిధీశ! యీనిశ ధ్రువంబుగ నీదిశఁ గాచియుండుమా.

ఉ. భూతగణేశ్వరుండఖిలభూతదయాపరుఁ డీశుఁడాజగ
న్మాతమనోగతుల్వెలయ మంజులతల్పశయానుఁడై మనో
జాతవిలాససంజనితసౌఖ్యరసంబునఁ జొక్కె సుమ్మీ యీ
రాతిరి గంధవాహ! మదిరంజిల నీదెశఁ గాచియుండుమా.

ఉ. రాజకళాధరుండు కవిరాజితభూధరమందిరుండు వి
భ్రాజితనీలకంధరుఁ డరాతిభయంకరుఁడద్రికన్యతో
రాజమరాళతల్పమున రంజిలి మిక్కిలిచొక్కినాఁడ యీ
రాజవరేశ! యీరజని రంజిల నీదెశఁగాచియుండుమా.

ఉ. ఈశుఁడశేషలోకనుతుఁ డీప్సితదాయకుఁ డద్రికన్యతోఁ
బేశలపుష్పతల్పమునఁ జేర్చి పెనంగియనంగసంగర
క్లేశసముద్గణాంబుకణకీర్ణవికారశరీరియైనవాఁ
డీశ! దిగీశ! యీనిసిని నింపుగ నీదెశఁగాచియుండుమా.

ఉ. నందకపాణిసౌహృదుఁ డనంతుఁ డభేద్యుఁ డఖండసచ్చిదా
నందుఁ డుమార్ధవిగ్రహఘనాంబుమవంబుదగర్భనిర్గతా
స్పందకశోరుఁడై హరుఁడు తత్పదమంది వెలుంగుచుండెనో
నందిముఖప్రధానగణనాయకులార! చలింపకుండుఁడీ.

ఉ. మానితభూజలాగ్నిపవమానవిహాయసమానసాధికా
ధీనకృతాంగమధ్యసముదీరతనిర్జరతిస్రగంతరో
ద్యానవిహారుఁడై హరుఁడు తత్పదమంది వెలుంగుచుండెనో
మానసమా! వినిశ్చలసమాధివహించి భజించుచుండుమా.

## రాముఁగనుగొంటి.

సీ. శ్రీకరరత్నశింజితనూపురాన్విత
పాదపద్మంబులఁ బరఁగువాని
గాంచీకలాపసంఘటితహస్తంబులు
కాంచనచేలంబుఁ గలుగువాని
గ్రైవేయకంబులు కమనీయహారము
లంకణాంగదములు గలుగువాని
మకరకుండలరత్నమహనీయమకుటస
న్మందహాసవిలాసమహిమవానిఁ
జెలఁగిసింహాసనంబున సీతతోడ
రమణఁగూర్చుండి రాజ్యపాలనము సేయు
నట్టికోదండరాము నేనాత్మలోన
మెలఁగఁ గలఁగంటి నంతట మేలుకొంటి.

## ఆశీర్వాదము

చ. మనసిజుమామమామయభిమానమడంచినవానిమామనం
దనునివిరోధినందనునినందనుసుందరిమేనమామఁ జం
పినజగజెట్టిపట్టిఁ బొడిఁజేసినశూరునితండ్రిఁ గన్నగ
గొనినసురాధినాథునితనూభవునాయువు మీకొసఁగయ్యెడున్.

ఉ. మామను సంహరించి యొకమామను గర్వమడంచి యల్లఁజే
మామను రాజుఁజేసి యొకమామతనూజునకాత్మబంధుఁడై
మామకుఁగన్నులిచ్చి సుతుమన్మథు నింతికిఁ దానె మామయై
మామకు మామయైన పరమాత్ముఁడుమీకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

సీ. అన్నపై శయనించి యన్నను పైనుంచి
యన్నను మునిమాపు హతము సేసి
అన్నసుతు రక్షించి యన్నసుతు శిక్షించి
యన్నసుతునకుఁ దనయనుజ నిచ్చి (?)
మామకు మామయై మామను బంధించి
మామసుతుధరకు మామఁ జేసి
కొడుకుకు బావయై కూఁతురి పెనిమిటై
కొడుకునాలములోనఁ గూలఁ జేసి
మించు శ్రీహరి కరుణచే మీకు నొసఁగు
బహుతరంబగు నాయురైశ్వర్యములను
వస్తువాహనసంపన్న వైభవముల
సకలసామ్రాజ్యవిభవంబు సంతతంబు.

గీ. ఆలినొల్లక యున్న వానమ్మ మగని
నందులోపల నున్న వానక్క మగని
నమ్మినాతనిఁ జెఱచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్లఁ గరుణతోడ.

ఉ. ఆలికి నల్లుఁడై పిదప నల్లునికిం దగఁ దానె యల్లుఁడై
యాలికిఁ దండ్రియై మనుమరాలికిఁ దండ్రికుమారుఁడై సదా
ఆలిమఱందిచెల్లెలికి నర్మిలి భర్తయు నాచునొప్పు గో
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచార మేటికిన్.

లేఖకుఁడు

గీ. తప్పు సవరించి వ్రాయు టుత్తమము లేక
ప్రతిసమానముగా వ్రాయు టతిముదంబు

రెండువిడిచియు వ్రాసెడు లేఖకుండు
కలిమి కవిసేయు భాగ్యంబుగాదె కృష్ణ!.

క. ప్రతిఁజూచి వ్రాసినాఁడను
అతిసెబ్బలువ్రాలుమాఁడనన్నియుఁదప్పుల్
యతియనుప్రాసముసెఱుఁగను
మతిమంతులు తప్పుదిద్ది మన్నింపరయా!.

చాటుపద్యరత్నాకరము

సమాప్తము

# విక్రయమునకు సిద్ధముగా నున్న గ్రంథములు

## 1. ప్రణయ కుసుమము

ఇది లోకోత్తరయగు నొక మహాపతివ్రత చరిత్రము. ఇందలి కథాసంవిధాన మపూర్వము. రసభావ భరితమై, మృదుమధుర శైలిచే పాఠకలోకము నాకర్షించు నీ మనోహర కావ్యమునకు విమర్శవిద్యాస్వతంత్రులగు బ్ర. శ్రీ. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు వ్రాసినపీఠికయును గలదు. వెల 0-12-0

# ప్రణయ కుసుమముపై పండితాభిప్రాయములు

పిఠాపురము,
28-8-26.

మహారాజశ్రీ

నడకుదుటి వీరరాజు పంతులుగారు

దయాపూర్వకముగ మీరనిచిన "ప్రణయ కుసుమము" అను చిన్నపొత్తమును జేకొని యపారముద్రససమాప్లావిత హృదయుండనై పఠించి మీకవనంపుసొంపున కెనలేని యాశ్చ

ర్యానందములను బొందితిని. గ్రంథ మంతయు మృదుమధుర పద సంఘటితమై యెల్లరయుల్లంబులఁ బల్లవింపఁ జేయునదిగా నొప్పారుచున్నది. అందందు తిక్కనకవి శబ్దభావముల మేలి కూరుపు, నాచనసోముని మనోహరపద సంఘటనము, నన్నిచోడకవిరాజు జానుతెనుంగు సోయగము, మొదలగు సత్కావ్యలక్షణములు గలిగి, నవీనభావ విన్యాసములతోఁ జెన్ను మిగిలియున్నది. వేయేల? మీఁహాత్తమాకృతిని జిన్నయయ్యు గుణములచేఁ బెద్దగాఁ బరిగణింపనర్హమై యలరారు చున్నది. గ్రంథపీఠికయు స్తవ్యమై యొప్పారుచున్నది.

# త్రిలిఙ్గ

........ప్రబంధ కవులవలెఁగాక శుద్ధప్రేమ యొక్క సత్త్వస్వరూపమును చిగురుజొంపముల, పూలమొగ్గల, శుకముల, పికముల, నదుల, సరోవరముల, తేటుల, సీతాకోకిలములఁగాంచి ఆశృంగారోన్మాదమున సృష్టికొక క్రొత్తమెఱుంగు పెట్టఁగల మహాకావ్యయుగము నేఁడవతరింపవలసి యున్నది. అవతరించుచున్నది. తత్సూచకముగనే ఈప్రణయకుసుమము వెలువడినది.........ఈచిన్న కావ్యము........నూతన యుగ సంవర్ధకము, భావగీత సంశోభితము, హృదయానంద సంధాయకమును. కవి యశంబు కల్పస్థాయియగుంగాక!

గా. హరిసర్వోత్తమరావు.

# ఆంధ్రపత్రిక

ప్రణయకుసుమము..................ఉపాధ్యాయ హారి
హారుని కావ్యమువలె దృశ్యముగను, ప్రబోధ పరముగను, శాంతరస ప్రధానముగను నుండక ........శ్రవ్యముగను, ప్రణయపరముగను, విప్రలంభరసప్రధానముగను నుండి మిగుల మనోహరముగ నున్నది. ఈఖండకావ్యము......... పేరునకు తగినట్లుగా దళముల క్రింద నాలుగుభాగములుగ విభజింపఁబడి నది..........శాస్త్రిగారి కవితాలత ఈగ్రంథమునందు పుష్పించినదనుటకు సందియము లేదు. కనుకనే ప్రణయకుసుమము నందలి సౌరభము విదగ్ధజనుల నాకర్షింపఁజాలియున్నది. ఇందలి ఇతివృత్తమునకుం దగిన పదపదార్థ రసావిష్కరణ చాతురి యును, అందు కనఁబరచిన ఔచిత్యమును, మిక్కిలి గమ నింపదగియున్నవి..............ఈకవిగారిత్తోధిక సేవను ఆంధ్ర సారస్వతమున కొనర్పఁ బ్రార్థించెదము.

సిద్ధాంతం,
15-6-26.

మ. రా. రా. శ్రీ
త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు దొరవారు

తమరు దయతో నంపిన "ప్రణయకుసుమము" నాకుం జేరినది. అందలి మృదుమధుర కవితా మరందమును గ్రోలి యమితానందము నందితిని. ఇంతకు మున్నే పత్రికలలో తమ కవితారసమును కొంతచవిచూచి యుంటిని..........

# SWARAJYA.

The wellknown Andhra poet Mr. D. PITCHAYYA SASTRY of Nellore has kindly sent us a ccpy of his newly published "ప్రణయకుసుమము" a Prabandham in Telugu. On perusal I am convinced that the new path sketched out by the poet is beautiful and that the treatment is in a masterly fashion. The book abounds in various descriptions mostly of Nature and I may add that these descriptions heighten the intensity of the plot rather than detract the attention of the readers.

As regards the style of the varied verses of the book I venture to say that it is not only copious and vigorous but also rich in its simplicity. I am sure that the book deserves to have a place among the many gems of Andhra Literature and I recommend it to the perusal of the Andhra Young men.

K. S. R.

పిఠాపుర సంస్థాన విద్వత్కవులు, ఓలేటి వేంకటరామ శాస్త్రిగారు, కవితావిలాసము, 10-9-27.

మీ "ప్రణయకుసుమము" మృదుతయు, రసమును, సుగంధమును గలది గావున సుమనో మనోహరముగా నున్నది.

చింతా దీక్షితులుగారు, బి. యే. యల్. టి. బందరు

మీ "ప్రణయకుసుమము" సౌరభోపేతమే అని నిశ్చయించుకొన్నాను. మీరు సరిద్రమణిని గురించి వ్రాసిన

"ప్రకృతిరహస్యముం దలంచి
పాడుచున్నది భావగీతముల్".

అనేపద్యపాదము మీ గ్రంథమునకుంగూడా అనువర్తిస్తున్నదని నాకు తోంచినది.

మీకవిత్వము చాలామనోహరముగా నున్నది. మీరు చేసినప్రకృతివర్ణన హృదయంగమముగా ఉన్నది. భావకవిత్వ మంటే తలకంటగించుకొనేవారు మీపుస్తకముచదివినట్లయితే వారికాజబ్బు నిమ్మళించవచ్చును........ఆడపిల్లల నోములు, సూర్యోదయవర్ణనము, 'నవీనవనీవినోదముల' వర్ణనము— ఇవి అన్నిస్వభావసిద్ధముగా మిక్కిలి మనోహరముగా వర్ణించి నారు.

మీ కవిత్వము నిరాఘాటముగా సాగుతున్నది. ఉత్తే జము గలిగించే యీనాటి సారస్వతమున మీకావ్యముమంచి స్థానమాక్రమించగలదు.

విజయనగర సంస్థానాస్థానకవులు.

భోగరాజు నారాయణమూర్తిగారు

విజయనగరము
17-10-2

కవిచంద్రమా!

తమ........'ప్రణయ కుసుమ' మను కావ్యరత్న మును వందనపూర్వకముగ నందుకొంటిని.

భావకవిత్వమను పేర నొకవిధమగు వింత కవిత్వమున నిండియున్న యీనవీనయుగములో నిట్టి యుత్తమకావ్య సృష్టి గావింపఁగలిగిన మీరెంతయు ధన్యులు. 'ప్రణయ కుసుమ' మను మీగ్రంథనామమును జూచిన యంతనే యియ్యదియుఁ బ్రణయపదమూఁత పదముగాఁగల నేటి భావకవిత యేమో యని భయపడితిని. కాని విలోకించుకొలఁది నియ్యది మీ పూఁచిన పూర్వకృత పుణ్యలతికాలతాంత మని తెలిసినది. 'ఉచ్చ భూభాగములనుండి యుఱికియుఱికి వడిగుభాలున'దూకి 'చెదరి పొంగి పొరలఁగ రేఁగు' మీకవితాలహరీ మాధురీరస శీకరములు 'కవుల వర్ణనలకు మించి క్రాలు'చున్నవి. మీరు వర్ణించిన పులుఁగుదంపతుల ముచ్చటలయందలి భావముల నైన నొకప్పుడూహించి గ్రహింపవచ్చుంగాని నేటి భావకవుల భావకవితలయందలి భావములుమాత్ర మభేద్యములు. అట్లు గాక సరళపదజాలములవలన నప్రయత్నముగఁ బ్రసన్నము లగుచున్న విరళభావ పరంపరలంగలిగి 'యలఁతి తొలిపడ్డ చంద్రమండలముఁనుండి జలజలనురాలు నమృతంపు జాలులీల, రసము తొలకించు మీప్రణయకుసుమము భాషాయోష కవతంసకుసుమము కాఁగలదు.

విద్వత్కవులు-వడ్డాది సుబ్బారాయశాస్త్రిగారు

రాజమహేంద్రవరము, 31-10-27.

...........తమ.......... ప్రణయ కుసుమమును సమగ్రముగాఁ జదివినాఁడను. అందలి యనర్ఘళమయిన కవితా

ధారయును, రసానుగుణములయిన వృత్తిభేదములును, విషయానుకూలము లయిన వర్ణనాకల్పనములును, మిగుల శ్లాఘనీయములు. తత్కుసుమమునందలి ప్రథమ ద్వితీయదళములు తృతీయదళములోని విషాదకర విషయమునకు సూచకములుగ దోఁచుచున్నవి. తద్దళములోని పద్యములు మిగులరసవంతములయి స్త్రీలకుఁ బాతివ్రత్యబోధకము లగుచున్నవి.

(పుట 54) "బహువిధ ఫలపరంపరలై దువుల కిచ్చి
పడఁతినోఁచెఁ బదారుపండ్ల నోము."

ఇత్యాదిలోకానుభవ ప్రకాశకస్వభావవర్ణనలు పెక్కులు పాఠకహృదయాకర్షకములుగా నుండుటఁబట్టి మీకవితాప్రౌఢిమ కొనియాడఁదగినది.

## 2. భా ర తి

"భూపతిఁ జంపితిక్ష మగఁడు భూరిభుజంగము చేతఁ జచ్చె" నను చాటుపద్యములోని కథ కిది విపులీకరణము. దాదాపు 400 పద్యములు. ఇందలి కథాకల్పనము మిగుల నద్భుతావహము. సులభశైలిగలిగి పద్యములు రస మొలుకుచుండును. వేయేల రసికులగువారు తప్పక చదువ వలసిన కావ్యము. వెల రు 0-10-0.

## 3. కా ల ము

కాలమహిమను గూర్చిన పద్యశతకము. ఇందలి భావములు ప్రౌఢములు. పద్యములు హృద్యములు. వెల 0-4-0

### 4. సువర్ణ మేఖల

"ఎరువుల సొమ్ములు బరువులచే" టన్న సామెతయే యిందు కథగా పరిణతిని గాంచినది. ఇది స్త్రీలు తప్పక చదువ దగిన చిన్న పద్యకావ్యము. వెల 0-4-0

### 5. భక్తకల్పద్రుమము

భక్తిరసభరితమగు శతకము 0-2-0

### 6. నెల్లూరు గాలివాన 0-2-0

### 7. విష్ణ్వాప దశావతార స్తవము

తెనాలి రామకృష్ణకవి రచితము లగు దశావతారపద్యములు. సంస్కృత వ్యాఖ్యా తాత్పర్యములును ప్రతిపద టీకా తాత్పర్యభావ వివరణములును కలవు. వెల 0-4-0

దీపాల పిచ్చయ్యశాస్త్రి,

కలానిధి కార్యస్థానము, నెల్లూరు.